



మురళి

చిత్రకారుడు : శ్రీ సి. రంగస్వామి.




విరోధి సం. మాఘము | భారతి | సంపుటము 27 సంచిక 2


# విజయప్రస్తావన


శ్రీ కొమరవోలు వెంకటసుబ్బారావు


లంకాశంకరశైలలాలితమహోర్వ్యక్షోణి కీనాటికిన్
సంకెళ్లూడె, స్వతంత్రవాయువుల సంచారమ్ము హెచ్చెన్, నిరా
తంకప్రక్రియ ధీరులైరి శిశువృద్ధస్త్రీజనానీకముల్
సంకోచింపగ నేల? సంధిలె స్వరాజ్యం బింక పూజ్యంబుగన్.

అన్నవస్త్రములకై యటమటించెడు ప్రజాకోటి కుండదుగదా కూటికఱవు,
వేషభాషలఁజేసి ద్వేషరోషము లొందు జనుల నొందవుగదా దినము లింక
లంచగొండితనమ్ము పంచ బొంచిన దురుద్యోగు లౌదురుగదా యోగివరులు
ఎల్లర నేడ్పించు నల్లబాజా రింక మారుగా తెల్లబాజారుగాఁగ
అరయ పాతికపొట్టగా నారగించు-కష్టజీవికి తీరుగా కడుపుకస్తి
అణగద్రొక్కఁబడినట్టి యాడుజాతి-కిక లభించుగదా పురశ్చ్యకచకేచ్ఛ!

హితవగు తిండి, దేహమున కింపగు బట్టయు, నొళ్లు దాచుకో
గతి యగు కొంపయుం, దవిలి కష్టము జేసెడువాని కూరిలో
బ్రతికెడు తెర్వు, రోగులకు వైద్యము, కమ్మగ ద్రావ నీరముల్
జతపడి పల్లెపట్టులకు చక్కని జీవన మబ్బుగావుతన్.

త్రిస్ఫోటాణవదారుణాస్త్రములతో దిగ్దేశజాలమ్ములన్
బ్రస్ఫోటింపదలంచు నయ్యమెరికారష్యాల యౌద్ధత్యముం
బ్రస్ఫారన్నయనాబ్జదీధితులతో బంధించి శాంతిక్రియా
విస్ఫూర్తిన్ నెలకొల్పుగాక భరతోర్వీమాత లోకంబునన్.

సత్యాహింసల మంత్రపాఠములుగా సంధించి, సాంగ్రామికౌ
ద్ధత్యక్రీడల నష్టముం బ్రజల కుద్ఘాటించి, ప్రేమతత్వమౌ
న్నత్యంబున్ నృపనీతి కంటునిడు యత్నం బెంతయుం జేసి, ప్రా
ణత్యాగం బొనరించి చన్న ఘనునిన్ గాంధిం బ్రశంసింపుమా.



# మన రాజ్యాంగం

"సుమతి"

౧౯౫౦ జనవరి ౨౬ వ భారతదేశం పూర్తిగా స్వతంత్రమైంది. ఆనాటితో అంతవరకూ బ్రిటన్‌తో గల నామమాత్ర సంబంధంకూడా తెగిపోయింది. దేశంమీద దొరతనం పూర్తిగా దేశంలోనే నెలకొన్నది. అంతేకాక దొరతనంతోపాటు న్యాయపాలనావ్యవస్థకూడా పూర్తిగా దేశస్థమే అయింది.

దేశప్రతిష్ఠకు మూలమైన ఈ గొప్పమార్పులు ఈనాడు సిద్ధించిన మన రాజ్యాంగము, లేక రాజ్యస్మృతివల్ల లభించినవి. భారతరాజ్యస్మృతి హేతువుచే ఈనాడు భారతదేశమున సర్వస్వతంత్రప్రజాప్రభుత్వ (ప్రజా)రాజ్యము ఏర్పాటైనది.

శతాబ్దముల అనంతరము, సీమలో కొంత కొల్లబోయి, భారతదేశము స్వతంత్రమై, ఏకరాజ్యముగా ఏర్పడినది. మనకు తెలిసిన దాస్యము ఒకటి, రెండు శతాబ్దములది. మన స్వాతంత్ర్యోద్యమములో కడకి దాస్యము హరించిపోయినది. ఈ సంసిద్ధికి హేతుభూతులు స్వాతంత్ర్యప్రియులైన ప్రజలు, వారి సంస్థయైన కాంగ్రెసు, ఉభయులకు ప్రవర్తకుడైన గాంధీ మహాత్ముడు. కొంత ప్రాంతము లుప్తమైనను ఇంత పూర్తి స్వాతంత్ర్యము, అఖండత్వము భారతదేశము చరిత్రలో ఎన్నడును అనుభవించియుండ లేదనవచ్చును.

## గాంధీజీ జోస్యం

౧౯౨౨లో గాంధీమహాత్ముడు చెప్పిన ఈమాట ఇప్పటి నెరవేరికనుబట్టి జోస్యమనిపించవచ్చును. 'రాజ్యాంగపరిషత్తు' అను పేరు లేకపోయినను దాని సూచన నాటిమాటలో కలదు:

"స్వరాజ్యము బ్రిటిష్‌పార్లమెంటువారి దానధర్మముగ రాదు. భారతదేశంయొక్క సంపూర్ణమైన స్వయంవ్యక్తతకు దృష్టాంతమై పార్లమెంటు శాసనరూపేణ రాగలదు. భారతప్రజల అభీష్టమును లాంఛనప్రాయంగా, మర్యాదగా పార్లమెంటు ఆమోదించవలసియుంటుంది. ఈ ఆమోదము బ్రిటన్‌తో ఒప్పందముగా ఉంటుంది. భారతీయప్రజలు స్వచ్ఛందంగా ఎన్నుకొన్నట్టి ప్రతినిధులద్వారా ప్రజల అభీష్టం వ్యక్తమై ఖరారు జరిగినపుడు బ్రిటిషుపార్లమెంటు ఆ అభీష్టాన్ని ఆమోదిస్తుంది."* అని గాంధీజీ చెప్పిన ప్రక్రియ ఇంచుమించు పూర్తిగా చెల్లుబాటైంది. స్వరాజ్యం బ్రిటిషువారి అనుగ్రహంవల్ల రాలేదు. భారతీయుల సంకల్పబలంచేత, త్యాగశక్తిచేత, స్వయంకృషిచేత స్వరాజ్యం సిద్ధించింది. బ్రిటిషుపార్లమెంటు మన స్వాతంత్ర్యప్రతిజ్ఞను ఆమోదిస్తూ స్వరాజ్యశాసనం చేసింది. మనం ఎన్నుకున్న రాజ్యాంగపరి

---

*"*Swaraj will not be a free gift of the British Parliament. It will be a declaration, of India's full self-expression, expressed through an act of Parliament. But it will be merely a courteous ratification of the declared wish of the people of India. The ratification will be a treaty to which Britain will be a Party. The British Parliament, when the settlement comes, will ratify the wishes of the people of India as expressed through the freely chosen representatives*"— *Mahatma Gandhi in* 1922.

షత్తుద్వారా రాజ్యాంగం నిర్మించుకున్నాము. ఈ విధంగా, ౨౦ సంవత్సరాలక్రితం గాంధీగారు సూచించిన రీతిగా కాంగ్రెస్ ఉద్యమం ఫలించింది. ౧౯౩౦ జనవరి ౨౬ న లాహోరులో రావినదీతీరాన పండిత జవాహర్లాల్ నెహ్రూ అధ్యక్షతన కాంగ్రెస్ దేశానికి స్వరాజ్యదీక్ష నిచ్చింది. ౧౯౪౭ ఆగస్ట్ ౧౫న బ్రిటనుతో లాంఛనప్రాయమైన సంబంధం కలిగి భారతదేశం స్వతంత్రమైంది. ఈనాడు రాజేంద్రప్రసాద్ 'రాష్ట్రపతి' (ప్రెసిడెంటు)గ, నెహ్రూ ప్రధానిగ భారతదేశం సంపూర్ణ స్వాతంత్ర్యంతో ప్రజారాజ్యముగా మారినది. ఈ మహాసంసిద్ధికై పాటుపడి బలియై పోయిన అసంఖ్యాకులగు వీరవతంసులకును, 'రాష్ట్రపిత' గాంధిమహాత్మునకును జోహారులు.

ఈ మన రాజ్యస్మృతిని సిద్ధపరచినట్టి రాజ్యాంగ పరిషత్తు ఎట్లు ఏర్పడి, పనిచేసినది వివరించుట కిది తావుకాదు. ఈపరిషత్తు తొలిసమావేశము ౧౯౪౬ డిసెంబరు ౯ నను, కట్టకడపటి సమావేశము ౧౯౫౦ జనవరి ౨౪ నను జరిగెను. ౧౯౪౭ ఆగస్టు ౧౫ అనంతరముగాని పరిషత్తుపని చురుకుగా సాగుటకు వీలు కలుగలేదు. ౩౦౮ మంది ప్రతినిధులు పరిషత్ కార్యక్రమంలో పాల్గొని మూడేళ్లకు పన్నెండు రోజులు తక్కువగా ౧౯౪౯ నవంబరు ౨౬ న ఈ రాజ్యస్మృతిని మంజూరుచేశారు. మనకి విలక్షణమైన పరిస్థితులలో ఇంత శీఘ్రంగా, సరసంగా, సవ్యంగా రాజ్యాంగం సిద్ధంచేయటం మెచ్చదగినది.

ఈ రాజ్యస్మృతిలో ౨౨ ఆశ్వాసములు ౨౨ అధ్యాయములు, ౩౯౫ సూత్రములు, ౮ అనుబంధములు ఉన్నవి. వీటిలో పౌరసత్వము, ప్రమాణము, ఎన్నికఏర్పాట్లు, నిర్వచన, అన్వయము, కొన్ని తాత్కాలికఏర్పాట్లకు చెందిన సూత్రములుమాత్రము ౧౯౪౯ నవంబరు ౨౬ నుంచే అమలులోనికి వచ్చినవి. మిగిలిన స్మృతిఅంతా ఈ జనవరి ౨౬ నుంచి అమలులోనికి వచ్చినది.

## అవతారిక

ఈస్మృతిప్రాముఖ్యం ఒకటో సూత్రమైన అవతారికలో ఇలా ఉంది:

"భారత ప్రజలము మేము

మా దేశంలో ప్రతే ఎన్నుకొని ఏలుకొనే పూర్తిసత్తా గలట్టి ప్రజల రాజ్యం స్థాపించి, మా దేశస్థులందరికిని—

సంఘ, అర్థ, రాచ కార్యాలలో న్యాయం;

మనన, ప్రచుర, విశ్వాస మతపూజలలో స్వతంత్రం;

సంఘంలోని స్థాన అవకాశాలలో సామ్యం

సాధించి మనిషిపరువు, జాతి ఐక్యం కుదురుకునేట్లు వారందరికి పొత్తు కుదుర్చవలెనని గట్టిగా సంకల్పించుకున్నవారమై ఈ రాజ్యాంగ పరిషత్తుద్వారా ౧౯౪౯ నవంబరు ఈ ౨౬ వ రోజున ఈరాజ్యస్మృతిని ఇట్లు అవలంబించి, చట్టంచేసి అంకితం చేసుకుంటున్నాము."

మన రాజ్యాంగానికి ఈ అవతారికవలన విశేషార్థం వస్తున్నది. ఈరాజ్యాంగంప్రకారం ఏర్పడబోయే రాజ్యం దేశస్థులైన ప్రజలది. ప్రజలే కర్తలు, భర్తలు. వారే పాలకులు, పాలితులు. ఎన్నిక, ఏలిక ప్రజలదే. ఇది ప్రజల దొరతనం. ఈ దొరతనంలో ప్రజలందరు సమానులు. హెచ్చుతగ్గులు, పైకిందులు ఇందులో ఉండబోవు. అందరూ స్వతంత్రులు. స్వచ్ఛందముగా యోచించుకొని, ఇంగితం వెలిబుచ్చుకొని, తోచిన నమ్మిక కలిగి, భక్తి గల మతం అనుష్ఠించి, ఇష్టదైవాన్ని పూజించుకొనే స్వతంత్రం అందరికీ ఉంది. సంఘక్షేత్రంలోను, అర్థవ్యవహారంలోను, రాచకార్యాలలోను న్యాయం అందరికీ లభిస్తుంది. సంఘజీవితంలో సమత్వం అందరి సొత్తు కాగలదు. దేశస్థులందరూ, ఏకజాతివారము అనే భావనతో వ్యక్తికి ముప్పం లేకుండా సౌభ్రాత్రంతో సుఖించగలరు. ఇది చాలా దొడ్డసంకల్పం. ఈ సంకల్పం అనుష్ఠానంలో సార్థకమయేటట్లు చేయటానికే ఈరాజ్యాంగం అనే చట్టం ఏర్పడినది. ప్రజాప్రవర్తిత ప్రజారాజ్యమనేది సర్వోత్కృష్టమైనది. అంతటి సర్వోత్కృష్టమైన ప్రజారాజ్యం చేసే ప్రజలుకూడా సర్వోత్తములై

యుండటం అవసరం. ప్రపంచంలో ప్రజారాజ్య విధానం అనేకఆపదలకు లోనౌతున్న ఈ తరుణంలో భారతదేశంవంటి విశాలసీమలోని చిరదాస్యపీడితులై పేదలై, రుగ్ణులై, నిరక్షరులై యున్న ౩౩ కోట్లమంది ప్రజలలో ౧౭ కోట్లమంది తమ్ముకర్మకు తామే కర్తలుగ ప్రభువు లగుచుండుట కొందరకు భయావహముగ యున్నది. కాని వీరు నిరక్షరులైనంతమాత్రమున అజ్ఞానులు కారని, విద్యలేకపోయినను వివేకము లేకపోలేదని, తమ మేలు తాము తెలిసికోగల విచక్షణ మన ప్రజలకు కలదని మన విశ్వాసము.

ఒకటో ఆశ్వాసములో మన దేశము ఇండియా, లేక భారతము అని పేర్కొనబడినది. భారతము ప్రాంతముల సమితి. ఈ భారతసమితిలో ౨౭ ప్రాంతము లున్నవి. ఇవి నాలుగురకములు. ౯ ది మొన్నటి వరకు రాష్ట్రములని పేర్కొనబడినవి. వీటిని రాజ్యపాలక (గవర్నర్ల) ప్రాంతము లనవచ్చును. ౮ ది పూర్వము సంస్థానములుగను, సంస్థానములకూటములుగను ఉండినవి. వీటిని రాజప్రముఖుల ప్రాంతము లనవచ్చును. ౧౧ కేంద్రపాలితప్రాంతము లనవచ్చును.

దేశప్రజలు, లేక పౌరులు ఎవరు, ఎటువంటివారు, ఎంతకాలంగా ఈ దేశంలో ఉంటున్నవారు మున్నగు అర్హతలు, ముఖ్యంగా ౧౯౪౭ లో జరిగిన దేశవిభజనను మనస్సులో పెట్టుకొని చేసినవి, ౨వ ఆశ్వాసంలో ఉన్నవి. పాకిస్తాన్‌లోని హిందువులకు అనుకూలముగ ఉండునట్లు ఈ సూత్రములు చాల సులభముగ చేయబడినవి. ఇతరదేశాల పౌరసత్వవిధులతో పోల్చిచూచినచో మన విధులు ఏమీ కఠిన మనిపించవు.

## స్థిరహక్కులు

మూడునాలుగు ఆశ్వాసములు అవతారికలోని అంశములకు వివరణ అనవచ్చును. మూడో ఆశ్వాసములో ప్రధానహక్కులు పేర్కొనబడినవి. ఇవి ఇంత విపులముగ, విశదముగ మరేరాజ్యాంగములోను ఇమడ్చబడిలేవు. ఈనాడు నాగరకరాజ్యములన్నిటిలోను పౌరులకు ప్రాణప్రదమైన ఈ ముఖ్యహక్కులను లక్షింపజేయుట కర్తవ్యమైయున్నది. కాగా, కాంగ్రెసు ఇంతకుపూర్వమే ప్రధానహక్కులనుగురించి చేసి కరాచీతీర్మానము మున్నగు పూర్వగ్రంథముగూడ ఈ సందర్భములో స్మరింపవలసియున్నది. న్యాయపాలనము, లేక సంరక్షణము దేశములో నుండువారందరికిని లభించును. ఈ హక్కు మన దేశపౌరులకుమాత్రమే కాక మన దేశములో ఉండే మిత్రదేశములవారికిని వర్తించును. ప్రభుత్వవ్యవహారములలో మన దేశపౌరులను ఎవరిని జాతి, మత, వర్ణ, స్త్రీపుం, ప్రదేశహేతువులచే భేదముగ చూడరాదు. ఇట్టి ఈ మొదలైన భేదములను ప్రభుత్వపు ఉద్యోగనియామకములలో పాటించనుకూడదు. హిందూసంఘమునకు చెందిన అస్పృశ్యతపద్ధతి ఇంతతో రద్దుఅయినది; అస్పృశ్యత పాటించేవారు దండ్యులగుదురు. పాండిత్యవిశేషమునకు, యుద్ధములో నేర్పుకు తప్ప దేశములో ఎవరికీ బిరుదు లివ్వరు. దేశస్థు లెవరూ పరాయిదేశాల బిరుదులు పొందకూడదు. అందరికీ ఇష్టానుసారం మాట్లాడి వ్రాసే హక్కు ఉంది కాని ఎవరూ రాజ్యక్షేమానికి హాని కలిగించేట్టుగాని, రాజ్యాన్ని పేలకూల్చేట్టుగాని ప్రవర్తించకూడదు. ఎవరూ ఎవరినీ నిందించకూడదు, దూషించకూడదు. న్యాయస్థానాలను అవమానించకూడదు. అందరూ ఇష్టానుసారం ఆయుధాలులేకుండా శాంతంగా సభలు చేసుకోవచ్చును. కాని కట్టడికి భంగం కలిగించరాదు. అందరూ సంఘాలు స్థాపించుకోవచ్చును కాని నీతికి, నియమానికి లోబడి నడుచుకోవాలి. అందరూ యావద్భారతదేశంలో ఎక్కడికైనా పోవచ్చును, పోయి నివసించవచ్చును, స్థిరనివాసం ఏర్పరచుకోవచ్చును, ఆస్తి సంపాదించుకోవచ్చును, అట్టే పెట్టుకోవచ్చును, అమ్ముకోవచ్చును. అయితే అట్టి స్వేచ్ఛవలన ఏ జెన్మప్రజలకుగాని, జనసామాన్యానికిగాని హాని కలగకుండా ప్రభుత్వం ఏర్పాటుచేయవచ్చును. ఎవరికి తోచిన వృత్తి, వ్యాపారం వారు చేసికోవచ్చును. అయితే దేశక్షేమం కోసము ఆయావృత్తివ్యాపారాల నిర్వహణకు ప్రభుత్వం తగు అర్హతలు విధించవచ్చును. ఈ హక్కులే కాక మరికొన్ని: ఒకప్పుడు చేసినపని ఆ తర్వాత తయారయే శాసనంప్రకారం నేరమైతే అందువల్ల ఆ పని దండ్యం కాదు. ఎవరినీ ఒకేనేరానికి రెండుసార్లు

శిక్షించకూడదు. ఏ నేరస్థుణ్ణీ తనకే వ్యతిరేక సాక్ష్యం చెప్పుకోమని బలవంతం చెయ్యకూడదు. శాసనం ప్రకారం తప్పితే ఎవరి ప్రాణస్వేచ్ఛలూ హరించకూడదు. వెట్టిచాకిరీ, బానిసత్వం నిషిద్ధం. ౧౪ సంవత్సరాలలోపు పిల్లలచేత గనుల్లోను, ప్రాణాపాయముండే వృత్తుల్లోను పనిచేయించకూడదు. నీతి ఆరోగ్యాలకు, ప్రజాక్షేమానికి లోబడి ఎవరి అంతఃకరణప్రవృత్తి ప్రకారం వారు నడుచుకోవచ్చును. ఎవరికి నచ్చిన మతం వారు అవలంబించి వ్యాప్తం చేసుకోవచ్చును. మతాలకు పూర్తి స్వేచ్ఛ ఉంది. శాసనమూలకంగాగాని ఎవరి ఆస్తీ ప్రభుత్వం తీసికోకూడదు, అలా తీసుకున్నప్పుడు పరిహారం ఇవ్వాలి. ప్రత్యేక భాష, లిపి, సంస్కారం గలవారు దేశంలో ఎక్కడ ఉన్నప్పటికీ వాటిని సంరక్షించుకునేందుకు వారికి హక్కు ఉంది. మత జాతి వర్ణ భాషాభేదంవల్ల ఎవ్వరికీ విద్యానిలయాల్లో ప్రవేశం నిరాకరింప వీల్లేదు. అల్పసంఖ్యాకులు మతంవల్లగాని, భాషవల్లగాని ఉంటే వారి ఇష్టానుసారం విద్యాసంస్థలు పెట్టి నిర్వహించుకునేందుకు అధికారం ఉంది. ప్రభుత్వం సహాయం చేయటానికి ఇది ఇట్టి అల్పవర్గాల సంస్థలని చెప్పి చిన్న చూపు చూడ వీల్లేదు. ప్రభుత్వం విచ్చలవిడిగా వ్యక్తుల్ని శేవిచారణగా బంధీచేయవీల్లేదు. మూడు నెలలకుమించి ఎవరినీ అలా బంధీచేసిఉంచకూడదు. అలా ఎక్కువ కాలం ఉంచవలెనంటే పార్లమెంటు శాసనం ఉండాలి, లేక కొన్ని షరతులు పాటించాలి. ఈ పైన పేర్కొన్న ప్రధానహక్కులన్నీ సుప్రీం కోర్టుపరంగా చెల్లును. వీటి విషయంలో న్యాయస్థానాలదే అంత్యనిర్ణయం.

నాలుగో ఆశ్వాసంలో ప్రభుత్వం ప్రజల శ్రేయస్సుకోసం ఎలా నడుచుకోవలెనో, ఏమేమి చేయవలెనో వివరంగా చెప్పి ఉన్నది. అయితే ఈ కార్యక్రమం ప్రభుత్వం చేసితీరవలసిందేనని న్యాయస్థానాలద్వారా విహితం చేయటానికి వీల్లేదు. ప్రభుత్వపు విధాయకం ఇదీ అని జ్ఞాపకంగా వ్రాసి పెట్టిన వాక్యావళివంటిది ఇది. ప్రభుత్వం ప్రజల యోగక్షేమం కనుక్కోవలెనని, ప్రజలకు తగు జీవనోపాధి కల్గించి, పనిపాటులు చూపి, ౧౪ ఏళ్లలోపు పిల్లలకు ఉచితవిద్యాభ్యాసము చేయించి, మద్యనిషేధము కావించి అంతర్జాతీయముగ శాంతిభద్రతలు పెంపొందించవలెనన్నది ఈ కార్యక్రమసారాంశము.

## స మి తి

అయిదవ ఆశ్వాసములో సమితిఏర్పాటు, రాష్ట్రపతి, శాసనసభలు, మంత్రిమండలి, న్యాయవ్యవస్థ వివరించబడినవి. సమితిరాజ్యాధిపతి ప్రెసిడెంటు, లేక రాష్ట్రపతి. ప్రాంతీయశాసనసభలలోని దిగువసభలున్ను, సమితి ఎగువ, దిగువ శాసనసభలు రెండున్ను రాష్ట్రపతిని ఏకబదిలీఓటుదామాషాప్రాతినిధ్యపద్ధతిని ఎన్నుకొనును. ఈఎన్నికలో ప్రాంతీయసభలన్నిటి ఓటువిలువతో తూగునట్లు కేంద్రశాసనసభకు అధికముగ ఓటువిలువ ఇవ్వబడినది. శాసనసభలకు, రాష్ట్రపతికి గడువు అయిదేళ్లు. రాష్ట్రపతి రాజ్యాంగమును ధిక్కరిస్తే శాసనసభలు అందుకు ఆతణ్ణి నేరమెంచి పదవీభ్రష్టుణ్ణి చేయవచ్చును. రాష్ట్రపతి ప్రధానిని నియమించును. మంత్రులు శాసనసభలకు ఉత్తరవాదులు. మంత్రివర్గము రాష్ట్రపతిఇష్టానుసారము ఉండును. రాష్ట్రపతి సమితిరాజ్యాధిపతిమాత్రమేకాక సర్వసేనానియును. ఉపరాష్ట్రపతిని కేంద్రశాసనసభలు పైఎన్నికపద్ధతిని ఎన్నుకొనును. ఇతడు ఎగువ శాసనసభకు, లేక ప్రాంతీయప్రతినిధిమండలికి సభాపతిగ నుండును. ఇతడి గడువుకూడ అయిదేళ్లు.

సమితిపార్లమెంటు, లేక సదస్సు రెండు సభలతోను, రాష్ట్రపతితోను కూడియుండును. రెండు సభలలో ఒకటి ప్రాంతీయమండలి. దీనిని ప్రాంతీయ సదస్సులలోని దిగువసభలు ఎన్నుకొనును. ఈమండలిలో మూడోవంతుసభ్యులు రెండేళ్ల కొకసారి మారుచూఉందురు. ఈవిధంగా ఇది శాశ్వతం. రెండో సభ ప్రజామండలి. దీన్ని వివిధప్రాంతాల్లోను గల ఓటర్లు, అనగా ౨౧ ఏళ్లునిండిన ప్రజలు ఎన్నుకుంటారు.

సదస్సును సమావేశపరచి, సమావేశం ముగించి, రద్దుచేసే అధికారం రాష్ట్రపతికి ఉంది.

రాజ్యవ్యవస్థలో న్యాయమండలి చాలా ముఖ్యమైనది. ఈ రాజ్యాంగంద్వారా, ప్రభుత్వప్రమేయం

లేకుండా స్వతంత్రమైన న్యాయశాఖ యావద్దేశానికీ ఏర్పడింది. స్థానికకోర్టుల నుంచి పైనున్న సుప్రీం కోర్టువరకు ఒకే శ్రేణిగా న్యాయశాఖ ప్రతిష్ఠితమై ఉంది. సుప్రీంకోర్టు దేశంలోకల్లా పెద్దకోర్టు. ఈ కోర్టుకు చాలా విస్తారమైన న్యాయాధికారం ఉంది. అంతేకాక రాజ్యాంగాన్ని అన్వయించే అధికారం, మూడో ఆశ్వాసంలోని ముఖ్యహక్కుల రక్షణాధికారం ఈ కోర్టుదే.

## ప్రాంతాలు

ప్రాంతీయప్రభుత్వాలు నాలుగురకాలుగా ఉన్నవి: (౧) రాజ్యపాలురు, లేక గవర్నరు ప్రాంతాలవి; (౨) రాజ్యప్రముఖులవి; (౩) రాష్ట్రపాలితపువి; (౪) అండమాను నికోబారు దీవులు. రాజ్యపాలురను రాష్ట్రపతి నియమించును. రాజ్య ప్రముఖులు రాష్ట్రపతిచే అట్లని గుర్తింపబడినవారు. కొన్ని రాష్ట్రములకు కౌన్సిలు, అసెంబ్లీ అని రెండుసభలును, కొన్నిటికి ఒకటే అసెంబ్లీమాత్రము ఉండును. రాజ్యపాలురు, లేక రాజ్యప్రముఖులు మంత్రివర్గము సలహాపై వ్యవహరింతురు. కేంద్రప్రాంతీయమండలి వలెనే ప్రాంతీయకౌన్సిళ్లును శాశ్వతములు. వీటిలో మూడోవంతు సభ్యులు రెండేళ్ళ కొకసారి మారు చుందురు. ప్రాంతీయమండలికి రాష్ట్రపతిన్ని, కొన్ని కృకు రాజప్రముఖులు, లేదా రాజ్యపాలురున్ను సాహిత్యము, శాస్త్రము, కళ, సహకారోద్యమము, సమాజసేవ మున్నగు పనులు విశేషించి తెలిసినవారిని గాని, వాటిలో అనుభవజ్ఞులైనవారినిగాని ౧౨ మందిని నియమించవచ్చును.

శాసనసభల వ్యవహారము కేంద్రములోను, ప్రాంతములలోను స్వల్పమైన మార్పులతో ఒకేమాదిరిగ ఉన్నది.

మూడోరకపు ప్రాంతములు కేంద్రపరిపాలిత ప్రాంతములు. నాలుగోరకపుది కూడా కేంద్రపాలితమే—అది అండమాను నికోబారు దీవులు. ఈ రెంటికీ గల తేడా ఏమనగా అండమాను దీవులు కేంద్రపాలితము గానే ఉండగలవు. కాని మూడోరకపు ప్రాంతాలకు స్థానికశాసనసభలు, లేక సలహాదార్ల సంఘాలు ఏర్పాటుచేయవచ్చును.

ఏజెన్సీప్రాంతములు, లేక కొండప్రాంతములు అనే వెనుకబడిన ప్రదేశములకు ప్రత్యేకపు ఏర్పాట్లున్నవి. ఏజెన్సీప్రజల వికాసమునకు ప్రభుత్వము ప్రత్యేకించి కృషిచేసి వారి సంస్కృతిని కాపాడు నిమిత్తము ఈ ఏర్పాట్లు చేయబడినవి.

ఈ ఏజెన్సీప్రజలకును, హరిజనులకును మాత్రము పదేళ్ళ పర్యంతము జనాభా నామాపాన శాసనసభలలో వారికి చెందవలసిన స్థానములు ప్రత్యేకించబడును. ఇట్టి వెనుకబడిన తెగల యోగక్షేమము విచారించుటకు రాష్ట్రపతి ప్రత్యేకాధికారిని నియమించును. అంతేకాక వీరివిషయమై శ్రద్ధచేయుటకు రాష్ట్రపతికి, ప్రాంతపాలురకు అధికార మున్నది.

## రాజ్యవ్యవహారం

రాజ్యవ్యవహారాంశములుగ ౨౧౦ పేర్కొనబడినవి. ఇవి మూడురకములు. ౯౭ అంశములు ఫక్తు కేంద్రప్రభుత్వము వ్యవహరించేవి. ౬౬ ఫక్తు ప్రాంతి ప్రభుత్వములు వ్యవహరించేవి. ౪౭ ఉభయత్రా, అనగా కేంద్రప్రభుత్వానికీ ప్రాంతప్రభుత్వాలకీ చెల్లేవి. ఈ మూడురకాల జాబితాల్లోను పొందుపడకుండా ఉన్న ఇతరితరఅంశాలు అన్నీ కేంద్రప్రభుత్వానికే చెల్లును. అంతేకాక ప్రాంతీయమండలియైన కేంద్ర మండలి ఎగువశాసనసభ కనుక జాతిక్షేమానికై ప్రాంతీయఅంశాల్లో ఫలానావాటిని కేంద్రప్రభుత్వమే చేపట్టి వ్యవహరించవలెనని విధిపూర్వకంగా నిర్ణయిస్తే ఆ నిర్ణయానుసారం కేంద్రప్రభుత్వం వ్యవహరించవచ్చును. అంతేకాక దేశంలోని కల్లోలంవల్ల గాని, బాహ్యశత్రుభయంవల్ల గాని, యుద్ధంవల్ల గాని దేశానికి ముప్పు కలుగనున్నదని రాష్ట్రపతి ఉపద్రవ ప్రకటన చేసినపుడు ఆ ప్రకటన అమలులో నున్నంతపర్యంతము ప్రాంతవ్యవహారంయావత్తూ కేంద్రపరమైపోతుంది. అంతేకాక దేశంయొక్క, లేక ప్రాంతంయొక్క ఆర్థిక సౌష్ఠవానికి, పరపతికి హాని కలుగునని తోచినప్పుడు రాష్ట్రపతి ఈయా విధంగా నడుచుకోవలసిందని

ప్రాంతాలను తాఖీదుచేసి శాసించనువచ్చును. ఉభయంగా ఉన్న అంశాలవిషయంలో కేంద్రశాసనానికి, ప్రాంతీయశాసనానికి వైరుధ్య ముందేసందర్భంలో ప్రత్యేకించి ప్రాంతీయశాసనాన్ని రాష్ట్రపతి ఆమోదిస్తే తప్ప కేంద్రశాసనమే చెల్లుతుంది.

ఆర్థికవ్యవహారానికి ఏర్పాట్లు ప్రత్యేకించిచేయబడినవి. ప్రాంతీయ, కేంద్రప్రభుత్వాల ఆయవ్యయాలన్నీ పరిశీలించి కోశరక్షకుడుగా స్వతంత్రుడైన కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ నియమింపబడును.

రాజ్యభాష హిందీ. కాని ఇంగ్లీషు ౧౫ సంవత్సరాలు చలామణీఅగును. ఆయాప్రాంతాలు హిందీనిగాని, ప్రాంతీయభాషనుగాని రాజభాషగా పెట్టుకోవచ్చును.

ఈ రాజ్యాంగాన్ని సవరించవలె ననుకున్నా, మార్చవలె ననుకున్నా పార్లమెంటులో $\frac{2}{3}$ మెజారిటీ వల్ల అలా సవరించవచ్చును; మార్పు చేయవచ్చును.

ఇప్పటినుంచి, ఈ రాజ్యాంగముప్రకారము ఎన్నికలు జరిగి వ్యవస్థజరిగే పర్యంతము ఈ మధ్యకాలములో జరుగవలసిన వ్యవహారమునకు తాత్కాలికమైన ఏర్పాట్లు చేయబడినవి.

ఇంత పెద్ద రాజ్యాంగం ప్రపంచంలో ఎక్కడా లేదు. రాజ్యాంగస్వరూపాన్ని పైన దిఙ్మాత్రంగా మాత్రం సూచించితిమి.

## స మీ క్ష

రాజ్యాంగస్వరూపస్వభావాలను సవిమర్శగా సమీక్షచేసి ముగింతము. ఇంతకుపూర్వ మున్న గవర్నమెంటాఫిండియాఆక్టు, బ్రిటిషు సంప్రదాయం, అమెరికన్ రాజ్యాంగం మున్నగువాటిని పురస్కరించుకుని తయారుచేసినది ఈ రాజ్యాంగం. దీని స్వభావం ఇది సర్వస్వతంత్రమవటము, ప్రజాప్రవర్తితమవటము, ప్రజారాజ్యమవటమూను. "రాష్ట్రపతి" అనువంశికంగా వచ్చే రాజుగాని, అన్యదేశరాజుగాని కాడు. ప్రజలే వరించినవాడు. రాజ్యాంగము ఫెడరేషన్, లేక సమవాయము. యావద్దేశానికి సమితిప్రభుత్వము, ప్రాంతాలకు ప్రాంతీయప్రభుత్వాలు అనే ద్వైధం ఉన్నదికాని అది నిజంగా ద్వైధం కాదు. జాతిక్షేమంకోసము, యుద్ధము వగైరా ఉపద్రవాలు కలిగి దేశస్థులందరూ దేశాన్నే తలుచుకోవలసిన సమయంలో ప్రాంతీయమైన పొలిమేరలు సమితిక్షేత్రంలో లీనమై దేశం "ఏక" రాష్ట్రం కాగలదు. భారతదేశం శక్తిమంతమై విరాజిల్లటానికి ఇది సాధనం.

ప్రజలందరికీ—౨౧ ఏళ్ళునిండిన ప్రజలందరికీ, ఏట్టి భేదాలూ లేకుండా, ప్రత్యేకనియోజకవర్గా లేవీ లేకుండా ఏకత్వపద్ధతిని ఓటు ఉంది. సీమాముఖాలం ప్రజలు. ప్రజాభీష్టానికి ప్రతిబింబం పార్లమెంటు. మంత్రివర్గాలకి రాష్ట్రపతి, తదితర పాలకులకు ప్రజాభీష్టమే శిరోధార్యం. అందుకనే ప్రజారాజ్యం అని చెప్పటంతోనే తృప్తిపడక అది నిత్యనిరంతరము ప్రజాప్రవర్తితమైన ప్రజారాజ్యంగానే ఉండవలెనని నిర్దేశించబడినది. ప్రజలే నిరంతరజాగరూకులై తమ స్వతంత్రం నిలుపుకోవాలి.

ప్రధానహక్కులలో కొంత అసంతృప్తి లేకపోలేదు. భారతదేశంలో ఇంగ్లీషుకాక, సంస్కృతంకాక, వ్యవహారంలో ఉన్న భాషలు ౧౨ అని రాజ్యాంగం పేర్కొన్నది. కాని సమితికి ఉపాంగమైన ప్రాంతాలు అన్ని భాషవిషయంలో సమ్మిశ్రమై సంకులంగా ఉన్నవి. భారతదేశం భాషనుబట్టి ౧౨ మండలాలుగా, పరిపాలనాసౌలభ్యంకోసం ఏర్పాటైనపుడుగాని సమవిభక్తం కాజాలదు. అంతవరకూ అది సంపూర్ణప్రజారాజ్యం కాజాలదు. ఎందుకనగా అనేకప్రాంతాల వ్యవహారం ప్రజల భాషలోకాక వారిదికాని భాషలోనే జరుగవలసియుంటుంది. ప్రాంతాల పునర్విభజనకు మార్గం ఒకటో ఆశ్వాసంలో సూచించబడినది. హిందీవంటి ఒకేభాషకు ఒకటికన్న ఎక్కువ ప్రాంతీయప్రభుత్వాలు ఉండవచ్చును. అయితే అసంతృప్తి మున్నది. బహుభాషామయమైన భారతదేశంలో చదువుకొనే పిల్లలకు వారు ఎక్కడ ఉన్నప్పటికీ వారి మాతృభాషలో విద్యాభ్యాసంచేసే హక్కు విస్పష్టంగా చెప్పలేదు.

అలా విస్పష్టంగా చెప్పవలసిన అవసరం మన దేశపరిస్థితులలో ఎంతైనా ఉంది. ఉదాహరణకు చకోస్లవేక్యారాజ్యాంగం సూత్రం ౧౩౧ లోను, రష్యారాజ్యాంగంసూత్రం ౧౨౧ లోను, మరికొన్ని యూరోపియన్ రాజ్యాంగాల్లోను, మాతృభాషలో విద్యాబోధ అనే హక్కు దత్తమైంది. ౧౯౨౮ లో కలకత్తా కాంగ్రెసులో ఆమోదించిన నెహ్రూరిపోర్టులో కూడా అల్పసంఖ్యగల భాషలవారికి వారి లిపిలో, భాషలో విద్యాభ్యాససౌకర్యములు కల్గించవలెనని తీర్మానించారు. కాని రాజ్యాంగ ముఖ్యహక్కుల్లో అట్టి అల్పవర్గాలు స్వయంగా పెట్టుకొనే విద్యాసంస్థలను ప్రభుత్వం భేదంగా చూడకూడదనిమాత్రమే ఉంది. అలాగే ఉచితనిర్బంధవిద్యాభ్యాసం ప్రభుత్వం చేయించవలె ననేది ధర్మపన్నంగా నాలుగో ఆశ్వాసంలో ఉందిగాని హక్కుగా దత్తమై లేదు.

అమలులో నున్న శాసనాలకు లోబడి ప్రజలకు వాక్, ప్రకటన, సభా, సంఘ ఇత్యాదిస్వాతంత్ర్యాలు ౧౩ వ సూత్రంలో ఇవ్వబడినవి. కాని కాంగ్రెసు ధిక్కరించిన బ్రిటిష్‌నిరంకుశశాసనాలు ఇంకా రద్దు కాలేదు. త్వరలో ఇవి రద్దుకాగలవని ఆశించవచ్చును.

౧౫ వ సూత్రంలో శాసనబద్ధంగా తప్ప ఎవరినీ నిర్బంధించకూడదు, ఉరితీయకూడదు అని ఉంది. ముసాయిదాలో "యుక్తశాసనరీత్యాతప్ప" అని వ్రాసిన మాటలు మార్చబడినవి. దీనివిషయమై లాయర్లలో భిన్న తీవ్రాభిప్రాయా లున్నవి. ముసాయిదాలో ఉన్న ప్రకారమైతే ఫలానాశాసనం యుక్తమువునా కాదా అన్నది నిర్ణయించే అధికారం న్యాయస్థానాలకు సంక్రమించితీరుతుంది. కాని ఇప్పటి సూత్రం ప్రకారం అట్టి చర్య శాసనబద్ధంగా జరిగిందా లేదా అనే తప్ప అసలు శాసనవిషయం తర్కించే అధికారం న్యాయస్థానాలకు లేదు. పార్లమెంటు దుశ్శాసనం చెయ్యదని మన విశ్వాసం. అయినప్పటికీ ఒక సంగతి చెప్పవలసిఉంది.

అమెరికాప్రసాదితమైన ౧౯౪౬ జపాన్ రాజ్యాంగంసూత్రం ౩౧ ప్రకారంగా మన ఈ ౧౫ సూత్రం ఏర్పరచినవారు ఆ జపాన్‌స్మృతిలోని ఆ సూత్రానికే మినహాయింపుగా సంబంధించిఉన్న ౩౨,౩౩,౩౪,౩౫ సూత్రాలను ఎందుకు విసర్జించవలసివచ్చిందో తెలియదు. ఈసూత్రంలోను, దేవిచారణ బందీపద్ధతిలోను లిఖితమైన రక్షణ వ్యక్తికి లేకపోవటం చింత్యం.

ఇక రాజ్యపాలనసంగతి. రాష్ట్రపతికి కార్యనిర్వహణలో మంత్రివర్గం సలహా సహాయాలు చేయునని, మంత్రివర్గం రాష్ట్రపతి "చిత్త" ప్రకారం హయాములో ఉండునని, మంత్రివర్గం దరహాంమీద ప్రజామండలికి ఉత్తరవాది అని, ప్రభుత్వవ్యవహారం రాష్ట్రపతి పేరున జరిగినట్లు వ్యక్తంకావలెనని, ప్రధానమంత్రిని, తదితరమంత్రులను రాష్ట్రపతి నియమించునని విశదంగా చెప్పిఉన్నదికాని రాష్ట్రపతి మంత్రిమండలిసలహాప్రకారమే వ్యవహరించవలెనని విశదంగా చెప్పిలేదు. బ్రిటిష్‌రాజువలె రాష్ట్రపతి నామమాత్రాధికారి అని, ఆ మాట చెప్పకుండా ఆ మాదిరి సంప్రదాయం ఏర్పరచవచ్చునని అంటున్నారు. కాని భారతరాష్ట్రపతిని ప్రజలు ఎన్నుకొని అభిషేకిస్తున్నారు. ఆ ఎన్నికవల్లనే అతనికి స్వతః కొంత అధికారం లభిస్తుంది. సమస్తవిషయాలకు నిబంధన చేస్తూ పెద్దగ్రంథం తయారుచేసినవారు కొన్ని ముఖ్యవిషయాలను గాలికి వదిలివేయడం గమనించదగినది.

ప్రాంతీయక్షేత్రంలో రాజ్యపాలురకు కొన్ని అనుక్తవిశేషాధికారా లున్నవి. రాజ్యాంగానుసారం ప్రాంతీయపరిపాలన జరగటం లేదుకనుక రాష్ట్రపతే అధికారం చేకొనవలెనని రాజ్యపాలుడు చెప్పగా రాష్ట్రపతి అలా చేయవచ్చును.

ఆయావిషయాలలో క్రమేపీ అనుభవాన్ని బట్టి, అవసరాన్ని బట్టి రాజ్యాంగం సవరణకాకతప్పదు. అట్టి సవరణ దుష్కరం కాదు. ఇప్పటి దేశకాలపరిస్థితుల నైజం కొంత రాజ్యాంగరచనలోనే వ్యక్తమౌతున్నది. ఇప్పటి భయసందేహాలు రాజ్యాంగంలోని కొంత అనిశ్చితత్వానికి హేతువులు. కనుక అవసరానుగుణమైన మార్పు చేస్తేనే రాజ్యాంగం సజీవమైఉంటుంది.

## ప్రజల పూచీ

ఇంతకూ ఎట్టి లోపాలూ లేని సర్వసమగ్ర, సంపూర్ణ రాజ్యాంగం అనేది ఉండదు. భాషకి వ్యాకరణంవలె రాజ్యానికి రాజ్యాంగం. వ్యాకరణానికి భాష ఆధారంగాని భాషకు వ్యాకరణం కాదు. అలాగే రాజ్యాన్ని పురస్కరించుకొని రాజ్యాంగం. రాజ్యాంగం ఎంత మంచిదైనా రాజ్యంచేసేవారిలో గుణం లేకపోతే పరిపాలన భ్రష్టమౌతుంది. రాజ్యాంగం అంత ప్రశస్తంగా లేకపోయినప్పటికీ యోగ్యులైనవారు ప్రజలకు క్షేమంగా వ్యవహరిస్తే రాజ్యాంగం అందుకు అడ్డురాదు. కనుక ప్రజలు ఎటువంటి వారిని అభిమానించి, ఎటువంటివారికి ఓటిచ్చి శాసనసభలకు పంపుతారు, వారు ఎలా నడుచుకుంటారు అనే మాటనుబట్టి మన భవితవ్యం ఉంది. విద్యాశూన్యులను, వివేకరహితులను, స్వార్థపరులను, పూచికపుల్లలను ప్రజలు గుండెకు హత్తుకొని వరిస్తారా-వారికి ఆలాటి ప్రభుత్వమే లభిస్తుంది. ఒకసారి ఎన్నుకొని పంపినమీదట ప్రజలు పస్తాయించి ప్రయోజనం ఉండదు. సగంజనాభాకు ఓటు రావటం, ఎన్నికఖండాల విస్తీర్ణం తగ్గటంలో మంచీ చెడూ రెండూ ఉన్నవి. ప్రజలలోనుంచి స్థానికముగ మంచి పలుకుబడి, పరువు, ప్రతిష్ఠ గలవారు ఎన్నికైతే దేశానికి శుభము. క్రియలో రాజ్యాంగము యొక్క మహత్తు అంతా రాజ్యమును నిర్మించే ఈ అధికారాన్ని ప్రజలపరం చెయ్యటంలోనే ఉంది. ప్రజాతంత్రం కష్టభూయిష్ఠము. దానిది మందగతి. సద్యఃఫలము కన్పించదు. ఐనను అదే శరణ్యము. నియంతృత్వము, నిరంకుశత్వము అనే రెండు శత్రువులు ఎప్పుడూ ప్రజాతంత్రాన్ని కబళించడానికి పొంచి ఉంటవి. ప్రజాతంత్రపు ప్రక్రియవల్లనే ప్రజాతంత్రాన్ని ధ్వంసంచేసి ప్రజలను వశపరచుకోటానికి అవి సదా కాచుకొనుంటవి. వాటికి గ్రాసం ప్రజల అజ్ఞానం, దారిద్ర్యం. రాజ్యాంగం రాజకీయంగా మాత్రమే ప్రజల్లో సమత్వం సాధించి అందరికీ ఓటు నిచ్చింది. కాని సంఘమర్యాదలలోను, ఆర్థికవసతిలోను సమత్వం ఇంకా సాధించవలసియుంది. ఆ రెండువిధాల సమత్వం సిద్ధించినప్పుడు కాని ప్రజాతంత్రం పరిపక్వం కాదు. అంతవరకూ ప్రజాతంత్రం నిరుపద్రవం కాదు. ప్రజాతంత్రాన్ని సార్థకం చేయవలసిన బాధ్యత ఏ ఒక్కరిదో గాని, కొద్దిమందిదో గాని కాదు. హక్కులు అందరివీ ఐనట్టే ఈ బాధ్యతకూడా అందరిదీ. పౌరులెల్లరూ తాము ప్రతిఒక్కరూ ఈ స్వతంత్రభారతసీమా మూలము అని గ్రహించుకొని నడుచుకుంటేనే దేశానికి మోక్షం.



# భారతరాజ్యాంగశాసనాలు

శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావు

వర్తకం చేసుకొని నాలుగు డబ్బులు సంపాదించుకోవడానికి వచ్చిన బ్రిటిష్‌వ్యాపారస్థులకు రాజ్యాధికారం సంక్రమించింది. అందుచేత వారు భారతదేశపరిపాలనకు ఆ వర్తకదృష్టితోనే శాసనాలను తయారుచేస్తూవచ్చారు. దేశాన్ని ఈ బ్రిటిష్‌వర్తకులు ఏలుకున్నారేగాని ఎన్నడూ పరిపాలించి ఉండలేదు. ౧౭౭౩ వ సంవత్సరంలో పార్లమెంటు చేసిన 'రెగ్యులేటింగ్ ఆక్టు' మొదలు ౧౯౩౫వ సంవత్సరపు భారత ప్రభుత్వశాసనంవరకూ తయారవుతూవచ్చిన చట్టాలను పరిశీలిస్తే తమకు దైవికంగా సంప్రాప్తించిన ఆర్థిక ప్రయోజనాలను స్థిరపరుచుకొనడానికీ వాటిని సంరక్షించుకొనడానికీ బ్రిటిష్‌వారు ఈ శాసనాలను తయారుచేశారని స్పష్టమౌతుంది. ౧౯౩౫లో తయారుచేసిన ఆఖరుశాసనంలో పరిపాలనావిధానానికి సంబంధించిన నిబంధనలకంటే వాణిజ్యరక్షణలకు సంబంధించిన క్లాజులకే ఎక్కువ ప్రాధాన్యంఇవ్వడం జరిగింది.

సరిగ్గా ౩౫౦ సంవత్సరాల క్రితం ఎలిజబెత్ రాణి ఈస్టుఇండియాకంపెనీకి విదేశాలతో వ్యాపారం సాగించడానికి హక్కులను ప్రసాదించింది. ఈ కంపెనీపై అధికారం ఒక కమిటీలకూ, ఒక గవర్నరుకూ ఉండేది. కమిటీలు అంటే కొంతమంది సభ్యులతో కూడిన సంఘాలు గాదు. ఒక కమిటీలు అంటే ఒక నరు వ్యక్తులే. ఈ పాతికమందికీ ఆసియాలోని కొన్నిప్రాంతాలతోనూ, ఆఫ్రికాతోనూ గుత్తవ్యాపారం చేసే హక్కుతోపాటు శాసనాలను చేసే అధికారాలను, న్యాయవిచారణజరిపే అధికారాలనుకూడా ఎలిజబెత్ రాణి ౧౬౦౦ డిసెంబరు ౩౧వ తేదీ 'ఛార్టర్' మూలకంగా ప్రసాదించింది. ఈ అధికారాలను పురస్కరించుకొనే ౧౮౫౮ వ సంవత్సరంలో విక్టోరియా రాణి భారతదేశపరిపాలనాధికారాన్ని సంపూర్ణంగా స్వాధీనంచేసుకు నేవరకూ ఈస్టుఇండియాకంపెనీవారు మన దేశాన్ని పాలిస్తూవచ్చారు. దీన్నే మన తాతముత్తాతలు కుంపిణీప్రభుత్వం అంటూవచ్చారు.

మొదటి అరవై సంవత్సరాల్లోనూ ఈస్టు ఇండియాకంపెనీ ఎన్నో అవస్థల పాలైంది. ఎన్నో సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చింది. ౧౬౫౭ వ సంవత్సరంలో క్రాంవెల్ ఈ కంపెనీని డచ్‌కంపెనీ పోటీనుండి రక్షించాడు. ౧౬౬౧ వ సంవత్సరంలో రెండవ ఛార్లెస్ ఈకంపెనీని జాయింట్‌స్టాక్‌కంపెనీగా ఏర్పాటుచేసి, ఆకంపెనీ స్థాపించుకొన్న స్థావరాలపై అన్ని అధికారాలనూ చెలాయించడానికి హక్కులు ప్రసాదించాడు. కంపెనీస్థావరాలంటే ఆ కంపెనీ ఫాక్టరీలను ఏర్పాటు చేసుకున్న ప్రదేశాలే. ఆప్రదేశంలో నివసిస్తున్నవారందరిపైనా "సివిల్, మిలిటరీ, క్రిమినల్, రెవిన్యూ" అధికారాలను చెలాయించడానికి అక్కడిగవర్నరుకూ, ఆయనసలహా సంఘానికీ సంపూర్ణమైన హక్కు ఇచ్చాడు. ఈ హక్కును పురస్కరించుకొని వారు క్రైస్తవులుకాని వారందరితో యుద్ధం చేయవచ్చు; ఒడంబడికలు కుదుర్చుకోవచ్చు.

౧౬౮౭ వ సంవత్సరంలో మద్రాసులో మునిసిపాలిటీని స్థాపించేందుకు రెండవ ఛార్లెస్ ఈ ఈస్టు ఇండియాకంపెనీకి అధికారం ఇచ్చాడు. పదిసంవత్సరాలక్రితం, ౧౬౭౭ లో, బొంబాయిలోని ఈ కంపెనీ శాఖకు నాణెములను తయారుచేసే అధికారాన్ని కూడా ఇచ్చారు. ౧౬౮౩ నుంచీ మద్రాసులో ఉన్న ఈస్ ఇండియాకంపెనీ జుడిషియల్ అధికారాన్ని చెలాయించడం ప్రారంభించింది. రెండవ ఛార్లెస్

కాలంలోనే ఈ వర్తకసంఘానికి విశేషమైన రాజకీయ సైనికఅధికారాలు సంక్రమించినవి. ౧౬౮౩ లో ఈయన ప్రసాదించిన హక్కులను పురస్కరించుకొని ఏషియా, ఆఫ్రికా, అమెరికాల్లోని ఏజాతితోనైనా సరే ఈ వర్తకకంపెనీలు యుద్ధం చేయడానికి అధికారం ఏర్పడింది. ఈఛార్టరుప్రకారమే భారతదేశంలోని 'కుంపిణీ' ప్రాంతాలపై న్యాయవిచారణాధికారము దృఢతరమైంది.

౧౭౪౪ వ సంవత్సరంలో ఫ్రాన్సు - ఇంగ్లండు యుద్ధం ప్రారంభమై ౧౭౪౬ లో భారతదేశానికి వ్యాపించింది. అందువల్ల భారతదేశంలోని బ్రిటిష్ వర్తకులు ౧౭౪౮ వ సంవత్సరంలో సైనికదళాలను ఏర్పాటుచేసుకోవడం ప్రారంభించారు. ఆ సంవత్సరంలోనే చెన్నపట్నంలో ఒక చిన్న సైనికదళాన్ని స్థాపించారు. సైన్యంలో క్రమశిక్షణను నిలబెట్టవలసి రావడంవల్ల వెనుకటి శాసనాలను సవరించవలసి వచ్చింది. ౧౭౫౪ వ సంవత్సరంలో ఈస్టుఇండియా కంపెనీవారి భారతీయసైన్యానికి నియమ, నిబంధనలను కల్పిస్తూ ఒక శాసనం తయారైంది.

౧౬౭౨ వ సంవత్సరంలో చెన్నపట్నంపైనా, ౧౭౬౪ వరికి బెంగాల్, బీహార్, ఒరిస్సాప్రాంతాలపైనా ఈస్టుఇండియాకంపెనీకి సంపూర్ణాధికారం లభించింది. కంపెనీవ్యవహారాల్లో బ్రిటిష్‌పార్లమెంటు ప్రత్యక్షంగా జోక్యం కల్గించుకోవడానికి ఇదే కారణం. దీనికి తోడు బ్రిటిష్‌ప్రభుత్వానికి డబ్బు కూడా చాలా అవసరమైంది. ప్రభుత్వానికి డబ్బు కావల్సివచ్చినప్పుడల్లా కంపెనీహక్కులు అధికారం కావడంగాని, అధికారం పరిమితంకావడం గాని జరుగుతూఉండేది. ౧౭౬౬ వరకూకూడా కంపెనీవారు తమ వాటాదార్లకు నూటికి ఆరురూపాయలవంతున డివిడెండు పంచుతూవచ్చారు. ౧౭౬౬ లో ఒక్కసారి నాల్గురూపాయలు ఎక్కువ ఇచ్చారు. ఆ మరుసటి సంవత్సరం ఇంకోరెండున్నరరూపాయలు పెంచారు. కంపెనీఆర్థికస్థితి బ్రిటిష్‌ప్రభుత్వానికి కన్నెర్ర అయింది. ౧౭౬౬ లోనే "కుంపిణీవ్యవహారాల"పై విచారణ జరిపించడానికి పార్లమెంటు తీర్మానించింది. ఈ విచారణ ఛాదమ్‌అధ్యక్షతన జరిగింది. భారతదేశంలో కుంపిణీవారు సంపాదించిన భూభాగం వాస్తవంగా బ్రిటిష్‌రాజుకు చెందాలని ఈయన వాదించాడు. చాలామంది ఈయనఅభిప్రాయాలతో ఏకీభవించారు. కాని 'కుంపిణీ' రోజులు బాగుండటంవల్ల ఛాదమ్ జబ్బుపడడం తటస్థించింది. ఛార్లెస్‌టౌన్‌షెండ్ 'కుంపిణీ' వారికి వీలైనంత మేలు చేయాలని అనుకున్నారు. కుంపిణీవారి భూభాగాలపై బ్రిటిష్‌రాజుకు సంపూర్ణాధికారం ఉండనే విషయం అప్పట్లో నిర్ధారణకాకపోయినా 'కుంపిణీ' వారుమాత్రం తమ డివిడెండ్లను నూటికి పదిరూపాయలకు పరిమితం చేసుకోవడానికీ, బ్రిటిష్‌ప్రభుత్వానికి ఏటా నాలుగులక్షల పౌన్లు చెల్లించడానికీ ఒప్పుకున్నారు.

ఈస్టుఇండియాకంపెనీవ్యవహారాల్లో బ్రిటిష్ పార్లమెంటు ఎక్కువగా, ప్రత్యక్షంగా ప్రమేయం కల్పించుకోవడానికి ఇదే మొదలు. ఇది జరిగిన అయిదు సంవత్సరాలకు "కుంపిణీవారు" దివాలాతీసేస్థితికి వచ్చారు. ౧౭౬౭ లో ఏర్పాటుచేసుకొన్న కొత్త ఒడంబడికప్రకారం బ్రిటిష్‌ప్రభుత్వానికి ఇచ్చుకోవలసిన నాలుగు లక్షల పౌన్లూ చెల్లింపలేకపోయారు. అప్పట్లో బ్రిటిష్‌ప్రధానమంత్రిగా ఉన్న లార్డ్‌నార్త్ పరిస్థితులను బాగుచేయడానికి ఏమీ చేయలేకపోయారు. కలనల్ బర్గాయిన్ పట్టుదలకారణంగా మళ్లీ ఒక విచారణసంఘం ఏర్పడింది. ఆ విచారణఫలితంగా ౧౭౭౩ వ సంవత్సరంలో ఈస్టుఇండియాకంపెనీ చట్టాన్నొకదాన్ని బ్రిటిష్‌పార్లమెంటు చేయడం జరిగింది. దీన్నే రెగ్యులేటింగ్‌ఆక్టు అంటారుకూడా. కంపెనీవ్యవహారాలను ఈ చట్టం క్రమబద్ధం చేసింది.

౧౮౫౭ సిపాయివిప్లవం విఫలమైన మరుసటి సంవత్సరంలో 'కుంపిణీ'పాలన భారతదేశంలో పూర్తిగా అంతరించింది. బ్రిటిష్‌సార్వభౌమునిదే సర్వాధికారం అయింది. అంతవరకూ ఈస్టిండియా కంపెనీవారు మన దేశాన్ని ౧౭౭౩-వ సంవత్సరపు రెగ్యులేటింగ్ ఆక్టుప్రకారంగా ఏలుతూ వచ్చారు. లార్డ్‌నార్త్ ఈచట్టాన్ని కేవలం ఒకసంస్కరణకార్యంగా మాత్రమే భావించాడు. భారతదేశప్రజల బాధలు తమకు తెలియక

పోలేదనీ, ఆబాధలకు కారణం రాజకీయస్వాతంత్ర్యం లేకపోవడం గాదనీ ఆయన అభిప్రాయపడ్డాడు. దేశంలో యూరపియనుప్రభుత్వం లేకపోవడమే ఇందుకు కారణం అని విశ్వసించి ఒక సుప్రీంకోర్టును స్థాపించాడు. ఈ చట్టంప్రకారమే బెంగాలుకు ఒక గవర్నరుజనరలూ, ఆయనకు నలుగురు సలహాదారులూ ఏర్పడ్డారు. వీరికి బెంగాల్, బీహార్, ఒరిస్సాలపై సంపూర్ణాధికారం ఉంటూ బొంబాయి, చెన్నరాజధానుల పర్యవేక్షణాధికారమూ ఉంటూవచ్చింది.

ఈ రెగ్యులేటింగ్ ఆక్టులో అన్నీ లోపాలే. ౧౭౯౩ నాటికి గాని ఇందులోని ప్రధానలోపాలు సర్దుబాటుకాలేదు. వారన్ హేస్టింగ్సు గవర్నరు జనరలుగా ఉండగా ఆయన తన సలహాదారుల సంఘంతో కలిసి వ్యవహారం చేయలేకపోయినాడు. ఈసంఘంలోని అధికసంఖ్యాకుల నిర్ణయాలను బట్టి గవర్నర్ జనరల్ వ్యవహరించాలనేదే ఈ శాసనంలోని పెద్ద లోపం. పిట్ తయారుచేసిన 'ఇండియాచట్టం'లో అయినా ఈలోపం సర్దుబాటుకాలేదు.

రెండవ లోపం ఈశాసనం గవర్నరుజనరలుకూ ఆయనసలహాసంఘానికీ గల అధికారాలను స్పష్టంగా ప్రకటించలేదు. అలాగే సుప్రీంకోర్టుఅధికారం ఎంతవరకు, ఏవిధంగా, ఏయే ప్రాంతాలపై ఉండేదీ స్పష్టం కాలేదు. ఈకోర్టుకూ, బెంగాల్ ప్రభుత్వానికీ ఉండే సంబంధాలుకూడా సందిగ్ధంగానే ఉండిపోయినవి. ఈ సందిగ్ధావస్థను కొంతవరకు తొలగిస్తూ పార్లమెంటు ౧౭౮౧ లో వేరొక శాసనం చేసింది. ఈ చట్టంప్రకారం గవర్నరుజనరల్ రాష్ట్రాలకు న్యాయస్థానాలనూ, గవర్నరుసలహాసంఘాలనూ ఏర్పాటుచేయడానికి వీలైంది. భారతదేశంలో శాసననిర్మాణ కార్యక్రమంలో ఇది చాలా ముఖ్యమైన సంఘటన అని చెప్పవచ్చు. ౧౭౮౧ లో పార్లమెంటు తిరిగి రెండు విచారణసంఘాలను స్థాపించింది.

ఈకమిటీల విచారణఫలితంగా ౧౭౮౩ వ సంవత్సరంలో ఫాక్సుకంపెనీపై బ్రిటిష్‌రాజు అధికారాన్ని ఎక్కువచేయడానికి ప్రయత్నించాడు. ఆయనప్రయత్నాలు సఫలం కాలేదు. ఫాక్సు-నార్తు సంకీర్ణ మంత్రివర్గం పతనంకావడంతో పిట్ అధికారానికి వచ్చి ౧౭౮౪ వ సంవత్సరంలో ఇండియాచట్టాన్ని తయారుచేశారు. దీన్నే "పిట్సు ఇండియాఆక్టు" అంటారు. ౧౮౫౮ వరకూ భారతరాజ్యాంగానికి ఇదే ప్రాతిపదిక అయింది. కంపెనీనిబంధనావళిలో ఈ ౧౭౮౪ చట్టంవల్ల మార్పేమీ రాలేదు. కాని బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పాటుచేసే అధికారుల సంఘానికి కంపెనీ లోబడిఉండవలసివచ్చింది. ఈ పిట్ చట్టంలోని లోపాల ఫలితాలను తరువాతి డెబ్బయిసంవత్సరాలకు లార్డ్ పామర్‌స్టన్ అనుభవింపవలసివచ్చింది. కంపెనీ డైరక్టర్లకూ, బ్రిటిష్‌ప్రభుత్వం ఏర్పాటుచేసిన 'కంట్రోలు బోర్డు'కూ సంఘర్షణలు మామూలైపోయినవి. పిట్టుకు పూర్వం ఫాక్సు భారతదేశంలో ఈస్టిండియా కంపెనీవారు సంపాదించిన భూభాగంలో మంచి ప్రభుత్వాన్ని ఏర్పరచి, పరిపాలన సక్యంగా చేయడానికి ఒక బిల్లును తయారుచేశాడు. కాని బిల్లు శాసనం అయ్యేవరకూ ఆయన అధికారంలో ఉండలేదు. పిట్ తన ఇండియాచట్టలక్ష్యాన్ని ౧౭౮౪ జూలై ౬ న పార్లమెంటులో ఈవిధంగా వివరించాడు : "భారతదేశానికీ, ఈస్టిండియాకంపెనీకీ ఏ విధమైన హానీ జరక్కుండా, మేలుచేయడమే ఈబిల్లు ఉద్దేశ్యం." ఈబిల్లుపై ప్రసంగిస్తూ ఫాక్సు "పార్లమెంటు తయారుచేసే ఇండియాబిల్లులు ఏసూత్రాలపై తయారు కావాల్సిందీ ఇలా వివరించాడు : "భారతదేశములోని మన ప్రాంతాలకు సరికొత్త ప్రభుత్వవిధానాన్ని అమలుచేయడం అవసరమని నేను భావించడంలేదు. ప్రస్తుతం ఆప్రాంతాల్లో అమల్లోఉన్న పద్ధతినే సంస్కరించాలి. భారతదేశపరిపాలనావిధానంలో మార్పులు చేసే సందర్భంలో ముఖ్యంగా గమనింపవలసిన విషయాలు మూడు ఉన్నవి. మొదటిది భారతదేశంతో ఈదేశానికి ఉన్న వ్యాపారం. రెండవది ఆ వర్తకసంబంధంఫలితంగా మనకు లభిస్తున్న సంపద. స్థానికప్రజల క్షేమం. వీటి నిర్వహణకూ బ్రిటిష్ రాజ్యాంగానికీ గల సంబంధం."

"వేలమైళ్ల దూరంలో" ఉండి ఒక దేశాన్ని పరిపాలించడం ఎంత కష్టమో ఈబిల్లు చర్చసందర్భం

లోనే పిట్ పార్లమెంటుకు వివరించాడు. మొత్తం మీద అతఃపూర్వపు శాసనాలకంటే పిట్ ఇండియా చట్టం చాలావరకు తృప్తికరంగానే అమలుజరిగింది.

౧౭౯౭ లో మరొకశాసనం తయారైంది. ఈశాసనంప్రకారం రాష్ట్రిన్యాయస్థానాలు గవర్నర్ జనరల్ తనసలహాసంఘంతో తయారుచేసే నియమనిబంధనలప్రకారం వ్యవహరింపవలసివచ్చింది. ఈశాసనం అయిన మూడు సంవత్సరాలకు చెన్నపట్నంలో ఒక సుప్రీంకోర్టును స్థాపిస్తూ మరోశాసనం జరిగింది. ౧౮౦౭ లో మద్రాసు, బొంబాయిగవర్నరులకుకూడా న్యాయస్థానాల విషయంలో గవర్నరుజనరలుకు ఉన్న అధికారాలను ప్రసాదిస్తూ ఇంకొకశాసనం తయారైంది. ఇంతలో నెపోలియన్ రావడం, యూరపురేవులు బ్రిటిష్‌వ్యాపారానికి బందుకావడం జరిగింది. ఆకారణంగా ౧౮౧౩ వ సంవత్సరంలో మరొక ఛార్టరు అక్టును పార్లమెంటు తయారుచేసింది. ఈశాసనం భారతదేశంలోని 'కంపెనీ' భూభాగాలపై సర్వాధికారం బ్రిటిష్‌రాజుదే నని నిర్ధారణచేసింది. తరువాత ఇరవై సంవత్సరాలకు పార్లమెంటు 'భారత రాజ్యాంగం'లో చాలా ముఖ్యమైన మార్పులు చేస్తూ మరొక శాసనం చేసింది. లార్డ్ మెకాలే, జేమ్స్‌మిల్ కృషిఫలితమే ఈ శాసనం. ఈశాసనంవల్ల కలిగిన మార్పులలో ఒకటి ఇరవై సంవత్సరాలవరకూ ఈస్టుఇండియాకంపెనీవారు బ్రిటిష్‌రాజూ, ఆయన వారసుల తరఫున ధర్మకర్తలుగా భారతదేశాన్ని పాలించడానికి జరిగిన ఏర్పాటు. ఇంతకుపూర్వం భారతదేశంతో వ్యాపారంచేయాలంటే ఆ వర్తకకంపెనీ బ్రిటిష్‌ప్రభుత్వంనుండి లైసెన్సులు పొందుతూఉండాలి. ఈ ౧౮౩౩ శాసనంప్రకారం లైసెన్సులు పొందవలసిన అవసరం పోయింది. ఎవరుపడితే వారు యథేచ్ఛగా భారతదేశం పోయి వ్యాపారం చేసుకోవచ్చు. ౧౮౫౩ లో పార్లమెంటు మరొక శాసనం ద్వారా వెనుకటి ఏర్పాట్లనే ధ్రువపరుస్తూ కంపెనీ ధర్మకర్తృత్వానికిమాత్రం గడువు అంటూ ఏమీ పెట్టలేదు.

౧౮౫౩ శాసనం భారతదేశంలో ఒక లెజిస్లేటివ్ కౌన్సిలుస్థాపనకు అవకాశం కల్పించింది. ఈశాసనాన్ని పార్లమెంటు ౧౮౫౩ ఆగస్టు ౨౦ వ తేదీన ఆమోదించింది. ఈశాసనంప్రకారం బెంగాలుకు ఒక ప్రత్యేకగవర్నరును, సలహాసంఘాన్నీ నియమించడానికి వీలుకలిగింది. అలాగే బొంబాయి, బెంగాల్, మద్రాసు రాజధానులు గాక కొత్త రాజధానులను స్థాపించడానికి ఈస్టుఇండియాకంపెనీడైరెక్టర్లకు అధికారం లభించింది. ప్రస్తుతం వ్యవహారంలో ఉన్న రాజధానులకు వర్తించే శాసనాలు అన్నీ ఈ కొత్త రాజధానులకు వర్తించగల వనికూడా ఈశాసనం నిర్ణయించింది. రాజధానులకు గవర్నర్లను నియమించినట్లే ఇతరప్రాంతాలకు లెఫ్టినెంట్ గవర్నర్లను నియమించడానికి కూడా అవకాశం ఏర్పడింది. భారతదేశంలో మొదటిదఫా చట్టసభ స్థాపన ఈ శాసనంలోని ప్రధానాంశం అని మొదట చెప్పాను. ఆనాటి గవర్నర్ జనరలులో అంతర్నిహితమైయున్న శాసనాధికారాల సక్రమనిర్వహణకు ఈలెజిస్లేటివ్ కౌన్సిలును ఏర్పాటు చేస్తున్నట్లు శాసనం వివరించింది. గవర్నరు, లెఫ్టినెంట్ గవర్నరు రాష్ట్రాలనుండి ఒక్కొక్కరు, గవర్నరుజనరల్ ఈకౌన్సిల్‌లో సభ్యులుగా ఉంటారు. లెఫ్టినెంట్ గవర్నరుప్రాంతాలనుండి సభ్యులను గవర్నరూ, లెఫ్టినెంట్ గవర్నరూ నామినేట్ చేస్తారు. ఇలా నామినేట్ అయ్యేసభ్యులు కంపెనీనౌకరీలో అసమం పది సంవత్సరాలైనా పనిచేసిఉండాలి. వీరుగాక బ్రిటన్‌లోని, భారతవ్యవహారాల కమిషనర్ల బోర్డువారు సూచించగా, డైరెక్టర్ల కోర్టువారు ఇద్దరు ఇతరసభ్యులను ఈ శాసనసభకు నియమించేందుకు గవర్నరుజనరలుకు అధికారం ఇవ్వవచ్చు. ఈ ఇద్దరుసభ్యులుకూడా కంపెనీవారి నౌకరీలో ఉన్నవారే కావాలి. అయితే వీరు కేవలం శాసనాలను చేసే సందర్భంలోనే కౌన్సిల్ సమావేశాలకు హాజరవుతూ, వోటుచేయడానికి హక్కు కలిగిఉంటారు. ఇది మన దేశానికి ఏర్పడిన మొదటి చట్టసభ.

ఈసభకు గవర్నరుజనరల్ అధ్యక్షుడు. ఆయనే ఒక ఉపాధ్యక్షుని నియమించవచ్చు. గవర్నరుజనరల్,

ఆయన హాజరుకాలేనిపక్షంలో ఉపాధ్యక్షుడు ఈ సమావేశాలకు అధ్యక్షత వహిస్తారు. శాసనాలను చేయడంలో వాటిని అమలుజరిపి పాలించేవారుకూడా పాల్గొనడం మంచిదని ఈ కౌన్సిల్‌లో ముగ్గురు న్యాయమూర్తులకుకూడా సభ్యత్వం కల్పించారు.

౧౮౫౩ వ సంవత్సరంలో పార్లమెంటు చేసిన శాసనమే ఈస్టిండియాకంపెనీకి భారతదేశంపైగల అధికారాలకు సంబంధించిన ఆఖరుశాసనం. ఈశాసనం ప్రకారం కంపెనీడైరెక్టర్ల సంఘం, కంట్రోలుబోర్డు ఆమోదంతో భారతగవర్నర్‌జనరల్ భారతదేశంలోని 'బ్రిటిషుభూభాగం'లో ఏప్రాంతాన్నైనా అయినా తన అధికారంక్రిందికి తీసుకొని ఆ ప్రాంతపరిపాలనకు అవసరమైనఏర్పాట్లు చేయవచ్చు. అస్సాం, మధ్యపరగణాలు, బర్మా మొదలైన ప్రాంతాలకు ఛీఫ్‌కమిషనర్లను నియమించడం ఈ అధికారాన్ని అనుసరించే జరిగింది. అయితే ౧౮౩౦ వరకూకూడా ఈ ఛీఫ్‌కమిషనర్‌హోదాను పార్లమెంటు గుర్తించలేదు.

౧౮౫౭ లో సిపాయివిప్లవం. అది విఫలంకావడంతోనే బ్రిటిష్‌పార్లమెంటు భారతదేశంపై ఈస్టిండియాకంపెనీ అధికారానికి స్వస్తిచెప్పింది. ౧౮౫౮ ఆగస్టులో క్రొత్త ఇండియాప్రభుత్వచట్టం తయారైంది. ఈచట్టంప్రకారం భారతదేశంపై విక్టోరియా మహారాణికి సర్వాధికారం సంక్రమించింది. ఆ మొదలుగా భారతదేశపరిపాలనను నిర్వహించేందుకు ఒక సెక్రటరీఆఫ్‌స్టేట్‌ను నియమించడానికి ఈ శాసనం ఏర్పాటుచేసింది. ఈయన జీతాన్నీ, ఈయనక్రింది అధికారుల జీతాన్నీ భారతదేశాదాయంనుండే చెల్లించాలని కూడా ఈ చట్టం శాసించింది. ఈ సెక్రెటరీఆఫ్‌స్టేట్‌గాక, పదిహేనుమంది సభ్యులతో ఒక ఇండియాకౌన్సిలును కూడా ఈశాసనం ఏర్పాటుచేసింది. ఇందులో ఏడుగురిని ఈస్టిండియాకంపెనీవారూ, మిగతా ౮ మందినీ విక్టోరియారాణీ నియమించడమౌతుంది. ఈకౌన్సిలుకు 'భారతగవర్నరుజనరల్ కౌన్సిల్' అని నామకరణం చేశారు. ఈకౌన్సిల్ సభ్యులకు పార్లమెంటులో పాల్గొనే అధికారం లేదు. వీరి జీతభత్యాలూ, పెన్షన్లూ భారతదేశాదాయంనుంచే ఇవ్వాలి. ఈకౌన్సిల్ సెక్రెటరీఆఫ్‌స్టేట్ సూచనలను అనుసరించి భారతదేశవ్యవహారాలను నిర్వహిస్తూ ఉంటుంది. అయితే ఈకౌన్సిల్ భారతదేశానికి పంపే ఉత్తరువులపై ప్రభుత్వకార్యదర్శి సంతకం చేస్తూ ఉండాలి. కార్యభారమునుబట్టి, వ్యవహారనిర్వహణావసరాలనుబట్టి ఈ కౌన్సిలును వివిధఉపసంఘాలుగా ఏర్పాటుచేయడానికి ప్రభుత్వకార్యదర్శికి అధికారం ఉంది. ఈకౌన్సిలుకు ఈయనే అధ్యక్షుడు. ఈయనే ఒక ఉపాధ్యక్షుని నియమించవచ్చు. భారతదేశంనుండి వచ్చే రహస్యఉత్తరాలను వేటినీ ఈ కౌన్సిలుకు తెలియజేయవలసిన అవసరం లేదు. ఈ కౌన్సిలునిర్ణయాలను త్రోసిరాజనడానికి ప్రభుత్వకార్యదర్శికి పూర్తిఅధికారం ఉంది. భారతదేశాదాయాన్ని ప్రభుత్వకార్యదర్శి, ఆయనసంఘం తీర్మానించేవిధంగా ఖర్చుచేయవలసి ఉంటుంది. ఈ జమాఖర్చుల వివరాలను ఏటా ప్రభుత్వకార్యదర్శి పార్లమెంటుకు సమర్పించాలి. లోగడ ఈస్టిండియాకంపెనీవారు చేసుకొనిఉన్న ఒడంబడికలనన్నింటినీ బ్రిటిష్‌మహారాణిపాలించాలనికూడా ఈశాసనం నిబంధించింది.

ఈచట్టాన్ని పురస్కరించుకొని విక్టోరియా మహారాణి ౧౮౫౮ నవంబరు ౧ వ తేదీన ఒక ప్రకటన చేసింది. వైకౌంట్‌కానింగును భారతదేశానికి మొదటి వైస్రాయిగా, గవర్నర్‌జనరలుగా నియమించినట్లు ఈప్రకటనే వెల్లడించింది. వర్ణవివక్షతను రద్దుచేస్తూ ప్రభుత్వోద్యోగాలకు బ్రిటిష్‌పౌరులందరూ సమానార్హులేనని కూడా విక్టోరియామహారాణి ఈప్రకటన ద్వారా స్పష్టంచేసింది. సంస్థానాధీశులు తమ పరిమితులకు లోబడి వ్యవహరించేపక్షంలో వారి స్థాయికి, హోదాకు ఎట్టి భంగమూ కలుగదని విక్టోరియా ఈప్రకటనద్వారాకూడా మరొకసారి స్పష్టముచేసినది.

ఈస్టిండియాకంపెనీకి రాజకీయాధికారం సంక్రమించినప్పట్నుంచీ ఆ అధికారం బ్రిటిష్‌రాజుకు సంక్రమించేవరకూ భారతదేశపరిపాలనకు శాసనాలు ఏవేవో, ఏవిధంగా తయారవుతూవచ్చినవో ఇంతవరకూ పరిశీలించాం. ౧౮౫౮ నుండీ భారతరాజ్యాంగశాసనాలు పూర్వంఅంత తరుచుగా జరుగలేదని

చెప్పవచ్చు. ౧౯౩౫ వ సంవత్సరపు శాసనమే బ్రిటిష్ పార్లమెంటు మన దేశపాలనకు తయారుచేసిన ఆఖరు శాసనం. దాన్ని నూత్న హోదాకు తగ్గట్టు మనం సూచించినవిధంగా బ్రిటిష్‌పార్లమెంటు ౧౯౪౭ లో సవరించింది. నూత్న రాజ్యాంగం అమలుకువచ్చిన ఈనాటివరకూ మన దేశపరిపాలన ఆచట్టంప్రకారమే జరుగుతూవచ్చింది.

౧౮౬౧ వ సంవత్సరంలో 'ఇండియన్ కౌన్సిల్స్ ఆక్టు' అంటూ ఒకటి తయారైంది. గవర్నరు జనరల్ తన శాసనసభకు ఆర్గురికి తక్కువ లేకుండా, పన్నెండుమందికి ఎక్కువ కాకుండా నామినేట్ చేయడానికి ఈచట్టం వీలుకల్పించింది. ఈవిధంగా నామినేట్ అయిన సభ్యులు రెండు సంవత్సరములు ఆకౌన్సిల్ సభ్యులుగా ఉంటారు. వీరు కేవలం గవర్నరు జనరల్ కౌన్సిల్ శాసనసభగా సమావేశమైనప్పుడే ఆ సమావేశాల్లో పాల్గొనగలరు. వీరు ప్రభుత్వోద్యోగులుగామాత్రం ఉండరాదు అంటే ఓంప్రథమంగా శాసనసభలో అనధికారులకు స్థానం లభించింది. అయితే ఈ చట్టసభ చేసే శాసనాలను త్రోసి వేయడానికి బ్రిటిష్‌సార్వభౌమునికి అధికారం ఉంది. అసాధారణపరిస్థితుల్లో ఆర్డినెన్సులు జారీచేయడానికి గవర్నరుజనరలుకు విశేషాధికారాన్ని ఈశాసనం ప్రసాదించింది. కేంద్రంలో గవర్నరుజనరలుకు ఉన్నట్టే రాష్ట్రాల్లో గవర్నరులకూ శాసనసభలు ఏర్పడినవి. వీటి నిర్మాణం కేంద్రసంఘనిర్మాణం అనుసరించే జరిగాలి. ఇదేవిధంగా లెఫ్టినెంట్ గవర్నరుల రాష్ట్రాలకూ శాసనసభలు ఏర్పాటైనవి. తరువాత పదిసంవత్సరాలకు జరిగిన మరొక 'ఇండియా కౌన్సిల్స్ ఆక్టు' కారణంగా రాష్ట్రశాసనసభల అధికారాలు కొంచెం విస్తృతమైనవి. ౧౯౦౭ లో మరొక కౌన్సిల్ ఆక్టు తయారైంది. దీనిప్రకారం గవర్నర్ జనరల్ కౌన్సిల్ సభ్యులసంఖ్య ౧౬ వరకూ పెరిగింది దీన్ని పురస్కరించుకొనే లార్డ్ మార్లే ౧౯౦౭ లో కె. జి. గుప్త, సయ్యద్ హుసేన్ బిల్గ్రామీ గార్లను "ఇండియా కౌన్సిల్" సభ్యులుగా నియమించారు. ౧౮౮౫ వ సంవత్సరంలో కాంగ్రెస్ ప్రారంభించినఆందోళన కొంతవరకు ఫలించింది. ఇతఃపూర్వం ౧౮౯౨లో మరొక శాసనంద్వారా లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుల సంఖ్యను హెచ్చించారు. మాంట్-ఫర్డ్ సంస్కరణలకు పూర్వం జరిగిన ఇతర శాసనాల్లో గమనింపదగ్గది ౧౯౦౯ శాసనం. మొదటిదఫా శాసనసభల సభ్యులకు ఎన్నికపద్ధతి ఈచట్టంద్వారానే ఏర్పడింది ఈ శాసనాన్ని అనుసరించే బెంగాలుకూ, ఇతర లెఫ్టినెంట్ గవర్నర్ల రాష్ట్రాలకూ కార్యవర్గాలు ఏర్పడినవి. ఈ కార్యవర్గాల సభ్యులు శాసనసభల సభ్యులుగా ఉంటారు. మొదటి పర్యాయం ప్రభుత్వవ్యవహారాలపై శాసనసభ సభ్యులు ప్రశ్నలు వేయడానికి అధికారం లభించింది కూడా ఈశాసనంవల్లనే.

దీనితరువాత వచ్చిన ౧౯౧౯ శాసనం మనకు ద్వంద్వప్రభుత్వాన్ని ప్రసాదించింది. ప్రథమంగా మంత్రివర్గాలు ఏర్పడ్డవి. అయితే ఈ మంత్రులకు ప్రధానవిషయాల్లో అధికారం లేదు. ౧౯౩౫ వ సంవత్సరపుచట్టం ఈద్వంద్వప్రభుత్వాన్ని రద్దుచేసి ఒక విధమైన రాష్ట్రస్వపరిపాలనాన్ని ప్రసాదించింది. భారతఫెడరేషనుకు ఈశాసనం చేసిన ఏర్పాట్లు భారతప్రజలకు సమ్మతం కానందువల్ల అమలు జరుగలేదు. కేంద్రంలో ౧౯౧౯ శాసనం, రాష్ట్రాల్లో ౧౯౩౫ శాసనం అమల్లోఉంటూవచ్చినవి. ౧౯౪౬ సెప్టెంబర్లో కేంద్రంలో హైప్రాయి కార్యవర్గనిర్మాణంలో మొదటిసారి మార్పు వచ్చింది. పండిట్ నెహ్రూ 'ప్రధానమంత్రి' అయినాడు. ౧౯౪౭ జూన్‌లో దేశ విభజన జరిగి, ఆగస్టు ౧౫ వ అధినివేశప్రతిపత్తి లభించింది. ఇప్పుడు మనం తయారుచేసుకున్న రాజ్యాంగం ప్రకారం పరిపాలన సాగుతున్నది. నూరేళ్లనాడు ప్రారంభమైన స్వాతంత్ర్యపోరాటం నేడు ఫలించింది.



అధ్యక్షుడు శ్రీ రాజేంద్రప్రసాదు

# మన అధ్యక్షుడు

# మాన్యశ్రీ రాజేంద్రప్రసాదు

భారతరిపబ్లికుకు ప్రప్రథమ అధ్యక్షుడుగా పోటీలేకుండ శ్రీ బాబూ రాజేంద్రప్రసాదు ఏకగ్రీవముగా వరింపబడుట నిజముగా మనము చేసి కొన్న సుకృతఫలము.

*    *    *    *

నిరాడంబరుడు, నిస్స్వార్థజీవి, అకళంకవర్తనుడు, అజాతశత్రువు, అలనపాలనలలో ఆరమగ్గిన వృద్ధు, ప్రజాసేవా, దేశసేవలే పరమార్థముగా పరిగణించెడు ధన్యపురుషుడు స్వతంత్రభారతదేశ ప్రజాతంత్రమునకు సారథ్యము వహించుటచే నిక మన దేశము సర్వదా సుందరముగ వెలిసినదన్నమాటే.

*    *    *    *

బాబూ రాజేంద్రప్రసాదు జీవిత మెంత గొప్ప జీవితము. అదినుండియు ఆయనజీవితము సేవావ్రతముల తో నే గడచినది. నడతలో, నడకలో, వర్తనలో, వ్యవహారములలో, ఆదర్శములలో, అలవాట్లలో అన్నిట-దైహికమానసికప్రవృత్తులం దన్నిట అన్ని కాలము లందు ఆయన ఒక్కరీతినే, ఒక్కధోరణినే కనబరచుచువచ్చినాడు. ఎటుచూచినను ఆయనది సేవా జీవితముగానే వెల్లివిరిసినది. ఆయన పుణ్యాత్ముడు!

*    *    *    *

౧౮౮౪ డిసెంబరు ౩-వ తేదీనాడు ఆయన ఉత్తరబీహారులోని సారణ జిల్లాకు చెందిన ఒకానొక కులీనకాయస్థకుటుంబమున జన్మరొత్తెను. వారి దొక గొప్ప భూవసతిగల కుటుంబము. ఆయనను కన్న ధన్యపురుషుడు మున్షీ మహాదేవసాహే. మహాదేవసాహేకు అయిదుగురు కొడుకులు. అందులో కడగొట్టువాడు మన రాజేంద్ర ప్రసాదు.

రాజేంద్రబాబుచదువుసంధ్యలు కూడ వారి భావిధన్యజీవితమునకు సూచకముగా జయప్రదముగా కొనసాగినవి. అన్ని పరీక్షలలోను వారు ఉత్తమతరగతిలోనే ఉత్తీర్ణులగుచువచ్చినారు. ౧౮౯౩ లో ప్రాథమికవిద్య ప్రారంభించి, ౧౯౦౨ లో ప్రవేశ పరీక్షలో నెగ్గి, పిమ్మట కలకత్తా రాజధాని కళాశాలలో చదువు సాగించి ౧౯౦౬ లో బి. ఏ పరీక్షలోను, ౧౯౦౮ లో యం. ఏ. పరీక్షలోను కృతార్థులైరి. ౧౯౧౦ లో న్యాయవాద విద్యయందును పట్టభద్రులైరి. ౧౯౧౫ లో యం. యల్. పట్టమును గూడ సంపాదించిరి.

*    *    *    *

ఒక యేడాదిపాటు కాలేజీలో ముజఫరుపూరు కళాశాలలో ఆచార్యుడుగానుండి, బాబూ రాజేంద్రప్రసాదుగారు ౧౯౧౧ లో కలకత్తాహైకోర్టులో వకీలువృత్తితో జీవితమును ప్రారంభించిరి. ఈ వృత్తి అయిదారేండ్లపాటు అమోఘముగా కొనసాగినది. ఆర్జన మూడు పూవు లారుకాయలుగా రాణించినది. వట్టి ఆర్జనమాత్రమే కాదు. మహామహులవారి మన్ననలుకూడ లభించినవి. అన్నట్లు ౧౯౧౬ లో వీరి వకీలువృత్తి పాట్నా హైకోర్టురంగమునకు మారినది. కేవలము ఒక్క వకీలువృత్తికే వీరు తమ జీవితము నంకితము చేయలేదు; విద్యాభివృద్ధికి కూడ వీ రెంతో కృషిచేసినారు. పాట్నా విశ్వవిద్యాలయపు సిండికేటు, సెనేటులలో వీరు సభ్యులుగా నుండి ప్రదర్శించిన చాకచక్యము మరువరానిది.

*    *    *    *

అక్కడితో రాజేంద్రబాబు జీవితములో ఒక్క అధ్యాయము ముగిసినది. ౧౯౨౦ లో క్రొత్త అధ్యా

యము ప్రారంభమైనది. ఆ యేడు గాంధీమహాత్ముడు బీహారులోని చాంపరానుకు వెళ్ళిన సందర్భమున ఆయన గారితో రాజేంద్రబాబుకు ప్రప్రథమపరిచయ మేర్పడినది. ఏర్పడీఏర్పడగానే గాఢముగా ఏర్పడి, చాంపరాను ఆందోళనములో సరాసరి పాల్గొనుటతో కారాగారజీవితానుభవమునకు నాందీప్రస్తావనలైనవి. అది మొదలు వారి జీవితము దేశసేవా ప్రజాసేవాభిముఖమైనది. వకీలు వృత్తికి స్వస్తి చెప్పినారు. త్రికరణశుద్ధిగా మహాత్ముని అనుచరత్వమును అవలంబించినారు. గాంధీజీ సిద్ధాంతములను అక్షరశః ఆచరణలో పెట్టినారు. గాంధీజీకి నమ్మినబంట్లలో నొక్కరుగా వాసికెక్కినారు.

* * * *

౧౯౨౦ లో జరిగిన సహాయనిరాకరణోద్యమములో జంకుగొంకులు లేక పాల్గొన్నారు. తొట్టతొలి సారి ఒకానొక కాంగ్రెసువార్షికసమావేశములో వాలంటీరుదళములో వేలాదిమంది వాలంటీర్లలో నొకరుగా కాంగ్రెసుసేవచేసిన రాజేంద్రప్రసాదు క్రమక్రమముగా తన నిష్కళంకసేవామహిమచేత ఉన్నతోన్నతపదవుల నెక్కినాడు. కార్యవర్గసభ్యుడుగా పెక్కేండ్లు ఉన్నాడు. రెండు మూడు పర్యాయములు కాంగ్రెస్ అధ్యక్షపీఠము నలంకరించినాడు. రాజ్యాంగపరిషత్తుకు అధ్యక్షుడైనాడు. రాజ్యాంగరచయితయైనాడు. నేడు భారతప్రజాతంత్రపరిపాలనకు సారథి కూడ అయినాడు. మనిషిలో ఎంతటి మహిమవిశేషమో లేనిది ఇంతటి మహత్తమపదవులు వరుసవెంబడివచ్చునా!

౧౯౩౪ లో బీహారునందు కనివిని యెరుగనంతటి కల్లోలములతో సంభవించిన భూకంపమునకు దద్దరిల్లి, కన్నకడగండ్లకు పాలైన ప్రజలకు, నిద్రాహారములు లేక, శ్రీ రాజేంద్రప్రసాదు గావించిన అమోఘమైన సేవ ప్రజలనే కాక, ఆనాటి ప్రభుత్వపీఠాధిపతులను గూడ అబ్బురమున ముంచెత్తినది. ప్రజాసేవయన వీరి కెంతటి మమకారమో ఆ సంఘటనలో దేశమునకు బాగుగా వ్యక్తమైనది. రాజేంద్రప్రసాదుజాలిహృదయము అంతలో అందరికిని తెలిసిపోయినది.

* * * *

ఇటువంటి మహాపురుషుడు మన పాలిటికి నేడు సారథియగుట మన భాగ్యముకాదా మరి! ఈయన అడుగుజాడలలో, ఈయన చెప్పు చేతలలో నడచి భారతదేశము అచిరకాలమున మహావైభవమును గడించి సాటిప్రజాతంత్రదేశములలో ప్రముఖమైనదిగా విలసిల్లగలదనుటకు సందియము లేదు.



# సంస్కృతనాటకాలు: పాత్రపోషణ

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

●

సంస్కృతసాహిత్యంలో—అన్నిరచనలవలెనే నాటకరచనకూడా ఉన్నతశిఖరాల నందుకున్నది. సంస్కృతనాటకాల ప్రసక్తి తెస్తే చట్టున మనకు భాసుని ప్రతిమ, స్వప్నవాసవదత్తం, పంచరాత్రం వగైరాలు, మృచ్ఛకటికం, ముద్రారాక్షసం మొదలైనవి మొట్టమొదట స్ఫురిస్తాయి.

తర్వాత అభిజ్ఞానశాకుంతలం, ఉత్తరరామచరితం, రత్నావళి మొదలైనవి జ్ఞాపకంవస్తాయి.

ఆవెనక అనర్ఘరాఘవం, ప్రబోధచంద్రోదయం ఇత్యాదులు మనస్సుకు తట్టుతాయి.

ఒకతరహా సంస్కృతసాహిత్యపరుల నాటకదృష్టి ఇంకోవిధంగా వుంటుంది.

వారుకూడా కావ్యాల్లో నాటకం రమ్యమైనది అని అంగీకరిస్తూ వానిలో రమ్యతరమైనది శాకుంతలమనీ, దానిలోకూడా నాలుగో అంకం గొప్పదనీ, అందులోనూ నాలుగుశ్లోకాలు ఉత్తమమనీ ప్రశంసిస్తారు. ఈ ప్రస్తుతిలో అగ్గలమైన కవితాభిమానం గోచరిస్తుందిగాని, నాటకజీవస్పర్శ కనిపించదు. ఈరకం వారికి మంచి పద్యాలుంటే చాలు; అది గొప్ప నాటకం అయిపోతుంది.

ఈదృష్టితో ఇప్పుడు నాటకాన్ని చూచే అవకాశం లేదు. మంచి పద్యాలుంటే ఉత్తమకావ్యం కావచ్చు గాని గొప్పనాటకం కావడం అసంభవం. నాటకానికి కవిత ప్రధానం కాదని ఎందరో ఉత్తమ నాటకరచయితలు రుజువుచేశారు.

నిండుజీవంతో కదిలే పాత్రలు, నేర్పు ఉట్టిపడే సంఘటనలు, నిశితమైన సంభాషణలూ నాటకరచనకు జీవనాడులని పలువురు రచయితలు గ్రహించి తమ రచనలు సాగించారు.

సంస్కృతనాటకసాహిత్యాన్ని స్థూలంగా మూడువిభాగాలు చెయ్యవచ్చు—౧. కేవలనాటకాలు, ౨. రసనాటకాలు, ౩. ప్రయోజననాటకాలు అని.

మొదట చూపించిన నాటకవిభాగం ఈదృష్టితో చేసినదే.

నాటకం అనే పేరుతో ఒక రచన చదివి మూసివేస్తే వెంటనే మన మనోనేత్రం ఎదుట ఆ రచనలోని పాత్రలు విశిష్టంగా ప్రత్యక్షమై చురుకైన వాక్యాలు చెవుల్లో మ్రోగితే అది అచ్చపు నాటకం అనిపిస్తుంది.

ఇట్లాంటి నాటకత్వం తొణికే రచనలు చెయ్యడంలో భాసమహాకవిని ముందు చెప్పి తర్వాత ఇంకొకరిని చెప్పవలసిఉంది. ఆయన నాటకరచన ఒక కళాతపస్సు. ఆ తపస్సులో అతడు పట్టి బంగారం చెయ్యని రచన లేదు. ఆయనదృష్టిలో నాటకం ఒక సుందరస్వప్నం కాదు. అది ఒక చైతన్యపూరితజీవలోకం.

తక్కిన కవులు సాధారణానుభూతిని స్వర్గసీమలకు ముడివేస్తే ఈయన దివ్యలోకవృత్తాలకు మానవహృదయంలో భాష్యాలు కల్పించి మనుష్యలోకానికి చేరువగా తెస్తాడు.

ఈయన నాటకదృష్టి ప్రతిమానాటకంలోని ఈ వాక్యంవల్ల స్ఫుటంగా తెలుస్తుంది.

"కాలసంవాదినా నాటకేన సజ్జా భవత" —అంటే ఒక ప్రతీహారి రామపట్టాభిషేకసమయంలో ఒక పరిచారికను పిలిచి నటకులతో ఇట్లా చెప్పమంటుంది. "కాలానికి తగిననాటకం వెయ్యడానికి సిద్ధంగా వుండండి"అని. కాలానికి తగిన నాటకం అనడంలో నాటకప్రయోజనం ఏమిటో, రచనావిధానం ఎట్టిదో ఈయన పరోక్షంగా నిర్వచించాడు.

తక్కిన సుగుణాల మాట అట్లా వుంచి ఈయన నాటకాలలోని పాత్రసృష్టి అద్భుతంగా కనబడుతుంది. తీసుకున్నవి సుప్రసిద్ధపురాణేతిహాసకథలైనా, ఆ కథాపురుషులను చిత్రించడంలో ఈయనచూపిన నేర్పు అద్వితీయం.

అందరూ ఎరిగిన రామాయణకథ గ్రహించి ఈయన ప్రతిమానాటకంలో చేసిన అపూర్వకల్పన దిగ్భ్రాంతి కలిగిస్తుంది.

ఇందులోని సీతారాములు, కైకేయీ దశరథులు, భరతుడు ఎంతో సహజరూపాలతో ప్రత్యక్షమవుతారు. సఖులతో నవ్వుతూ, పరిహాసకేళిలో పాల్గొని చకచక కదిలే సీతకు రామపట్టాభిషేకభంగం ఏమీ విషాదకారణం కాకపోగా, పైగా "మహారాజే ఈపైనిగూడ మహారాజు. రామచంద్రుడు రామచంద్రుడే" అని ఎంతో తృప్తి కనపరుస్తుంది. లక్ష్మణుడు రాజ్యభంగానికి కోపగిస్తే రాము డంటాడు: "వరాలతో తాను కొన్న రాజ్యం చిన్నమ్మ తన కొడుకుకోసం అడిగితే తప్పేముంది! నేను భ్రాతృరాజ్యం అపహరించడానికి సిద్ధపడడం తప్పుకాదూ?" అని చెప్పి ఈరాముడు తన నారచీరలు తండ్రికి సంతాపకారణాలని ఆయనకు కనబడకుండా అడవికి నడిచేటంత ధీరమూర్తి!

రామాయణకథల్లో ఎక్కడైనాసరే కైకేయి కుటిలస్వభావగా—స్వార్థపరురాలుగా కనబడుతుంది.

ప్రతిమలోని కైక ఎంత ఠీవిగా, ఎంత గంభీర హృదయంతో కనబడుతుంది!

కుమారుని దూషణం చిరునవ్వుతో విని ఊరుకొని ఒక్కటే మాట అంటుంది. "నా వరద్వయప్రయోజనం నీకు ముందు స్పష్టపరుస్తాను తండ్రీ" అని తుదిని ఇట్లా అంటుంది: "ఋషిశాపం ప్రవర్తిల్లక తప్పదు. అందుకు రామచంద్రుని పంపాను." అంటే భరతుడు "నన్నేల పంపలేదు" అన్నాడు. "నీవు తరుచు మేనమామయింట నుండడం మామూలుకనుక నీ వియోగం ఆయన్ను బాధించదు." అన్నది. భరతుడు తిరిగి "అయితే—పదునాలుగేండ్లు ఎందుకు?" అని ప్రశ్నిస్తే,"పదునాల్గు రోజులనబోయి ఏండ్లు అన్నాను—అలజడిలో" అన్న కైకను చూడగా ఒకవిధమైన గౌరవం కలుగుతుంది కాని ద్వేషం రాదు.

ఇక ముఖ్యంగా పేర్కొదగినది ఈనాటకంలోని దశరథచిత్రణం. ఇంత స్నేహపూర్ణమైన హృదయంతో దశరథుని నిండువిగ్రహం చూపినవా రింకొకరు లేరు.

ఇతని పుత్రప్రేమకు ప్రకృతి కంటతడిపెడుతుంది. సుమంత్రుడు అడవినుంచి తిరిగివచ్చి, 'సీతారామలక్ష్మణులు' అని ఒక ప్రసక్తిలో అంటే ఈ దశరథుని స్నిగ్ధహృదయం అమంగళం శంకించి అంటుంది: "సుమంత్రా, పాపం, చిన్నపిల్ల సీతను రామలక్ష్మణులకు మధ్యగా వుండనీ. మాటలోకూడా ఒంటరిగా చెప్పకు నాయనా"

ఒకసారి నాటకం చదివితే చాలు ఈ దశరథుని మరచిపోము.

భాసమహాకవి భారతనాటకాలలోని దుర్యోధనుడు, కర్ణుడు, ద్రోణుడు, ధృతరాష్ట్రుడు, గాంధారి, ఘటోత్కచుడు ప్రత్యేకవ్యక్తిత్వంతో సాక్షాత్కరిస్తారుగాని, పూర్వమే మన అందరి హృదయాలలోనూ మంచిచెడ్డలతో స్థిరపడ్డ పాతవ్యక్తులుగా మాత్రం కనబడరు. ఇతని దుర్యోధనుడికి క్షమ, సత్యం, స్నేహపూర్ణహృదయంకూడా ఉన్నాయి. కర్ణుడు దుష్టచతుష్టయంలో ఒకడు కాడు. అభిమానం, ఉన్నతహృదయం, బంధువత్సలత, కార్యతత్పరత కలవాడై "ఏమయ్యా, పాండవులకు రాజ్యం ఇవ్వనా" అని దుర్యోధను డడిగితే "రాజా, కత్తితో నీకు యుద్ధంలో

సాహాయ్యం చేస్తానుకాని మీ సోదరవ్యవహారములతో కలిగించుకోను" అన్న ఉదారుడు. (పంచరాత్రం)

ఈతని ద్రోణుడు పాండవులకోసం దుర్యోధనుణ్ణి యాచించి రాజ్యం సంపాదించిన శిష్యవాత్సల్యపూర్ణుడు. ధృతరాష్ట్రుడు అభిమన్యుమృతికి దురపిల్లి దుర్యోధనాదులను నిష్కపటంగా మందలించిన కుటుంబవృద్ధుకాని విషహృదయంతో పెద్దరికం నటించే మాత్సర్యపూరితుడు కాడు.

తరువాత స్వప్న, ప్రతిజ్ఞ నాటకాలలోని యౌగంధరాయణపాత్రసృష్టి అతులనీయమైనది. ఈయన తన రాజుమేలుకోసం సన్యాసి అవుతాడు ఉన్మత్తుడవుతాడు, బందీ అవుతాడు. శత్రువులు చేసిన హింసకు ప్రతిహింస, కుయుక్తికి ప్రతీకారం చేయనిదే నిద్రపోడు. ఈపాత్రలోని విశిష్టతకు మోజుపడి తెలుగులో ప్రతాపరుద్రీయనాటకం పుట్టింది.

ఈయన స్త్రీపాత్రలు వాసవదత్త, పద్మావతి, సీత, కురంగి మొదలైనవారి భౌతికశరీరలావణ్యం మనకు కనపడదు. మానసికసౌందర్యము, సుగుణసంపత్తి, స్నేహశీలతా వారిలో గోచరమై, కవిభావనలోని స్త్రీమూర్తి స్వచ్ఛత స్ఫురిస్తుంది. తుదకు రాక్షస స్త్రీ హిడింబహృదయంలోకూడా ఈమహాకవి ప్రణయమాధుర్యం నింపి స్త్రీఔన్నత్యం ప్రకటించాడు. ఈ ప్రసక్తిలో తరువాత చెప్పదగినది శూద్రకకవీంద్రుని మృచ్ఛకటికం. ఇంతటి ప్రతిభోజ్జ్వలమైన నాటకానికి కూడా భాసుని చారుదత్తం రేఖామాత్రంగా మూలకారణమైనది.

దాతృత్వంతో దారిద్ర్యం కొనుక్కొని తృప్తిగా అనుభవిస్తూ తన హృదయౌన్నత్యాన్ని, రసజ్ఞతను, కళాప్రియత్వమునూ ఏమాత్రం జారనీయని ఉజ్జయినీ సామాన్యపౌరుడు చారుదత్తుడు నాయకుడు. పంకిలజాతి నుంచి పద్మంగా వికసించి "గుణాః ఖల్వనురాగస్య కారణం; న పునర్బలాత్కారః" అనే ప్రేమపరమార్థాన్ని నిర్వచించే వేశ్య వసంతసేన నాయిక. ఇట్టి వింతపాత్రలతో నాటకం ప్రారంభించి ఆనాటి అరాజకపరిస్థితులను, రాజుల స్త్రీలోలత్వం కారణంగా అధికారం సంపాదించి అంతులేని ప్రజాపీడన చేసే శకారులను చిత్రించి...ఇట్టి రాజ్యవ్యవస్థ ప్రజావిప్లవాని కెట్లా దారితీస్తుందో కవి స్ఫుటంగా నిరూపించాడు.

దొంగలను, జూదగాళ్లను సందేహించకుండా స్వీకరించి చారుదత్త వసంతసేనల ఔదార్యంతో వారిని శాశ్వతం చేసి ఉన్నతపరచి, భావిప్రజావిప్లవానికి ప్రముఖపాత్రలను చేశా డీకవి.

తా నెదురుచూచిన ప్రేయసికి బదులుగా సంకెలతో తటస్థపడిన ఆర్యకుని "అపి ప్రాణా నహం జహ్యాం; నతు త్వాం శరణాగతమ్" అనే దృఢసంకల్పంతో రక్షించి తుదకు ఉరికంబ మెక్కిన చారుదత్తుడూ, బండి మార్పిడివల్ల తలవనితలంపుగా దుష్టశకారుని చేతిలోపడి "యత్నేన సేవితవ్యః పురుషః కులశీలవాన్ దరిద్రోఽపి" అని తన శుద్ధశీలాన్ని ప్రకటించి శకారుని చేతిలో హింసించబడ్డ వసంతసేనా సంస్కృతనాటకచరిత్రలో ఉజ్జ్వలతారలుగా కనిపిస్తారు.

శకారునివంటి పాత్రసృష్టి సంస్కృతనాటకప్రపంచంలో ఇంకెక్కడా కనపడదు. మూర్ఖునికి చేబడిన అధికారం సాధుజనహింసాపరంపరలకేగాక తుదకు రాజ్యపతనానికికూడా ఎట్లా ముఖ్యకారణం అవుతుందో నిరూపిస్తూ ఈపాత్రచేత కవి సాధించిన హాస్యరససిద్ధి అనన్యసాధారణం.

భాసుడు చెప్పినట్టు ఈనాటకం కాలసంవాదియైన 'నాటి' ఉత్తమసాంఘికనాటకం అని చెప్పవచ్చు.

ముద్రారాక్షసం ఇంకో గొప్పనాటకం. నిరాఘాటంగా ప్రసరించే చాణక్యుని మేధాశక్తి, దృఢంగా స్వచ్ఛంగా ఎదురువచ్చే రాక్షసుని అపారరాజభక్తి, రెండూ వేగవంతములైన భిన్నప్రవాహాలుగా ఒండొంటికి కొట్టుకొని రేపిన కల్లోలాల గంభీరదృశ్యం ఇందులో చూడదగ్గది.

ఇద్దరూ స్వార్థమెరుగని స్వామిభక్తులు. చాణక్యుని అమోఘతంత్రావాపాలలో రాక్షసనీతి జర్జరితమై నిస్సహాయంగా నిలిచి, తుదకు ప్రాణమిత్రుడు చందన

దాసు ప్రాణరక్షణకోసం చంద్రగుప్తునివద్ద మంత్రి పదవి స్వీకరిస్తుంది. సర్వతోముఖమైన చాణక్యుని బుద్ధిశక్తి మనవల్ల ఎంత మెప్పు సంపాదించినా, రాక్షసుడూ, చందనదాసూ ఒండొరులకోసం చేసిన అపూర్వత్యాగాలు చూడగా వారి శీలౌన్నత్యానికి ముగ్ధుల మవుతాము. స్త్రీపాత్ర లేకుండా ఇంత నాట్యకళాబంధురంగా నడచిన నాటకాలు తర్వాత సంస్కృతంలో పుట్టలేదంటే అతిశయోక్తి కాదు.

కొన్ని నాటకాలు చదివి ముగించగానే శరీరం పులకరించే సుందరదృశ్యాలు, స్పష్టంగా వినబడే కవితాగానం మనస్సుమీద ముద్రలు వేస్తాయిగాని, అందులోని పాత్రలు, ఘటనలు మనస్సును ఆకట్టవు. వానిలోనూ చక్కని పాత్రసృష్టి, మంచిఘటనలూ ఉండవచ్చు. కాని అన్నిటినీ కప్పే తుషారయవనిక వంటి కవిత వాటి స్ఫుటరూపాలను కనపడనీయదు.

అట్టివానిని రసనాటకా లంటున్నాను. కాళిదాసమహాకవి శాకుంతలంలో దారుణజీవనసమస్యలు గాని, గరిష్ఠత్యాగదీక్షలుగాని, అపూర్వపాత్రసృష్టి గాని ప్రముఖంగా కనిపించవు. జర్మనుమహాకవి గెథే అన్నట్టు అది ఒక స్వర్గమర్త్యలోకాల తీయని ముడి.

రవీంద్రు డన్నట్లు అది ఒక శ్రుతిసుఖమైన కల్యాణగానం. శాకుంతలం అనగానే పుష్పసౌరభాలు, స్త్రీలావణ్యాలు, వీటిలాంటి కవితాగానం జ్ఞాపకం వస్తాయిగాని, మృచ్ఛకటికంవంటి ఘటనాసౌందర్యం గాని, ముద్రారాక్షసంవంటి విషమజీవనసమస్యలుగాని ఎదుటకువచ్చి నిలువవు. తక్కిన మాళవికవిక్రమోర్వశీయాలుకూడా ఇవే లక్షణాలు గల సుందరభావ స్వప్నాలుగాని స్ఫుటతరజీవనచిత్రాలు కావు.

భవభూతికవీంద్రుని ఉత్తరరామచరిత్రలో సీతారాములు మానవమూర్తులు కారు. వారు దివ్యలోకాల్లో విహరించే దేవీదేవులు. ఆ సీతకు క్షత్రియాభిమానం గాని, ప్రతీకారవాసనగాని లేదు. పతిదర్శనంతో కరిగిపోయే చంద్రశిల ఆమె. ప్రజలకోసం ప్రేయసిని విడచి అడవికి వచ్చి కట్టతెగినట్టు ప్రియురాలికోసం విలపించే మధురహృదయుడు ఆరాముడు.

ఇందలి జనక, కౌసల్య, అరుంధతిపాత్రలను కరుణరసపరిప్లవనంకోసం కవి నేర్పుగా ఉపయోగించాడు. రసబంధురములైన ఇందలిపద్యాలు అన్నిటికన్నా ముందుగా పాఠకుణ్ణి ఆకర్షిస్తాయి.

ఈయన తక్కిన మాలతి, మహావీరనాటకాల్లో సైతం భావగరిమ, పాండిత్యస్ఫూర్తులే ప్రత్యేకశక్తితో కనబడతాయి.

రత్నావళి ఒక వసంతసంధ్య. ఒక రాగకళ. ఒక సుందరీప్రణయస్మితం. అంతకన్న అది మన కిచ్చే సందేశం లేదు.

కొందరు రచయితలు నాటకాన్ని తమ భాషా శిల్పశక్తులు చూపే రంగస్థలంగా, అవగాహనకాని గహనవిషయాలను సులువుగా తీసుకువెళ్లే వాహనంగా ఉపయోగించారు. వాటిని ప్రయోజననాటకాలనవచ్చు.

మురారికవి అనర్ఘరాఘవంలో అన్నిటికంటె ముందు అతని భాషాప్రాభవం, ఉక్తిచాతుర్యం మనకు ప్రత్యక్షమవుతాయి. "గోకర్ణతర్ణకోయం తర్ణోత్క్యప కంఠకచ్ఛేషు" వంటి కవితమీద ఆయన కున్న అభిమానం నాటకత్వంమీదకు అంతగా ప్రసరించలేదు.

కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయం అద్వైతమత బోధకు ఆటపట్టై తన ప్రయోజనాన్ని చక్కగా నిర్వహించింది. అంతే.

ఇట్లా విశాలపారావారంవంటి సంస్కృతసాహిత్యంలో నాటకశాఖ బహుముఖాలుగా విస్తరిల్లింది. కొందరు నాటకాన్ని అచ్చపు జీవితంగా భావించి అపురూపమైన పాత్రలు సృష్టించి ప్రఖ్యాతి వహించారు. కొందరు అమరభావనాలోకంలో స్వర్గసీమలు కల్పించి శ్రావ్యమైన గానంగా తమ రచనలను నడిపారు. మరికొందరు భాషాభావశిల్పాలతో, బంధుర సంభావణలతో ఒక వింత చమత్కృతి నాశ్రయించి తమ రచనలు సాగించారు. ఈ సువిశాలవాఙ్మయం ఎన్ని తీరులనైనా దిద్దుకొని నాటికి నేటికి వాడని లావణ్యంతో విలసిల్లుతూనే ఉంది.

అయితే—

నాటకాన్ని నాటకంగామాత్రమే చూడవలసి వస్తే—తమ అద్వితీయపాత్రసృష్టిలో, నిరుపమాన ఘటనాచాతుర్యంలో భాసమహాకవిఅన్ని నాటకాలూ, మృచ్ఛకటిక ముద్రారాక్షసాలూ అగ్రపీఠం వహించకుండా ఉండవు.



# వీనుమిగిలిన కవి - కథకుడు



శ్రీ చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదు

దాదాపు పదిపండ్రెండు సంవత్సరములకు పూర్వపు మాట;—విజయవాడలో దేశోద్ధారకుని దివ్యభవనము దుర్గావిలాసమునందు నవ్యసాహిత్యపరిషత్తువారి సమావేశము జరుగుచున్న సమయము అది. అది చలికాలము. ఉదయమే స్నానమొనరించి, ఇంకను వదలిపోవని వణకుతో సభాంగణము ప్రవేశించి, యొకచో సుపవిష్టుడనైతిని. ఎవరో కావ్యపఠనము గావించుచున్నారు. నవ్యాంధ్రకవులను గాంచు నుత్కంఠతో నా కనులు నాల్గువైపుల వెదకుచునే యున్నవి—సభావేదికకు కొన్ని గజముల దూరములో నొంటరిగా నొకరు కూర్చుండియున్నట్లు జూచితిని. కొంచెము పాలిపోయియున్న ముఖముతో, దీర్ఘాలోచన మొనరించుచున్న కనులతో నున్న యావ్యక్తి మిగుల శక్తియుతుడే నని తలంచితిని. అసాధారణమైన గౌరవభావమొకటి నా కావ్యక్తిపై కలిగినది. ప్రక్కనే యున్నవారి నొకరిని పిలిచి 'అమూల నొంటరిగా కూర్చుండియున్నవా రెవారని ప్రశ్నించితిని; సకలాంధ్రవాఙ్మయమహాసముద్రము నాపోసనబట్టిన యుగస్రష్టయగు వేలూరి శివరామశాస్త్రిగారని తెలిసికొంటిని; వెంటనే సమీపించి నమస్కరించితిని. నా కదియే వారి తొలిదర్శనము; నేటివరకదియే తుదిదర్శనము.

కళావధానములతో తెలుగుమాగాణము ప్రతిధ్వనించుచున్న దినములలో, ప్రత్యేకముగ నొక కళావధానసందర్భమున, గురువులగు శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల కవితరకుల్యమగు ప్రతిష్ఠను తమ ప్రతిభావిశేషముచే శ్రీ శివరామశాస్త్రిగారు సముపార్చి రని పెద్దలు చెప్పుకొనుచుండగా వినియుంటిని. తరువాత వారి కథలను 'భారతి' యందు జూచు భాగ్యము కలిగినది. కథావస్తువుతోపాటు కథాగమనమునందు, భావమునందు ఒక ప్రత్యేకతను వారు ప్రదర్శించియున్నారు. చిన్న చిన్న వాక్యములతో పెద్ద సమస్యలను పాఠకునకు సులభముగా తెలియునట్లు చక్కని కథానికలను వెలయించుటలో శ్రీ శాస్త్రిగా రందెవేసిన చేయి. ఇందరు కథకులలో నే డిట్టి చెప్పగల వారు మఱియొకరుమాత్రమే తెలుగునాట గలరు.

శ్రీ శాస్త్రిగారి పద్యరచనములను చదువు భాగ్యము నా కింతకు పూర్వము కలుగలేదు. కొలది మాసములక్రింద నొక స్నేహితునికడ 'కథలు-గాథలు' అను పేరి గ్రంథమును జూచి, చదివి, యానందించితిని. ఆ యానందమును, శాస్త్రిగారి యితర పద్యవ్యాసములలో కొన్నిటిని ఆధారపరచుకొని చేసే యత్నమునకు సాహసించితిని.

పరిచయ మెన్నడును లేకున్నను, ఒక కవి వెలుగవలయు ననిన అతని గ్రంథము నొకదానిని సమగ్ర

ముగ, సవిమర్శకముగ చదివిన చాలును; అద్దమునందు నీడవలె గ్రంథమునందు కవియొక్క స్వభావసంపత్తి కరతలామలకముగ గానుపించును. స్వతంత్రుడు, సమర్థుడు నగు కవి తన వ్యక్తిత్వమును, ఒకరి కాగ్రహము వచ్చునని గాని, లేక లోకము హర్షింపదని గాని, బెదరి మరుగుపరుపజాలడు. పొదయం దాకులమాటున నుండి, తన్ను లోకులు కనుగొందురని, మల్లె వికసించియు తన సౌరభమును గుబాళింపక దాచుకొనునా? అదిదాచుకొనదలచినను సౌరభము దాగునా! ప్రకృతియం దా మల్లె జన్మించినది లోకుల నలరించుటకు; సమర్థుడను కవి జన్మించినది తన యానందమును, ప్రవిమలాశయములను లోకుల కెఱుకపరచుటకు, హీనులొగ్గినవారిని విజ్ఞానవంతులను జేయుటకే. లోక మాఘ్రాణించినను లేకున్నను, మల్లె సౌరభమునే వెలార్చును. లోకము చెవిని పెట్టినను, పెట్టకున్నను కవి గానమొనరించుచునేయుండును. ఇవి సహజగుణములు; దైవదత్తములగుట నమూల్యములు.

శ్రీ శివరామశాస్త్రిగారు స్వతంత్రులు. వారెవరిని కృతికర్తగా నిర్ణయించుకొనలేదు. వారి జీవితవిశేషములను నాకు తెలుపవలసినదిగా, వారిని లేఖాముఖమున నేను సవినయముగ కోరియుంటిని. ఉదాహరింపనర్హమైన విషయములు తమ జీవితమున నేవియు లేవని వారు నాకు ప్రత్యుత్తర మిచ్చిరి. ఇక, వారిని తెలిసికొనుటకు, వారి రచనములను చదువ నారంభించితిని. కొన్ని నియమముల కనుకూలముగ తమ జీవితమును వారు గడుపుకొనుచున్నట్లు నేను కనుగొంటిని:

'కొండ నాతండ్రి, తోట నా కూర్చు తల్లి,
యడవి మిత్రంబు, వాగు పిన్నమ్మ, చెఱువు
వానిచెల్లెలు, నావ నా వాహనంబు,
జల్ల దేకాంతమో శంకరంగసఖుడు.'

అని యొకచో శ్రీశాస్త్రిగారు తమ యాపేక్షకములనెఱుకపరచిరి. ధనగర్వమున కన్నుమిన్నెఱుగక, కేవలము ధనముకొరకై మానాభిమానముల మంటగలిపి, అనురాగము, ప్రేమ దూరము కాగా, కపటనాటకములతో కాలము గడపు మానవసంఘమునకు సత్కవి దూరముగాక దగ్గరవా డెట్లు కాగలడు! ప్రకృతియే యాతనికి పరమమిత్రము, ఆప్తబంధువు.

జ్ఞానిగా, గొప్ప స్వభాషాభిమానిగా, శాంతిదూతగా, నిరాడంబర - నిష్కల్మషహృదయులుగా శ్రీ శాస్త్రిగారు, నాకు వారి గ్రంథములయందు దర్శనమొసంగిరి.

'నీదు మాతృభాష నిఖిలపుష్పరసమ్ము-
చేత దేనెపెరను జేయుమయ్య !'

అని సోదరాంధ్రులను వారు హెచ్చరించుచున్నారు.

'తనదు బాస కన్నతల్లి యెవ్వానికి
సత్య మన్యభాష సవతితల్లి
తనదు ధర్మమందు తాను మ్రగ్గుట లగ్గు
అన్యధర్మ మది భయావహంబు.'

అని, స్వధర్మనిర్వహణమును విస్మరించుచున్న తెలుగువారికి తెలియజెప్పుచున్నారు.

మానవుని హృదయము చాల మారిపోయినది. ఈ యంత్రయుగమున మానవునియందు కుతంత్రము బలిసిపోయినది. అనురాగచ్ఛాయ లంతరించి, అసహనము పెనురోగము మానవునియందు ప్రజ్వలించినది. యంత్రముల సాహచర్యమున మానవుని కోమలహృదయమే యినుపముద్దయైపోయినది. సత్యము, శాంతి, కరుణ దహించుకొనిపోగా, కీర్తిధనమును, విజ్ఞానధనమును, మానధనమును, దండధనమైన ధనమునకై మానవుడు ధారవోయుచున్నాడు. శాంతిదూత యను మహాత్మున కందులకే తుదిని కలుషహస్తుండును కాల్చిపెట్టినాడు! యంత్రసహాయమున పంచభూతములతో నాడిక బొనరించుకొనుచు, ఈ నాగరకయుగమున, జగన్నాయకు డింకెచ్చట నున్నాడని మానవుడు ప్రశ్నించుచున్నాడు! మతముపేరున నొకరి నొకరు చంపుకొనుచు, యుద్ధముపేరున విషవాయువులను, భయంకర మగురోగములను గల్గించుక్రిములను ప్రజలపై, పంటపొలములపై, జలాశయములపై చల్లి, మారణహోమమును గావించుచున్న ఈ (య)నాగరకయుగమున, ఈ యంత్రముల మ్రోతలో, ఈ యసహనజ్వాలలో ధూతధూమపటలియం దెచ్చటనుండియో ఎలుగెత్తి—

...జగమ్ము సర్వ మేమిటి యేమిటి ?
యేమి యీజగం బిట్లె సెల్లె !
ఎవ్వరేని యిందు నెఱిగినవా రున్న
జె_త్తిగించి నాకు జెప్పరన్న.'

అని జిజ్ఞాసు వగు కవి, వినయ మేపార, అడుగు చునే యున్నాడు. శాంతిసామ్రాజ్యసంస్థాపనా నిష్ఠాతుడగు మహాత్మునితో పాటు కవిచంద్రుడగు రవీంద్రుడును, అన్యసాంప్రదాయవ్యామోహమున మునిగి యున్న భారతీయులకు 'గీతాంజలి'తో శాంతిసందేశ మును వినిపించినాడు.

నవ్యాంధ్రవాఙ్మయమున నిట్టి సందేశమును విని పించిన కొలదిమందికవులలో శ్రీ శివరామశాస్త్రి గారికి అగ్రతాంబూల మివ్వకతప్పదు. రవీంద్రుని రచన ములను కొన్నింటిని వీ రనువదించిరి. అనువదింపవలయు ననెడి కోరిక కలుగుటయే రవీంద్రుని కోమలహృదయ మునకును, వీరికిని గల సన్నిహితసంబంధమును విశదము చేయు చున్నది. ఇది జన్మాంతరసంబంధము కావచ్చును !

కావ్యమునందు నవరసములను కవి పోషింప వలయు నందురు. కాని యొక్కొక్క కవి యొక్కొక్క రసపోషణమునందు మిన్న యనిపించు కొనును. కథాగమనమునందు కవియొక్క సహజస్వభావ మున కనుకూలమగు రసవిశదీకరణఘట్టము వచ్చినపుడు వాని కెలుకలేకయే మహోన్నతములగు భావములు, మనోహరములగు శబ్దములు ప్రదర్శితము లగుట జూచు చున్నాము. తిక్కన భాగవతమును, పోతన భారత మును వ్రాసియుండిన నెట్లుండెడిది ? వా రేల వ్రాయ వలసివచ్చును ! అభిరుచి కనుకూలముగ వ్రాసిన గ్రంథ మునకును, ఒరుల నలరింప వ్రాసిన కావ్యమునకును అంతర మెంతయేని గలదు. భాగవత, భారతముల ననువ దించి కలకాలము తమపేరు లోకమున నిలుపుకొనుటకే పోతన, తిక్కన లుద్భవించిరి. వారు కారణజన్ములు, చిరంజీవులు.

శ్రీశివరామశాస్త్రిగారి ప్రతివ్యాసము, ప్రతి కథ, ప్రతికావ్యము ఏదో యొక యద్వితీయసందేశ మునే యొసంగుచు, వారి ప్రశాంత, నిరాడంబరజీవిత మును విశదపరచుచున్నవి. వీరి పద్యగమనము గంగా ప్రవాహసదృశము. కఠినశబ్దములను కన్నెత్తిచూడకయే వీరు, ఎల్లర కందుబాటులో నుండునట్లు చక్కని కథ లను పద్యరూపమున ఆంధ్రాభిరాష్యలోకమునకు సమ ర్పించి యున్నారు. హృద్యములగు పద్యములతో కథల నిట్లు వెలయించినవారియందును శ్రీశాస్త్రిగారి కొక ప్రత్యేకత కలదు.

పాత్రపోషణము, రసపోషణము, వస్తుశిల్ప ప్రదర్శనము, ఒక కావ్యమునకుగాని కథకుగాని, నాటకమునకుగాని అత్యావశ్యకములు ; వీటికన్నింటికిని మూలాధారమైన శబ్దములు వీనులకు విందుగూర్ప కున్నచో నాగ్రంథము నిరర్థకము. కఠినములగు శబ్ద ములతో తెలుగుగ్రంథమును సంస్కృతపదజటిల మొన రించుట 'గూఢశబ్దనిరతి కొట్లాట తిట్లాట, యాగచెవిటి వారి ముచ్చటకయ' అను అపహాస్యమునకు గురికావ లసి వచ్చుటయేకదా ! పద్యమునందు తూకమునకు 'పడి కట్టు' శబ్దములను ప్రయోగించి, భావమును బలహీన పరచుట శబ్దసంపద లేని కవికి లక్షణము. పద్యమును ప్రారంభించునపుడో, పద్యమును ముగించునపుడో, లేదా ప్రాసమునందో, ఇట్టి నిరర్థకశబ్దములు కొన వచ్చు టాచారమైనది. కాని—

'చల్లనివేళ సక్కవిని
కాలమునంబునయందు బుట్టి సం
ఫుల్లత నొందుహల్లకము
పోల్కి నొకళ్ల మొకళ్ల మెరాలిమై
వల్లన మేమువిచ్చుచునె
యర్థముతోడ రసంబునందులకా
మెల్లగరంగిపోయెదము
మేలని మెచ్చెద రస్య పండితుల్.'

అని 'పదముల' స్వభావమును గుర్తించి, కీర్తిం చిన శ్రీశాస్త్రిగారివంటి కవికి వ్యర్థపదములతో పని యేమి? వీరి రచనములందు 'క్రొత్తపాతల మేలుకల యిక' నాకు గోచరించుచున్నది. వీరు ప్రాచీనులలో ప్రాచీనులు, నవీనులలో నవీనులుగా గానుపించు చున్నారు.

దేవళమునందే భగవంతు డున్నా డనియు, 'ఆచారవ్యవహారములు' క్రమముగా నున్నచో హృదయ మెట్లున్నను భగవంతు డామోదించుననియు, ఎన్ని మతము లున్నవో అందరు భగవంతు లున్నా రనియు, ధనికుని రత్నాభరణములకే భగవంతు డలరును గాని దరిద్రుని దిక్కు కన్నెత్తియైన తిలకింప డనియు, బీదలకు ధన మెంత దూరమో, భగవంతుడును అంతే దూరమనియు తలంచువారలకు శ్రీ శాస్త్రిగారు తేలిక పదములతో వినుట కుత్సాహమును గూర్చు చక్కని కథలను పద్యరూపమున వినిపించియున్నారు; పైన వివరించిన యభిప్రాయము లెంత సత్యదూరములో సోదాహరణముగ నిరూపించియున్నారు.

మధురానగరమునందలి దేవాలయముముందర కొకవాడు :

'మాల యొక్కండు శివభక్తిమండితుండు
గుడిప్రహరిగోడ కెంతయు నెడముగాగ
ద్వారమున కట్టెదుట నిల్చి ధ్యానముద్ర
నొందు గైకొని యపరరుద్రుం డనంగ.'

దేవాలయములోనికి బోవుచున్న పూజారివానిని గాంచి :

'రెండేండ్లు తపముసేయుము
చండాలా! ఖండపరశుసన్నిధిలో నీ
వుండు ప్రవేశ మను చు
ద్దండుడు పూజారి దారి తలుచు జనియెన్.'

మాల యా ప్రదేశము వదలి వెంటనే వెడలిపోయెను. రెండేండ్లు గడచినతరువాత మరల నాతడు దేవాలయముదాపున కానరాగా, పూజారి, 'నీ వీదేవసాన్నిధ్యమున్ గోరక వచ్చితివే? యని ప్రశ్నించెను. అందులకా మాలడు :

'అప్పుడు నా కా కోరిక
తప్పక తానున్నమాట తథ్యము కానీ
యిప్పుడు నా కా కోరిక
చప్పగ నశియించె నయ్య సాదాక్షిణ్యా!'

అని బదులుచెప్పి, భగవంతుని గనుటకు దేవాలయప్రవేశమే దారి కాదని వ్యక్తపరచెను.

చెలువునీటికై పోయిన యిరువురు నవయం దొకతె :

'చెలియల! నీ విన్నిమాటలు
కలిసితివే యింతవఱకు కాంతునితోడం
గలరూపు చెప్పుమని యొక
వెలదుక యత్యాశ మఱొక్క వెలదుక నడిగెన్.'

ఆప్రశ్నకు ప్రత్యుత్తరముగా :

'ఖాతాపొత్త మొకండు పట్టి యిది లె
క్కల్ వ్రాయ వేహారమా
చేతోనాథుని పేరు నా మనసులో
జేకొన్న యల్లంతనే
నా తల్లీ! విను! నన్ను జేసె సుఖతన్
నా కెట్లు సిద్ధించు నా
ఖాతా వ్రాయుగ నంచు వేఱొకతె న
క్కాణించెను భ్రాంతయై.'

ఈయిరువురి సంభాషణమును విన్న యొక ముసలిసన్యాసి. అతడు భగవంతుని నామమును 'ఇన్ని కోట్లు జపియించితి' నంచును లెక్క వేసి సంఖ్యాగణనాతిగర్వమున నున్నాడు. ఆనా డానవోఢల సంభాషణమును పొంగోపొంగుగా విన్నంతనే ఆ సన్యాసి '......గేలం గీలించుచు త్రిప్పుచున్న జపమాలం దీసి సన్న్యాసి తా- గంగాగర్భమునందు వైచుచు ననింకన్ నేను సన్యాసినా? శృంగారాంగులు నాకు నొజ్జ' లనుచున్ జేమోడ్చె నవ్వారికిన్!' నామ మంత్రమును నిర్ణయించుట, లెక్కించుట యందు గల శ్రద్ధ భగవంతునియందే పాదుకొల్పినచో; ప్రేమమీర భర్తను స్మరించిన యువతివలె, భగవంతుని స్మరించిన భక్తుడును తన్మయత్వమున తన్నుదా మరువ కెట్లుండును? అను నీలమువంటి నీతిని ఈచిన్నకథ బోధించుచున్నది.

సూర్యు డుదయించుచున్నాడు; బుద్ధునికొఱకు భిక్షమును గోరి వచ్చిన అనాథపిండదు డను శిష్యుని కేక గ్రామమంతయు ప్రతిధ్వనించుచున్నది.

'కొందఱు కంఠహారములు
కొందరు పెండలమానికంబులన్

కొందఱు నూత్న రత్నములు
కొందరు చీన్ జలతారుచీరలన్
కొందఱు వెండివాసెనలు
కొందరు బంగరుటుంగరంబులన్
పందలు వేలుగా విసరి
వైచిరి భిక్షుకు కాలిముంగలన్.'

కాని యాతడు వానిని గ్రహియింపలేదు.

'క్షితీశ్వరులకు రసతండు,
బుద్ధదేవు డతని కిడుడు
మీర లన్నింటికంటెను
నెక్కుడైన దాన మెదియొ దాని.'

అని యడుగుచు బోవుచున్నాడు. గ్రామము వెలుపలకు బోవుచుండగా :

'పూటికి జింపెగుడ్డకును
గూడ గొఱంబడి భూశయానయై
బోటి యొకర్తు లేచుచు నె
మ్రొక్కి బిరాన దొలంగబాఱి, పాం
ద్రాటవియే కడింది తెర
యైచనగా, దన మీది పుట్ట మూ
చాటకు నూటిగా విసరి
వైచెను, భిక్షుకు కాళ్ల డెంబడన్.'

వెంటనే యనాథపిండదుడు—

'...చేతులెత్తి దరహాసములో
జయపెట్టి ధన్య వో
మాతరో నీకు దీవనలు
మా ప్రభుకోరిక తీర్చి తెంచు నా
ప్రాతపటంబునన్ శిరము
పైగొని బుద్ధపదంబులందు సం
ప్రీతిని దాని గాన్కయొన
రింపగబోయెదు బుకంబు పీడుచున్.'

భక్తునికడనుండి పరాత్పరుడు కోరునది రత్నములు, బంగారము కాదు. ప్రేమార్ద్రమైన హృదయము మాత్రమే. ఆడంబరసహితమైన యారాధనము, ధనగర్వసహితమైన జీవితము, భగవంతుని యలరింపజేర వను సత్యము నీ కథలు సువ్యక్తమొనరించినవి.

అరిషడ్వర్గమునందు కామమున కగ్రస్థానమొసంగియున్నారు. అభ్రంకషమగు నుత్తమ పదము నుండి మానవుని దిగద్రోయుట కది యన్నివిధముల సమర్థమైయున్నది. లోకమును విస్మరించి యెట్టి కార్యమునైన నొనరించుట కది మానవుని పురికొల్పును. కామాతురుడై నగలన్నింటిని మూటగట్టుకొని, గృహప్రాంగణమున కరుదెంచి, తలుపుదట్టిన శంకరుని గాంచి :

'వచ్చితి వీ మొగంబునను
వాకిటిలోనికి? నీవు తొల్లి నా
కిచ్చిన బాస యేడ? నివు
డీవొనరించిన చేత యేడ? నీ
హెచ్చరికేడ? హేమలత
యీహృదయంబును గోరుకొన్నదో,
నచ్చగ నీదు తల్లిహృద
యమ్మును దేవయ లేకపోవయా.'

అని యొక వింతకోరికను వెలువరించినది హేమలత యను వారాంగన. అతని ప్రేమల పన్నీరము గుమ్మరించి 'ఇది నీయమ్మగుండెలు దెచ్చితేని పన్నీరను కొమ్ము, కానియెడ నిండుగ బొర్లిన ప్రేమదాసికన్నీరనుకొమ్మని నిష్ఠురములాడినది.

కామాంధుడు శంకరుడు; వెంటనే గృహమున కేగి తల్లిని సంహరించి, గుండియలు గోసికొని, ప్రియురాలిని సంతసపరచి, పరిష్వంగసుఖము ననుభవింప, వాయుజవముతో వచ్చుచున్నాడు; వాకిటిలోని కడుగుపెట్టినాడు. ముందున్న నీటిమడుగునైన జూచుట లేదు. మిగుల రయమున నడచుచున్నాడు...

'అంత వేగం గుమారు కేల్
జాఱి వెలంగు గుండియలు
త్రుళ్లుచు నిట్లనె,
నీళ్లు నీ బ్రోగిం
బోయితి వేని జాఱిపడి
పోదువు మెల్లగ బొమ్ము నాయనా!'

అని హెచ్చరించినదట!—కామాంధుడగు కుమారుడు, మతిమత్సరములతో నున్న వారాంగన

సంహరింపబడి, గుండియలు తీయబడినను, సమసిపోవని మాతృప్రేమ ఇందు చిత్రింపబడినది. అవ్యాజానురాగమునకును, కపటప్రేమకును గల యంతరమును జూపుచు ఈకథ రచయితయొక్క కూర్పు నేర్పును విశదపరచుచున్నది.

అసమాన మను జాడ్యమునకు గురియైన కాశీరాజు కోసలాధీశుని యున్నతిని విని, వానితో యుద్ధమొనరించి, యోడించి, యరణ్యమునకు పారద్రోలెను. అంతతో మిన్నకుండక- కోసలరాజు శిరమును దెచ్చి చూపినవానికి మూడువేల మాడల నిత్తునని ప్రకటించెను. అరణ్యమున దలదాచుకొనిన కోసలాధీశుని కొక దినమున నొక వర్తకుడు గానవచ్చి, తన యోడ సముద్రమున మునిగిపోయిన దనియు, వదాన్యుడగు కోసలాధీశుని దర్శించి తన దురవస్థ విన్నవింప బోవుచున్నాననియు తెలిపెను. తన ప్రకృతపరిస్థితి నెఱుంగక, తనకొరకు బోవుచున్న వర్తకుని యమాయకత్వమును గుర్తించి, కోసలాధిపతి వగచి, వాని కేమియు తెలుపకుండ, వానిని వెంటబెట్టుకొనిపోయి, కాశీరాజుయొక్క సభాంగణమును బ్రవేశించెను. అట్లేగి 'శ్రీ కోసలాధీశుండన్, నను బట్టినిచ్చెదు ధనం బిండ్లు చేకూరికిన్' అని కోరెను. కాశీరా జీయద్వితీయ మానవస్వభావప్రదర్శనమున కచ్చెరువుచెంది:

'చచ్చియు నన్నునన్ గెలువ
జాలని చాతురి చూపగల్గె నీ
సచ్చరితంబు, నీయశము
జాటగ బంచెద, నేటి యాజిలో
జచ్చితి నేను, క్రమ్మఱ నో
సంగితి రాజ్యము దానితో మన
స్సిచ్చితి నన్ను నేలుకొను
మీ యిక కోసలదేశనాయకా!
చినుగుపాతల వనవాసి జేర్చుకొనియె
గాశికారాజు ముత్యాలగద్దెమీద
మలినశిరమున దనచేత మకుటముంచె,
పురజనుల ధన్యవాదముల్ బోరుకలగ.'

ఈరీతిగ శ్రీ శివరామశాస్త్రిగారు, నేడపురూపమై, మానవాతీతమైపోయిన సహజమానవప్రకృతిని పాఠకుని హృదయమునకు, తిరుగ హత్తింప బ్రయత్నించిరి. గ్రంథవిస్తరభీతిచే క్లుప్తముగమాత్రము వివరింపగలిగితిని.

శ్రీశాస్త్రిగారి రచనములందు గణనీయములగు లక్షణములలో సుకుమారమును, సుమనోజ్ఞమును, సులభమును ఐన శైలియు, హృదయము నాకట్టు విషయనిర్ణయము ప్రధానములై యున్నవి. అందులకే వీరొక ప్రత్యేకతను నవీనాంధ్రవాఙ్మయమున గడించియున్నారు.

తేరలేదు (తెచ్చియుంపలేదు); మఱాకు (మఱుపకు) మొదలగు వింతశబ్దప్రయోగములను వీరు గావించియున్నారు.

'దేహాగృహప్రాకారము,' 'నోడచాటలయొక్క జన్మచాటు', 'మునుకొని మూడులోకములు మోసెద గాని, తృణార్ధమేని యుక్ మెనసి తిలార్ధమేనియును మోయగజాలను దద్వియోగముల్,' 'పెను బరు విద్ది మీ రసలె పిట్టనుమ్ముల్లు,' 'తడసి ముప్పందుమై', 'హృదంబుజముక్ ప్రుటుక్కనం గోసి,' 'సాహితీసమరాంగణసార్వభౌముడు,' 'తద్యశోఘనోటి జడలె విస్తారధాటి,' 'చిన్నయు బెద్దలే కొకరు చెప్పట యొప్పట లేక, చన్నదిక్ మన్నది లేక, రావుతులు మావతు లన్నది లేక,' 'రాత్రికిని రాత్రికిని మధ్య రాతివోలె, బగలు సృజియించు బ్రహ్మదుర్భాజనుండు.'

స్థాలీపులాకన్యాయముగ, శ్రీ శాస్త్రిగారి రచనమునందు గల సొగసులను, శబ్దసౌభాగ్యమును, కూర్పు నేర్పును విశదపరచుటకు పైనుదాహరించిన పద్యపాదములు చాలియున్నవనుకొందును.

ఆదర్శప్రాయములగు కథలను పద్యరూపమున వెలయించిన కవులలో శ్రీ శాస్త్రిగారికి ప్రథమస్థానమే కాదు, ప్రత్యేకస్థాన మున్నదని మనవిచేయుటకే యీవ్యాస మనుద్దిష్టమైనది.

# మాయావాదము - ౨

## శ్రీ వేలూరి శివరామశాస్త్రి

### జ్ఞానము

కుండయు బండయు మొదలగు విషయము లన్నియు జ్ఞానముచేతనే ప్రకాశము పడయును. అనగా తెలిసికొనబడును. కనబడువస్తు వెంతవరకు జ్ఞానముచే తెలిసికొనబడదో అంతవరకది కలదని యెవరికిని నమ్మకము కలుగదు. జ్ఞానము దేనిని ప్రకాశింపజేయునో ఆ వస్తువే కలదని మన మంగీకరింతుము. జ్ఞానముచే ప్రకాశింపజేయబడని వస్తువు నెవరును కలదని యంగీకరింపరు; అంగీకరింతు రని తలంచి యుండబోదు.

వస్తువులను తెలియజేయు ఎరుక యెప్పుడు నొక్కరూపుగనే యుండును. దాని స్వరూపమున కెప్పుడును మారుపనునది యుండదు. ఎరుకకు గురియగు కుండ బండ కొండ ఉండ మొదలగునవి వేరువేరు వస్తువులయినను ఎరుకమాత్రము మాయా ప్రకాశస్వరూపమును విడిచియుండుట మన మెవరము నెరుగము. ఎరుక యనునది కుండ యను నెరుకకు గురియగు కుండకంటె వేరు వస్తువు. అటులే కొండ యను నెరుకకు గురియగు కొండకంటె వేరు. కాని యీ కుండకొండల యెరుకలలో స్వరూపగత మగు భేదము కలదని యెవరును నిరూపింపలేరు. ఎరుకకు గురియగు వస్తువు లొండొండ వేరు కానోపును గాని విషయాంశమును విడనాడిన యెడల 'అచ్చయెరుక' యనగా మన మేదని యనుకొందుమో దానిలో భేదము కలదని యెవరును తెలియలేరు, తెలుపనులేరు.

### అనువృత్తము - వ్యావృత్తము

ఈ ప్రపంచములో గల పలుతెరగుల ఎరుకలలో ఇరుతెరగులగు భేదములు భాసించుచుండును. అందొకటి అనువృత్తము; రెండవది వ్యావృత్తము. అనువృత్తము అన్ని ఎరుకలందును అనువర్తించుచునుగాన దీనిని సామాన్యమనియు నందురు. 'కుండ ఉన్నది, కొండ ఉన్నది' ఈ మొదలగు ఎరుకలన్నిటియందును ఉనికి అనువృత్తము, లేక సామాన్యము. కుండ కొండ మొదలగునవి వ్యావృత్తపదార్థములు. ఏలనగా ఒకపు డివి యుండును; ఒకపు డుండవు. కుండ ఉన్నదనినపుడు కొండ లేదు, కొండ యున్నదనినపుడు కుండ లేదు. కాగా ఇవి వ్యావృత్తపదార్థములు. వ్యావృత్తమునకే విశేషమని పేరు. కుండ ఉన్నది, కొండ ఉన్నది మొదలగు నీ జ్ఞానమునందయినను మనకు సత్తారూప మగు సామాన్యపదార్థమును భాసింపజేయని జ్ఞాన మని ఒకటి యుండదు.

ఏ విశేషవస్తువులు మన యెరుకకు గురియయినను సత్తారూపమగు సామాన్యమును విడిచి ఆ విశేషవస్తువుల ఏ విశేషరూపమును మనము బోధపరచుకొనజాలము. ఇది మన జ్ఞానమునకు స్వభావము.

ఎవరేని 'రాముడు' అని యనినచో రాముడున్నా డనియో, ఉండె ననియో, లేక ఉండగల డనియో మన మర్థముచేసికొందుము. 'ఉన్నాడు, ఉండెను, ఉండగలడు' అను నీ మూడుమాటలచే రాముని యునికికంటె వేరుగా మన మేమి యర్థము చేసికొందుము? రాముని యునికినే మన మొకపుడు వర్తమానకాలముచేతను, మరియొకపుడు భూతకాలము చేతను ఇంకొకపుడు భవిష్యత్కాలముచేతను పరిచ్ఛిన్నము చేసికొనుటమాత్రమే యిచటి విశేషము. వస్తు వేదేని యగుగాక దానియునికిని దెలిసికొనక ఏ కాలమునందయినను దానివిశేషమును తెలిసికొనలేము.

### వ్యావృత్తము మాయ

మన యెరుకకు పట్టు కుండ కొండ మొదలగున

వన్నియు విశేషములయినను సత్తారూపమగు నొక సామాన్యపదార్థముతో కలిసియే జ్ఞానగోచరము లగును. 'రాము డిచట నున్నాడు, కుండ యిచట నున్నది.' యీ మొదలగు సకలవ్యవహారములందును రాముడును ఉండుటయు, కుండయు ఉండుటయు వేరు కాని పదార్థములు. ఈరీతిగా మన యెరుకకు తోచలములగు వస్తువిశేషము లన్నియు ఉనికికంటె వేరు కావు. అనగా నభిన్నములు. ఇది మన కందరకును తెల్లమే. కుండయు ఉనికియు ఎటు లొకవస్తువో కొండయు ఉనికియు అటు లొకవస్తువుకదా. ఇటులగుచో కుండయు కొండయు ఒకేవస్తు వేల కాదు? కుండయు ఉనికికంటె వేరు కాదు, కొండయు ఉనికికంటె వేరు కాదు. ఉనికి, లేక సత్తవగా మన కొక పదార్థమే గోచరించును. కుండయు ఉనికియై కొండయు ఉనికియైనయెడల కుండ కొండకంటె వేరనుట యెటులు పొసగును? ఇదియు నొకవిధ మగు మాయ కాదా? కుండను ఉనికికంటె వేరని చెప్పజాలము. ఏల? మన మెప్పుడును 'కుండ ఉన్నది' అని అనుచున్నాము. ఇటు లనుట కర్థమేమి? 'కుండ—ఉండుట అనగా కుండయు ఉనికియు ఒండొండ వేరుకానివి.' అని కదా అర్థము. ఇటులయ్యు కుండ ఉనికికంటె వేరు కాదనియును చెప్పజాలము. ఏల? కుండ ఉనికికంటె వేరుకాదేని ఉనికికంటె వేరుకాని కొండ ఉండ మొదలగు ఇతరవస్తువులకంటె అది వేరు కానేల?

కావున ఉనికికన్న వేరనియు వేరు కాదనియు చెప్పరానిదాని నే మనవలయును? మాయ. పచ్చిమాయ. మాయ యనగా నింతకు వే రేమి కలదు?

ఇట్టి యుక్తులచే ప్రపంచమునందలి వ్యావృత్త పదార్థము లన్నియు మాయామయము లయిపోవును, ఇవి అనిర్వాచ్యములు కదా! దీనివలననే మాయావాదు లీ ప్రపంచమును మాయ యని యందురు. ఇది ఉన్నదనిగాని లేదనిగాని చెప్పనయితి కాదు.

ఎరుక - ఉనికి

వేరొకటి—దేనితో కలుపక యీ ప్రపంచములో ఏవస్తువునేని మనము తెలిసికొనజాలమో తెలుపజాలమో ఆయునికియు ఎరుకయు వేరా, లేక ఒకటియేనా?

ఎరుకతోడు లేక మన మేవస్తువును వ్యవహరింపలేము. ఇటులే ఉనికితోడుగూడ లేక ఏవస్తువును వ్యవహరింపలేము. ఉనికి సామాన్యము. అనగా అన్ని వస్తువులతో నిది అనగి పెనగి యుండును. ఎరుకయు అటులే సామాన్యము. అదియు అన్నివస్తువులతో కలసి మెలసి పోవును. ఉనికి తుదమొదళ్లు మన మెరుగము. అటులే ఎరుక మొదలుగాని తుదగాని మన మెరుగము.

'బట్టయెరుక కానిమ్ము, కుట్టయెరుక కానిమ్ము, మరి యేయెరుకయే కానిమ్ము, ఎరుకయనునది యెల్ల క్షణికము. విషయములతో ఇంద్రియములకు సంబంధము కలిగినపిదప ఎరుక పుట్టును. పుట్టినపిదప నీయెరుక ఒక క్షణమాత్ర ముండును. పరక్షణముననే నశించును' అని నైయాయికు లనును.

'ఎరుక ఎన్నటికిని క్షణికము కాదు. ఎరుకకు మొదలుగాని తుదగాని లేదు. ఎల్లపుడును ఎల్లచోటుల నిండి స్వయంప్రకాశమైయుండి ఎల్లవస్తువులను ప్రకాశింపజేయుచుండుటయే ఎరుకకు పాడి. ఎరుక యిటులు నిత్యమనుట కేమి ప్రమాణమని అడుగుదువో? నీవుగాని మరియెవరుగాని ఎరుకకు మొదలుగాని తుదగాని చూచిరా? నీవుగాని మరి యెవరుగాని ఆత్మ ప్రకాశింపకుండుట చూచియున్నారా? మనము మన శైశవమునందలి నగవులను ఏడుపులను తల్లిదండ్రుల లాలనపాలనములను బంధువుల క్రీడనతాడనములను మరతుముగాని నిన్ను నీవును నన్ను నేనును మరవలేము. ఇటులే మన యౌవనమున జరిగినయెన్నెన్నియో వింతల మరచియుందుముగాని నిన్ను నీవు మరచియుండలేదు; నన్ను నేను మరచియుండలేదు. నీవును ఇప్పు డుంటివి; నేనును ఇప్పు డుంటిని. ఎల్లయపుడును మనతో పాటుండు నది యనుకొనిన ఆ యవస్థల నన్నిటిని స్మరించుపాటి శక్తిగూడ మన కిపుడు లుప్తప్రాయమేయయినను ఆ శైశవమునుండి యీ వార్థకమువరకును మన యునికి మన కొక నిమిషమయినను తెలియక యున్నదని నీవేని నేనేని ఊహింపనేని ఊహింపలేము.

## ఎరుక - ఆత్మ

వెలుగుచువెలుగుచు నున్న దివ్వె గాలి కొరి పోవగా మరల వెలిగించినపుడు మనకు పూర్వాపర కాలముల నున్న ప్రకాశావస్థయు నడుమ నున్న అంధకారావస్థయు తెప్పగా మనసున పట్టియుండును. ఈ రీతిగా నీవు నీ శైశవావస్థనుండి యీ జరావస్థాపర్యంతము నీఆత్మదీప మారినటులుగాని ఒకవేళ ఆరకనే ఆరినచో దానిపిదప అట్టి అంధకారావస్థనుగాని ఎన్నడేని కనుగొంటివా? ఆ శైశవము మొదలుకొని యీ జరావస్థవరకును ఉన్న యింత దీర్ఘకాలములో ఎన్ని అవస్థలను నీ శరీరకార్యములకు అనుకొంటివో ఆయవస్థలన్నియు క్రమముగా మారిపోవుటతోపాటు క్రొంగ్రొత్త యవస్థలు మరల వచ్చి మీదపడగా 'ఇది నా ఆత్మలో ఆత్మ' అని నీ వెన్నియోమారు లనుకొని యీసంసారమున సాగి యిటకు చేరితివో నీకు గురుతున్నదా? పోయిన అవస్థలన్నిటిని మరచిపోయితివిపో, ఈ యవస్థలన్నిటిని చూచుచున్న నీ యాత్మను నీ వెన్నడేని మరచితివా? దీప మారినపిదప గలిగిన అంధకారావస్థవలె నీ యాత్మ కప్రకాశావస్థగాని అభావావస్థగాని సాగివచ్చుటలో తెంపులుగాని జీవితమునం దెన్నడేని కనుగొంటివా? కనుగొనియుండవు. ఇటులు కనుగొనియుండకపోగా ఈ యవస్థలన్నిటికిని సాక్షియై ప్రవహించుచు ప్రకాశించుచుండు ఆత్మ ఎల్లపుడును 'నేను నేను' అనుచు భాసించుచు ఘోషించుచునే యున్నది. దండెలో దారమువలె ఏకులో వత్తివలె అనంతములగు విశేషములలో అనుగతమగు ఉనికియై ప్రకాశించుచుండు నీ స్వరూపమును నీవు చూచుచుంటివో అదియే నీ యాత్మ. ఈ యాత్మ శరీరము కాదు. ఏలందువా? శైశవమునుండి వార్ధకమువరకు నీ శరీర మెంతయో పెరిగెను; చిక్కెను; సడలెను. కాని నీ యాత్మయో పెరుగను తరుగను లేదు. జ్ఞానమే దాని స్వరూపము. దానికి జ్ఞానమయమును ప్రకాశమయమును సత్తామయమును అగు రూపముకంటె వేరొక రూపము కనబడదు.

## నిద్ర

'కలగనినపుడుగాని మేలుకవియుండునపుడుగాని నాకు నేను సంగతి తెలియును. నిద్రమడిలో పడిపోగనే విషయము పోయెను, నేనును పోయితినాయెను; ఇక నా స్ఫురణమాట యేమి? ఈ నిద్రావస్థలో ఆత్మదీపము చల్లారెను. అహంత నశించెను. జాగ్రత్ స్వప్నములు కలుగనంతవరకును జ్ఞానప్రవాహము ఇంకిపోయెను. ఈరీతిగా దైనందినముగ దీపమారినటులు ఆత్మజ్యోతి ఆరుచుండుట నాకువలె నీకును అందరకును తెలిసినదే. స్వప్నావస్థగాని జాగ్రదవస్థగాని కలుగుటతోడనే దీపము మరల వెలిగించినటులు ఆత్మస్ఫురణము కలుగుటయు నాకువలె నీకును మరియందరకును తెలిసినదే. కావున జ్ఞానమున కుత్పత్తియు వినాశమును ప్రతిదినమును ప్రతివానికిని అనుభవములో నుండగా నీవు మాయావాద మని యొకటి తెచ్చి 'జ్ఞానమునకు ఆదియు అంతమును లేదు' అని యెటుల చెప్ప సాహసింతువు? ఆత్మయు జ్ఞానము నొక్క పదార్థ మగునేని ఆత్మకు ఆదిగాని అంతముగాని ఉండుట అసంభవము కాదు' అని నీ వనవచ్చును.

## నిద్రలో జ్ఞానము కలదు

నిద్ర పూర్తిగా జ్ఞానములేని అవస్థ కాదు. నిద్రాకాలమునందు మన కేజ్ఞానమును లేకలే దని యనుట సంగతము. 'నిద్రావస్థను నీ వెరుగుదువా యెరుగవా?' అని అడిగినచో నీ వేమని బదులాడుదువో చూతము. 'నే నేమియు నెరుగను' అని అనగలవా? ఇటు లన జాలవు. ఏలయనిన నిద్ర యనిన నేమో యెరుగని నీవు 'నిద్రలో నే నేమియు నెరుగను' అని నిద్రసంగతి తెలుపుటకు నో రెటులు మెదిలింపగలవు? నిద్రావస్థ నెరుగనివాడు నిద్రనుగూర్చి తెలుపగలుగుట సంభవించునా? కావున 'నా నిద్ర నాకు తెలియు' నని నీ వంగీకరించితీరవలయును. నిక్కముగ నెవరి నిద్రావస్థ వారికి తెలియును.

మేలుకనినతరువాత 'నిద్రలో మన కే జ్ఞానమును ఉండదు. ఏలన నిద్రలో మన కేవిషయమునుగూర్చి యయినను తెలిసియున్నయెడల జాగ్రద్దశలో ఏదో ఒకపాటి విషయస్మృతి ఉండకయుండదు' అని నీ

ననుమానింతువా ? అదియు సరి కాదు. ఏ మనిన అనుమానించునెడ అనుమేయ మగు వస్తు వేదో దాని స్వరూపము, ఏ హేతువుచే అనుమింతువో ఆ హేతువుతో అనుమేయ మగు వస్తువునకు గల విశేష సంబంధము— వెరసి యీ రెండు విషయములయు జ్ఞానము మునిముందుగా నుండవలయును. అటులు లేనినాడు మన మేవస్తువును అనుమింపజాలము. ఎటులనగా—నిప్పనగా నేమియో పొగయనగా నేమియో ఆ రెంటికిని గల విశేషసంబంధ మేమియో మున్నెరుగనివా డెవడును దవుదవుల నున్న కొండపై పొగచూచి 'ఈ కొండలో నిప్పు కలదు' అని అనుమింపలేడు. అటులే మునుపు ఆత్మయొక్క జ్ఞానము లేని అవస్థ నెన్నడును ఏ ప్రకారమునను ఎరుగనివాడు ఆత్మని జ్ఞానశూన్యమగు అవస్థ యిట్టిదని ఎట్టులును అనుమింపలేడు.

## తెలియబడునది అజ్ఞానము

సుషుప్తినుండి మేలుకాంచినవాడు 'సుఖముగా నిద్రించితినిగాని నా కేమియు తెలియదు' అని అనును. అది స్మృతి. స్మృతి యనగా పూర్వ మనుభవించిన విషయములవలన పుట్టు జ్ఞానము. స్మృతి కార్యము. అనుభవము కారణము. కార్యమునకు ముందు కారణము తప్పక యుండవలయును. కావున ఆ యనుభవము నిద్రలోనిది. అనుభవమెల్లయు జ్ఞానాత్మకము. కాన 'నిద్రలో నా కేమియు తెలియదు' అను అజ్ఞానము మనచే తెలియబడుచున్నది.

'నే నేమియు నెరుగను అను జ్ఞానములో జ్ఞానాభావము విషయమని అనగాదు. ఇచట 'నేను' అని నిత్యమయిన జ్ఞానము భాసించుచుండగా జ్ఞానాభావ మేడ? ప్రతిబంధకముచే జ్ఞానాభావము కలదందువా? మంచిది. ఆ ప్రతిబంధక మేది? అది స్వరూపమున కావరకమగు తమ స్సగు నేని ఆ తమస్సే 'నా కేమియు తెలియదు' అను అనుభవములో విషయము. కాన జ్ఞానాభావలక్షణమును భావరూపము నగు తమస్సు మనచే తెలియబడుచున్నది. ఆ తెలివి తమస్సుకంటె వేరు. కాగా జాగ్రత్స్వప్నావస్థలెటులు మనకు తెలియునో సుషుప్త్యవస్థయు అటులు తెలియును. జాగ్రత్స్వప్నముల కెవడు సాక్షియో సుషుప్తికిని అతడే సాక్షి.

## జాగ్రత్స్వప్నములకు నిద్ర కారణము

మాయామయములగు ప్రపంచరూపములు రెండు మన కనుభవసిద్ధములే. అం దొకటి కార్యము; మరియొకటి కారణము. ప్రపంచము కార్యము. ఇదియే మరికొన్ని కార్యములకు కారణము. కావున ప్రపంచము కార్యమును, కారణమును. కార్యము వ్యక్తము. కారణ మవ్యక్తము. కార్యము పలుతెరగులు. కారణ మేకాకారము. జాగ్రత్స్వప్నములు కార్యములు. నిద్ర కారణము. జాగ్రత్స్వప్నములు వ్యక్తములు. నిద్ర అవ్యక్తము. ఈ నిద్రయే మూలాజ్ఞానపు ఆవరణశక్తి. ఈ యావరణశక్తిప్రభావముచేతనే ప్రకాశమయమును ఆనందమయమును సత్తామయము నగు ఆత్మ ఆవృతమయియుండును. జాగ్రత్స్వప్నము లీ మూలాజ్ఞానపు విక్షేపశక్తి. ఈ విక్షేపశక్తిప్రభావమువలననే జాగరణరూపముగను స్వప్నరూపముగను వ్యక్తమగు నజ్ఞానము మనయెదుట ఎల్లలు లేని యీ ప్రపంచమును నిర్మించి మనలను ప్రపంచమయులనుగా జేసి విడుచుచున్నది.

అజ్ఞానము తొట్టతొలుత వస్తువు నావరించును. పిదప విక్షేపశక్తి దానిని వేరుగా జూపును. తా డని తెలియని వాడు 'తాడు లేదనిగాని 'తాడు కనబడుట లేదనిగాని తలచును. అజ్ఞానావరణ మనగా నిదియే. ఆవరించుచు ఆ యజ్ఞాన మావరించిన వస్తువును వేరొక రీతిగా ప్రకాశింపజేయును. అపు డతడు 'ఇది పాము' అని అనును. అటువలె నిటుగూడ జ్ఞానమయమగు మన యాత్మ అవిద్యచే నావరింపబడుట నిద్ర. అటుపిమ్మట ఆయా విక్షేపశక్తి వికాసములగుట జాగ్రత్స్వప్నములు. నిద్రాక్రాంతమగు ఆ యాత్మయే అనిర్వాచ్యములగు జాగ్రత్స్వప్నము లను నీ రెండవస్థలచే కట్టుబడును.

ఇది యంతయు తరచిచూడగా చైతన్యరూపమగు వస్తు వొకటియే సత్తనియు ఎల్లపుడును ప్రకా

శించుచుండుటయే దాని స్వభావ మనియు అదియే పలుదెరగు లగు మన యవస్థలకు సాక్షియనియు స్థిర మగుచున్నది. ప్రపంచమునందలి అన్ని విధములగు వ్యవహారములకును అదియే ఏకైకావలంబనము. దాని నాశ్రయించుకొనియే యెన్నియో జాగరణము లెన్నియో సుషుప్తులు! సూర్యునిచే ప్రకాశితమగు నీ యనంతాకాశమునందు మేఘమాలికలవలె ఎన్ని యెన్ని యవస్థ లెన్నియెన్ని రూపములతో ప్రకాశించుచున్నవో వాని యన్నిటిని ఎవరు లెక్క చేయ గలరు!

ప్రకాశమయమగు నీయాత్మయే యీప్రపంచ మున కేకమాత్రాధిష్ఠానము. దీని స్వరూపము తెలియుటచో అజ్ఞానము నివృత్తమగునో దానికే అజ్ఞాన మున కధిష్ఠానమని యందురు. ఆత్మనియే యజ్ఞానము ఆత్మనే యావరించును. మరియు నా యాత్మనే భిన్నరూపములతో వ్యవహారగోచరము జేయును. మరియు సమయవిశేషమున అయ్యాత్మలోనే కలిసిపోవును. ఈ యజ్ఞానమే, యీ యవిద్యయే యాత్మని క్రియాశక్తి, మరియు ఆవరణశక్తి.

ఈ యజ్ఞానమే మాయ. ఏలనగా నది యున్నదో లేదో నిరూపింపరానిది. ప్రకాశమయుడగు నా చిదాత్మునికంటె నీ మాయ వేరో వేరుకాదో తెలియ జెప్పుట కింతవరకెవ్వరికిని అంతుపట్టలేదు.

[పరిశిష్టము]



# విధి

'కౌండిన్య'

౧

గింజగ మట్టిలో మెలఁగి కించ జనింపఁగ నభ్రపంక్తికై
యంజలిఁ గూర్చి తత్కరుణ నంది జలంబులు త్రావి యుబ్బుచున్
సంజకు సంజకున్ జడిసి ఛాయలచాటున బ్రద్దలై రుచిన్
గెంజిగురాకులన్ వెలసి నేర్పునఁ గొమ్మలఁ గూడుదే విధీ!

౨

కొమ్మల మైత్రితో ముకుళకూటసుమోద్గమగంధవాహపా
త్రమ్ములఁ జేసెలానఁగల తత్త్వవిమర్శక షట్పదాళి సా
ఖ్యమ్మున కర్థమీయఁ బరమార్థపరిగ్రహణమ్ముఁ జేయ జ
న్మమ్ముల నెత్తి రూపముల నామమహత్త్వము చాటుదే విధీ!

౩

ఆశాలోలుపకోపనాపదహతివ్యాపారలక్ష్మీయశః
పాశాబద్ధ మదృష్టమంత్ర మని సంపద్వృద్ధి చేకూర్పఁగా
నీశానుండని, కేశవుండని గుణాన్వీతంబుఁ, గామేచ్ఛ నా
వేళమ్మొప్పఁగ జీవి నూపుదు విధీ! విద్వత్తుఁ బోకార్చుచున్.

౪

ఆపదవేళ నడ్డుపడి యాప్తతఁ జూపుచు జీవి వాసనా
రూపఫలానుభావ మవిరోధపథమ్మున నుంచి తద్గతిన్
తేపకుఁ దేపకుం గనుచుఁ దియ్యని చేదుఫలంబు లీయఁగా
భూపతివేషభావల నమున్నతిఁ గూర్తువు జిత్తులన్ విధీ!

౫

అమృతము నోటఁ బెట్టి యెదయందున శోకదవానలంబుచే
నమత దహింపఁ జేయఁగల శక్తివి త్వత్సమతన్ లగింపఁగా
నమరతఁ జూపుకొంచు పరమార్థవివేకముఁ గూర్తు వార్ద్రితన్
విమలచరిత్రలో వెలుఁగు విశ్వము నీవని యెన్నుదున్ విధీ!



## సంప్రదాయాలమీద ఆధునిక కవుల తిరుగుబాటు:

# కృష్ణశాస్త్రి

శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

కవిత్వముయొక్క జీవితంలో సంప్రదాయాలూ, తిరుగుబాట్లూ దివారాత్రాలు. తిరుగుబాటుతరవాత సంప్రదాయాలూ, ఆ వెనువెంటనే తిరుగుబాట్లూ వస్తాంటేనే కవిత్వం చైతన్యవంతంగా సాగిపోతుంది. సహృదయుల దృష్టిలో సమకాలికకవిత్వానికి విశేషంగా చైతన్యం వచ్చినట్లుగాని కనబడిందంటే, కొత్త సంప్రదాయ మేదేనా వచ్చేనావుండాలి; లేదా పాతసంప్రదాయము భగ్నమయ్యేనా వుండాలి. కృష్ణశాస్త్రి తన ఖండకావ్యాల్ని సభలలో వినిపించేరోజుల్లో ఏదో కొత్తదనము కవిత్వంలో ప్రవేశించినట్లు కనిపించింది. పరిశీలించగా ఆ కొత్తదనము తిరుగుబాటుయొక్క ఫలితమే అని తేలింది. అయితే ఇది కవిత్వపద్ధతులపైన తిరుగుబాటు కాదు. కవియొక్క తిరుగుబాటూ కాదు. కృష్ణశాస్త్రిగారి తిరుగుబాటు; అంతవరకూ కవివ్యక్తులు అనుసరించిన పద్ధతులపై తిరుగుబాటు. కృష్ణశాస్త్రిగారు గురజాడవలె కావ్యసామగ్రీ,—భాషా,—ఛందస్సూ,— ఆదర్శమూ మార్పుచేసిన వారూ కాదు; వఠాభివలె అద్వైతము అవలంబించినవారూ కాదు. వారివరకూ మనమెరిగిన కవులు సమకాలికసంఘపరిస్థితులను విమర్శించీ, నిరసించీ, శోధించీ మార్చ యత్నించారు. కృష్ణశాస్త్రిగారు సంఘపద్ధతుల్ని ఇదీ అదీ అని చెప్పకుండా ధిక్కొట్టేరు. ఈలాంటి సంఘానికి అతీతులైపోయి 'ఆకాశపథవిహారస్వేచ్ఛ' ని కోరుకున్నారు. బాలికల్ని వృద్ధుల కీయకుండా చేదామని గురజాడవారు పూర్ణమ్మపాట రాశారు. వరకట్నాలవల్ల జరిగే ఘోరాల్ని చూపించి మందలిద్దామని రాయప్రోలువారు 'స్నేహలతాదేవి' రాశారు. కృష్ణశాస్త్రిగారిలో చదువరులమీద దృష్టీ, అభిమానమూ గోచరించవు. కాంతాసమ్మితంగా చెప్పే ఖర్మమేమిటా అని ప్రభుసమ్మితంగానే సాగించారు. ఆదికవి అన్నాడట ఎక్కడో-"చేతులెత్తుకుని ఘోషిస్తున్నాను, ఎవ్వరూ పట్టించుకోవడములే" దని. కృష్ణశాస్త్రిగారు అంటున్నారుగదా—"ప్రళయజంఝూప్రభంజనస్వామి నేను. ఏటిపని యిది లోకమూ హృదయదళనదారుణ మహోగ్రకార్యంబు దలచినావు?" అని. ఈమాటలు వింతగా కొత్తగా వినపడతాయి. "ఇదేమి టీవ్యక్తి ఇలా గంటున్నాడు?" అనుకుంటాము. అదే ఆయనతిరుగుబాటులో విశేషము.

కృష్ణశాస్త్రిగారికి ఆత్మవిశ్వాసము 'లావు' అంటే చాలదు; 'మరీ లావు' అనాలి. పూర్వకవులుకూడా ఆత్మవిశ్వాసము ప్రక

టించినవారే. అయితే వారు 'వచియింతు వేములవాడభీమనభంగి' దగ్గరనుంచి 'గడియకునూఱుపద్దెములు గంటములేక రచింతు' దాకా తమశక్తి ఫలానా అని చెప్పుకున్నారు. శాస్త్రిగారి సవాలే వేరు. "నవ్వి పోదురుగాక నాకేటి సిగ్గు? నా యిచ్ఛయే గాక నాకేటి వెఱపు?" అంటారు ఆయన. అలాగని తమ స్వేచ్ఛతోనే ఆనందిస్తూ నడుచుకుపోరు.

"వలపుటాకలి స్రుక్కు నా బ్రతుకుమీద
ఇనుపపాదాల నిడి లోక మిపుడు నడచు"

నంటూ మనవులు చేస్తారు. మొత్తానికి వీరి పోకడలు పరిశీలిస్తే "వక్రగతి బోదు జక్కని పథమునందె" అన్నదే నిజమా అనిపిస్తుంది.

లోకానికి అతీతమైన—కాబట్టే విడ్డూరమైన— స్వేచ్ఛాభిలాషి కృష్ణశాస్త్రి గారిలో వింత. ఈరకపు స్వేచ్ఛను నే నెరిగినంతవరకూ తెలుగుకవులు ఎవరూ ప్రకటించలేదు. ఆ స్వేచ్ఛకి ఎవరు నవ్విపోయినా సిగ్గులేదు. వెఱపూ లేదు (?). 'మొయిలు దోనెలలోన బయనం బోనర్చి, మిన్నెల్లవిహరించి మెఱపునై మెఱసి, పాడుచు చిన్కు' లై పడిపోయే స్వేచ్ఛ అది. తెలిమబ్బుతెరచాటు చెలిచందమామతో సరసాలూ, శీకరంబులతోడ చిఱుమీలతోడ నాట్యమ్ములూ ఈ స్వేచ్ఛకి తృప్తి కలిగించలేదు.

"అలరుపడంతి జక్కిలిగింత పెట్టి
విరిచేడె పులకింప సరసను బండి
మరియొక్క నననతోడ మంతనం బాడి
వేరొక్క సుమకాంత వ్రీడ బోగొట్టి"

పూవుపూవునకూ పోవడమూ చాల లేదు. 'ఏలకో యెవ్వడో యెటులనోగాని మాయమైమారిపోతా' ననేవరకూ ఆ స్వేచ్ఛకి దాహము తీరలేదు.

"యుగయుగంబుల నీశ్వర యోధు లగుచు
స్వేచ్ఛకై ప్రాణసుమము లర్పించువారి
యమలజీవితఫలము ధన్యతను గాంచ
జగమునిండ స్వేచ్ఛాగానఝరుల నింప"

నుపక్రమించిన ఉత్సాహము,

"పక్షినయ్యెద జిన్ని ఋతుమయ్యెదను
అలరునయ్యెద జిగురాకు నయ్యెదను"

అని జడిపించి జడిపించి, యెట్టకేలకు మాయమై మారిపోడము వింతకాదా? ఇంతకన్నా వింత ఏమిటంటే వీ రన్నంతపనీ చేసి చూపించారు! చిత్తగించండి మనవిచేస్తాను.

మహాత్ముడు ప్రారంభించిన సహాయ నిరాకరణంతో రకరకాల స్వేచ్ఛలు తాండవమాడేయి. స్వేచ్ఛాప్రణయ మందులో ఒకటి.

"సౌరభము లేల చిమ్ము పుష్పవ్రజంబు?
చంద్రికల నేల వెదజల్లు జందమామ?
ఏల సలిలంబు పాఱు? గాడ్పేల విసరు?
ఏల నాహృదయంబు ప్రేమించు నిన్ను?"

అనే పలుకులు ఈ మతప్రచారకుల వశీకరణమంత్రాలు.

"ఏటిపని యిది లోకమా! హృదయదళన
దారుణోగ్రకార్యంబు దలచినావు
ప్రణయమధురిమ మెఱుగవు పాపమనవు
పక్షములదూల్తు బంధింతు పంజరాన."

అన్న నిందలు సమాజపరిస్థితుల వ్యతిరేకత్వానికి వీరి ఎత్తిపొడుపులు!

"హృదయవనజాతసుమ
మృదుమనోహరదళము
లదయతను ద్రుంచినారే
పెంధూళి
జిదిమి వెదజల్లినారే"

అన్న మనవులు తమ్మెరుగనివారి సానుభూతికోసము వీరు చేసే ప్రచారము!

"తేనెలం గూర్చి వలపుల తేటపరచి
ధన్యరా లయ్యె మీచెలి తలిరుబోణి
కాని నిరతంబు మల్లికకడనె యుండి
ముదముగూర్పగ మాకొక్క పూవె
[చెపుమ"

అన్నవి మోసపోయిన శకుంతలలకు వీరిసమాధానము. కృష్ణశాస్త్రిగారి వింత స్వేచ్ఛలో ఈస్వేచ్ఛాప్రణయము ప్రధాన భాగము. కృష్ణపక్షములోని 'తేటి వలపు', 'అన్వేషణము', 'ఏల ప్రేమింతును', 'దివ్య భాగ్యము', 'అయ్యో', 'లోకము', 'శాపము', 'అబ్బ!' కొద్దో గొప్పో స్వేచ్ఛాప్రణయఘుమఘుమలే కొట్టుతున్నాయి.

శాస్త్రిగారికి ఆత్మవిశ్వాసము లావన్నాను. గుడిపాటి వెంకటచలంగారిలాగ ధైర్యంగా నమ్మిన భావాల్ని ప్రచారము చెయ్యకపోయినా, కావ్యాల్లో అన్యాపదేశంగా కృష్ణశాస్త్రిగారిలాగ చెప్పడానికేనా లోకాన్ని లెక్కపెట్టని ఆత్మాభిమానముండాలి. కృష్ణశాస్త్రిగారిలో ఇలాంటి ఘట్టాల్లోనేకాక ఇతరసన్నివేశాల్లోకూడా లోకమంటే నిర్లక్ష్యమూ, నిరసనా కనపడతాయి.

"వెఱ్ఱిలోకమహృదయంపుస్వేచ్ఛనెటులు
పంజరంబున బంధింతె? పాదపమున
గూడియుండదు మెల్లప్పుడు"

అనీ,

"పక్షినని పాడగలనని ప్రణయవీథి
నిత్యలీలావిహారముల్ నెరపుదునని
పక్షముల దూల్చి బంధించి పంజరాన
గానమును బ్రాణముహరింపబూనినారు."

అనీ ఆలంకారికభాషలో లోకాన్ని కొంచెపరచీ,

"పొడుపుమలపయి బంగరుముగ్గు లుంచి
సంజమబ్బుల కుంగరాల్ సంతరించి
పోవుచున్నావు నీ వేమి పొందితోయి?
వెఱ్ఱిమిత్రుడ లోకంపు విధము గనవొ?

అని వెక్కిరించీ ఊరుకోక, యెడద వెలికి దొలగి పాఱని దుఃఖాశ్రుజలమువలన బరువైన యెడదతో కృశిస్తూ, 'ఓయి సంధ్యాసమీరణా, నీదు నునులేత ఱెక్కల మీద వడిగ నెత్తికొనిపోవరాదె నన్నెచటికేని' అని వేడుకొంటూకూడా లోకము మాట తలపుకొచ్చేసరికి—

"నన్ను గని యేరు జాలి జెందంగవలదు
ఎవ్వరని యెంతురో నన్ను"

అని నిటార్గా నిలబడి అదలిస్తున్నారు. లోకం నుంచి సానుభూతి పొందే నామర్దా ఈయన కక్కర లేదు! కాని ఎదలోపలి యెదలో నెమ్మదిలోమాత్రము లోకము తన వైపు పరుగుపరుగున రావాలని ఉన్నది! చూడండి.

"కరుణపట్టున కేలిచ్చగాని చేయి
చాచికొనినాడ మృత్యుఘోషమమ్మెమరచి
పట్టి బయలున నొక మోడు చెట్టువోలె
ఎత్తినది కర మెత్తినట్లే కృశించె!"

ఇంతకన్నా చక్కగా చూపిస్తుంది వీరి స్వాభిమానాన్ని ఈ ఊహామరణఘట్టము. చూడండి.

"ఏను మరణించుచున్నాను; ఇటు నశించు
నాకొరకు చెమ్మగిల నయనమ్ము లేదు.
..................
నా మరణశయ్య పరచుకొన్నాను నేనె
పడకనికతాలు రగులుచు దుడుకుచిచ్చు
లాలనల నింత నుసిగాగ కాలు త్రుంటినె.
..................
పడదులే ఆర్పగా నొక బాష్పమేని!"

ఎందుకు పడాలో బాష్పము? అందుకే అన్నాను కృష్ణశాస్త్రిగారు చివరికి మారిపోయారని. తొలిఘట్టాలలోని "లోకులంతా నేలమీదనడుస్తే నేను నింగిమీద నడుస్తా" ననే తత్వము చివరకు లోకపు ఇనుప పాదాల బరువుకి మూలగడము మారిపోవడము కాదా? "నాయిచ్ఛయే కాక నాకేటి వెఱపు" ప్రతిజ్ఞ చివరిదాకా నిలిచింది కాదు.

(ఇది కృష్ణశాస్త్రితిరుగుబాటుచరిత్ర. కృష్ణశాస్త్రి తిరుగుబాటుదారుమాత్రమే కాదు. 'సౌందర్యరసైకజీవి' కూడాను. ఆ చరిత్ర సావకాశంగా ఇంకొకమాఱు.)

---

# ప్రాణవీణ

(గేయం)

" అమరేంద్ర "

ఎంతతడ వీరీతి శృతిచేసె దో దేవ!
  రుతిలేక గతిలేక
  వెతజెందునా వీణ?
ఎంతతడ వీ ఘోరవహనభారము నాకు?
ఎంతతడ వీబాధ భరియింతు నో దేవ?
  వేగలేకనె కడకు
  తెగిపోవునో తార
  రాగమాధురి లేక
  ఆగలే దిక దేవ!

ఏనాటికైన నాదీనప్రాణములోన
  వెలయునా నీగాన
  విన్యాసములు దేవ?
ఏనాడు నామూగవీణ తారలలోన
  మ్రోగునో సెలయేటి కలకలములూ
  రేగునో మెలదేటి కలరవములూ
  సాగునో కోకిలాకూజితములూ?
ఏనాటికేని నాదీనవీణకు కలద
నీగానమధువుతో నిండిపోయే సుఖము
నాహాన తిమిరాన మధురప్రభాతమ్ము?

---

# విజయగర్వము

[కథానిక]

●

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి

"నంబరు ౧౭వ పేపరు ఎవరిది?"

అని హైస్కూలు హెడ్‌మాస్టరయిన గోవింద రావుగారు స్కూలుఫైనలుక్లాసుపిల్లలను అడిగాడు.

అయన యెదురుగా బల్లమీద వనజాక్షి, ఆమె తరువాత అరుగురు విద్యార్థినులూ కూర్చున్నారు. ఈబల్లవెనుక పదిబల్లలమీద విద్యార్థినలు వరుసగా కూర్చున్నారు. క్లాసు చాలా నిశ్శబ్దముగా ఉన్నది. క్రిందటివారములో జరిగిన వ్యాసరచనపోటీఫలితాలు తెలిసే దిన మది. దానిలో ప్రథములుగా వచ్చినవారికి బహుమానముగా గాంధీజీబొమ్మ చెక్కిన అరతులము బంగారుపతకము ఇస్తారు. బహూకరింపబడినవారికే కాకుండా, ఆస్కూలుకుకూడా ఎంతో ఖ్యాతి వస్తుంది. అంతటి అత్యద్భుతమైన మేధావు లెవరో - ఎవరు నోచుకున్నారో ఆ బహుమానానికీ, ఆ ఖ్యాతికీను!

హెడ్‌మాస్టరు అడిగిన ప్రశ్నకు "ఎవరిది— ఎవరిది" అనే సందేహపుప్రశ్నలు ప్రతివారికీ కలిగి, దానికి జవాబు ఎవరు ఇస్తారో—ఎవరిది ౧౭వ నెంబరు పేపరో అని విద్యార్థినులందరూ అప్పటికప్పుడే తలలు త్రిప్పి చూస్తున్నారు.

వనజాక్షి తలను త్రిప్పకుండా తన విశాలనయనాలనుమాత్రము ఇటు అటు త్రిప్పి దృక్కులు సారించింది.

"౧౭వ నంబరు గల పేపరు నాదండీ" అని ఒక సన్నని కంఠము నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ ఆగదిలో నాలుగు మూలలా విహరించింది.

దాదాపు నూటపాతికమంది విద్యార్థినులు సమావేశమయిన ఆ హాలులో ఆబాలికసన్నని కంఠధ్వని మారుమ్రోగింది.

చివరిబల్లదగ్గరనుండి తెల్లటి చీరెను ధరించిన ఒక బాలిక మందగమనముతో హెడ్‌మాస్టరును సమీపించి నమస్కరించింది.

"నీపేరేమిటమ్మా" అన్నారు ఉపాధ్యాయులు.

"నా పేరు పద్మావతి" అని అక్కడే నిలబడిపోయిందా బాలిక.

"మన స్కూలులో క్రిందటివారము జరిగిన 'యంత్రయుగము' అనే వ్యాసరచనపోటీలో ప్రథమురాలుగా పద్మావతి వచ్చింది. ఇదివరలో నిశ్చయించినట్లుగా బంగారుపతకము యివ్వటమే కాకుండా రెండు సంవత్సరములవరకు విద్యార్థివేతనము నెలకు ౨౦ రూపాయలచొప్పున ఈబాలికకు ఇవ్వవలసినదిగా మన పాఠశాలఅధ్యక్షులు సెలవిచ్చియున్నారు. ఈసందర్భములో కుమారిపద్మావతిని అభినందిస్తూ, తక్కిన విద్యార్థినులను ప్రోత్సహిస్తున్నాను" అంటూ హెడ్‌మాస్టరుగారు విద్యార్థినుల నమస్కారములను అందుకొని ఆగదినుంచి వెళ్ళిపోయినారు.

బాలికలందరూ పద్మావతిచుట్టూ చేరి "మాకు విందు ఎప్పుడు చేస్తావు పద్మావతీ? బహుమానము

సంపాదించుకొని ఇంటికి వెళ్లదామని చూస్తున్నా నేమో" అంటూ ఆ బాలికను ఊరడిసలుపకుండా చేశారు.

వనజాక్షి కూర్చున్న చోటినుండి కదలలేదు. కాని జరుగుతున్న సందడినంతా గమనిస్తూ వేచున్నది. జరిగినదానికి ఆమెకన్నులు జపాకుసుమాలయినవి. ఆమెవిశాలఫాలభాగముమీద తిలకమునకు మారుగా అంటించుకున్న టిక్లీ ధూర్జటిమూడవనేత్రమువలె మెరయజొచ్చినది. ఆ త్తరపాటువలన ఆమెజడలు రెండూ త్రుళ్ళిన త్రాచులవలె గళమునకు రెండు ప్రక్కలా కదలసాగినవి. ముఖమునకు అద్దిన పౌడరు కరుగజొచ్చినది. అరకాళ్లు చెమర్చినవి.

స్కూలువిడిచిన ఒక గంటకు బాలికలందరూ ఇళ్ళు చేరుకున్నారు.

అందరూ వెళ్లినతరువాత వనజాక్షి మెల్లగా లేచి పాఠశాలఆవరణములో తనకొరకు ఎదురుచూస్తూఉన్న కారులో కూర్చుని డ్రైవరుకొరకు హారన్ మ్రోగించింది.

* * *

పద్మావతి ఒక పేదబాలిక. గుమాస్తాజీతముతో జీవితముగడుపలేక ప్రపంచమహాయుద్ధసమయములో ఆమెతండ్రి సైన్యములో చేరిపోయినాడు. రెండు సంవత్సరాలవరకూ ఆయన పంపుతున్న పైకము చేరుతూవచ్చింది. ఆటుతరువాత ఆయననుగురించిన వివరాలు వీళ్ళకు తెలియలేదు. డబ్బు రావటముకూడా ఆగిపోయింది. తరువాత చాలాకాలానికి అతని జీతము బాపతుపైకము,బట్టలు సర్కారువారు పంపివేసినారు.

ఏకైకపుత్రికను ఆధారంగా చేసుకొని పద్మావతి తల్లి సుందరమ్మ ఆవూరు చేరింది. కూతురు పరీక్ష ప్యాసుకాగానే ఏదో ఒక ఉద్యోగములో చేర్పింప వచ్చునని ఆమె సంకల్పించింది.

పద్మావతి స్కూలునుంచి ఇంటికి రాగానే తల్లితో తన బహుమానపువార్త చెప్తూ "అమ్మా! నేను క్రిందటినెలలో విద్యార్థివేతనముకొరకు ఇచ్చిన దరఖాస్తువల్ల, నాకు నెలకు ఇరువదిరూపాయిల వేతనము ఇకనుంచి ఇస్తారట. ఈ వ్యాసరచనపోటీలో గెల్చిందినందువల్ల బంగారుపతకము ఇస్తున్నారమ్మా. ఇంక రెండేళ్ళవరకు నాచదువువిషయములో నిశ్చింతగా ఉండవచ్చును" అంటూ తల్లిపాదాలకు నమస్కరించింది.

"ఈ బాలికనూ, విద్యాభివృద్ధినీ చూచి ఆనందించే భాగ్యము తండ్రికి లేకపోయెగదా" అని ఆ మాతృదేవి కన్నులు చెమ్మగిల్లినవి.

* * * *

మధ్యాహ్నము పన్నెండుగంటల సమయము. స్కూలుపిల్లలకు విడుపువేళ.

విద్యార్థినులు భోజనాలు చేయటానికి రేకులతో షెడ్డును క్రొత్తగా వేశారు. పిల్లలందరూ టిఫిన్‌కారియర్లతో అక్కడికి చేరుకుంటున్నారు. కొంతమందికి ఇళ్లదగ్గరనుండి అప్పుడే నౌకర్లు భోజనము తెస్తున్నారు.

పద్మావతి తన వెంబడి తెచ్చుకున్న ఫలహారపు డబ్బాను చేతపట్టుకుని షెడ్డులోనికి వచ్చింది.

కొన్నిదినాలనుంచీ తోటివిద్యార్థినులెవరూ ఆమెతో సంభాషించటము లేదు. ఆమె డబ్బాతో షెడ్డులో ప్రవేశించగానే అందరూ కలిసి ఒక్క పెట్టున పెద్దగా నవ్వారు.

ఏదో ఆలోచిస్తూవస్తూఉన్న పద్మావతి, వాళ్ల నవ్వుతో, తలయెత్తి ఒకసారి వాళ్లందరినీ వీక్షించింది. తిరిగి తల వంచుకొని దీర్ఘాలోచనతో ఒక బల్ల మీద కూర్చుని జొన్నరొట్టెను తుంపుకొని తినుట ప్రారంభించింది. అవతలవారి భోజనా లయినవి కాబోలు ఆటలలోకి దిగినారు. చేతులు తుడుచుకున్న తువ్వాలును ఉండగా చుట్టి బంతి ఎగురవేసినట్లుగా ఒకరి చేతిలో నుంచి ఇంకొకరు అందుకొంటూ ఎగురవేస్తున్నారు.

పద్మావతి రొట్టె తింటున్నది. చల్లారి బిగిసిపోయిన జొన్నరొట్టెను తినటము కష్టమైన పని. ఫలహారము చేసినతరువాత విడుపుసమయములో సంగీత సాధన కావలసియున్నది. అదిగాక పరీక్షలు దగ్గరికి వచ్చినవి కాబట్టి చదువుకోవలసినది చాలా ఉన్నదనే బెదురు మనసులో ఒక పక్కన ఉన్నది.

ఇంతలో అవతల ఆటలాడుతున్న విద్యార్థినుల చేతులలోనుంచి ఉండచుట్టిన తువ్వాల వచ్చి పద్మావతిరొట్టెడబ్బామీద పడి, ఆమె తింటూతింటూఉన్న రొట్టెను మట్టిపాలు చేసి వేసినది.

తల పైకెత్తి వ్యవహారము గ్రహించిన పద్మావతి డబ్బా దులిపి మూతపెట్టుకొని అక్కడినుంచి వెళ్ళి సంగీతసాధనకొరకు అనువైన గదిలోకి వెళ్ళిపోయింది.

అరగంటతరువాత ఆమె గదిబయటికి వస్తుండెగా ప్రక్కగదిలోనుంచి స్పష్టంగా మాటలు వినిపించినవి.

"మీరు నిజమనుకున్నా సరే, అబద్ధమనుకున్నా సరే నేను చూసినది అక్షరాలా నిజము. ఆ పేపర్లన్నీ మీరు ఎవరిచేత దిద్దించినారో—వారిదగ్గరికి రెండు పూటలా పద్మావతితల్లీ, పద్మావతీ వెళ్లుతూఉండే వారు. వాళ్లు చెప్పి మార్కులను వేయించుకొన్నారు. ఈ బూటకపు వ్యవహారానికి మీరు పతకము ఇచ్చి గొప్పగా సన్మానిస్తున్నారు. కానీయండి. ఆపిల్లకు సహాయముచేయాలని మీమనసులో ఉంటే వేరొక విధముగా చేయకూడదూ" అన్న వనజాక్షిమాటలు పద్మావతిహృదయానికి ములుకులవలె తాకినవి.

వ్యాసరచనపోటీ జరిగినదగ్గరనుండి వనజాక్షి వైఖరి పద్మావతికి సందేహంగానే ఉంటున్నది. అంతకు పూర్వము మనసువిప్పి మాట్లాడకపోయినా ఇంత వైముఖ్యము లేకుండాఉండేది. తాను పట్టుచీరె కట్టుకున్నదానికంటె పద్మావతి సాదాచీరకు రెండు మూడు చినుగులు కనబడితే ఆమెకు మహా సంతృప్తి కలిగేది.

"ఆ పద్మావతి అటువంటిది కాదు. నాకు బాగా తెలుసు. వాళ్ళు రెండుపూటలా ఎవరింటికి వెళ్ళగా నీవు చూశా నంటున్నావో—వారికి కాదు నేను పేపర్లు యిచ్చినది. నీవు పొరబడుతున్నావు వనజాక్షీ!" అని హెడ్‌మాస్టరుగారు అంటున్నారు.

ఈమాటలన్నీ స్పష్టంగా విని పద్మావతి వికలమయిన మనస్సుతో క్లాసులోకి వెళ్లి కూర్చున్నది.

* * *

ఆసాయంత్రము ఆరుగంటల సమయములో వనజాక్షి, ఆమెతల్లీ హెడ్‌మాస్టరుగారింటికి వెళ్లారు. ఆయన ఎదురుగా వచ్చి స్వాగతమిచ్చి, లోపలికి తీసుకొనివెళ్ళారు.

వాళ్లు ఏపనిమీద వచ్చారో, తన కెవిధమైన ఉత్తరువు తీస్తారో నని ఆయనహృదయములో ఆందోళన బయలుదేరింది. మేఘగర్జనముతరువాత పిడుగుపాటున కెదురుచూసినట్లుగా వాళ్ళ రాకతరువాత పెద్ద అవాంతరము వచ్చితీరుతుందనే భయము కలిగింది ఆయనకు.

"ఏమిటండీ! అమ్మాయి రేపటినుంచీ మీస్కూలుకు రానంటున్న దేమండీ" అని వనజాక్షితల్లి అన్నది.

ఏదో తనమీద తల్లికి చాడీ చెప్పిఉంటుందని హెడ్‌మాస్టరుగారికి తెలిసిపోయింది. అప్పటికి ఆయనకు స్ఫురించింది పద్మావతివిషయములో వనజాక్షి కేదో అసంతృప్తి కలిగిందని.

"ఏమిటమ్మా వనజాక్షీ! నీ కేమి కష్టము కలిగింది? నాతో చెప్పమ్మా" అన్నారు.

వనజాక్షి నేలచూపులు చూస్తూ తల పైకెత్తలేదు.

"ఏమిటోనండి. . ఒకరోజు సాయంకాలము స్కూలునుంచిరాగానే ఏడుస్తూ పడుకున్నది. తండ్రిగారూ, నేనూ ఎంత అడిగినా జవాబు చెప్పలేదు. ఏమిటో చిన్నబుచ్చుకుని ఇంట్లో తిరుగుతున్నది. వారు సంగతేమిటో మీదగ్గరికి వెళ్లి తెలుసుకొమ్మని అన్నారు" అన్నది తల్లి.

"ఏమిటమ్మా వనజాక్షీ! నాతో చెప్పవమ్మా" అని అడిగారు.

"నేను ఆ స్కూలులో ఇంక చదవనండీ. ముష్టి పిల్లలను మహాపెద్దవాళ్లవలె గౌరవించే చోటికి నేను ఎట్లా రావాలి! ఆ పిల్లకు అసలే కళ్లు నెత్తిమీద ఉన్నాయి. దానికితోడు మీరు చేసిన సన్మానములో మరింత అహంకారము వచ్చి అందరినీ తృణీకరిస్తున్నది. నే నాస్కూలుకు రేపటినుంచీ రాను" అని వెక్కి వెక్కి ఏడవటము ప్రారంభించింది.

"అదేటమ్మా సంగతి? మేము ఇంకా ఆ విషయము బాగా ఆలోచించలేదుగా. నీవు వచ్చిన సందేహము అదేనా? నేను చూస్తాలే. నాతో నే చెప్పక పోయినావా! ఇంత చిన్న విషయము అమ్మగారి వరకూ పోనిచ్చావా?" అన్నారు.

రకరకాల మనస్తత్వాలు కల పిల్లలతో మెలగిన ఉపాధ్యాయుడు కావటమువల్ల వాళ్లను సమాధాన పరచి అప్పటికి పంపివేశారు. కాని ఆయన కది పెద్ద చిక్కుగానే తోచింది. పద్మావతి బీదబాలిక అయినా ఆత్మగౌరవముగలదీ, తెలివైనదీను. ఆమె స్వయంకృషి చే చేతపైకి వస్తున్నదని ఆయనఅంతరాత్మకు బాగా తెలుసు. కాని వనజాక్షి విషయములో మాత్రము గౌరవముతో కూడిన అభిమానమువల్లనూ, పలుకుబడి గల పెద్ద అధికారికుమార్తె కావటమువల్లనూ వ్యవహారరీత్యా ఆయనబుద్ధి అంతరాత్మను గెలువవలెనని పోరాటము సాగిస్తున్నది.

* * * *

మరునాడు క్లాసులోకి పిల్లలంతా వెళ్లుతున్నారు. పద్మావతి క్లాసుగదిలోకి వెళ్లి బల్లమీద తన స్థానములో కూర్చొనబోయినది. బల్లమీద సరిగా ఆమె కూర్చొనేచోట ముష్టిపిల్ల అని ఇంగ్లీషులో వ్రాసిన చీటీ ఒకటి అంటించబడిఉన్నది. దానిని చూసినవెంటనే ఆమెసుందరనయనాలలో నీళ్లు సుళ్లు తిరిగినవి. ఉపాధ్యాయులతో చెప్పవలెనని ఆమెకు ముందుగా తోచినదికాని, చెప్పినందువల్ల తెలియని వాళ్లకుకూడా తెలిసిపోయి అనవసరమయిన అల్లరి జరుగుతుందేమోనని జంకి వెంటనే సంశ్లేషించుకొన్నది. చీటీని చింపివేసి ఆ క్లాసు అయేవరకూ అట్లాగే కూర్చున్నది. ఆమెమనసంతా చీటీని చూసిన దగ్గరనుండి వికలమయిపోయినది.

స్కూలునుంచి ఇంటికి పోతూఉండగా ఏడెనిమిదిమంది పిల్లలు *Beggar Maid* అని అరిచారు. ఆమె వెనుకకు తిరిగిచూడగా ఎవరూ కనబడలేదు!

ఆమె రెండుఫర్లాంగులదూరము మాడునిమిషాలలో చేరింది.

ఆరాత్రంతా కన్నుమూయకుండా తెల్లవారేవరకూ వేగించి ఒక నిశ్చయానికి వచ్చింది.

—అమరునాడు స్కూలుకు పోయి నీళ్లునిండిన కళ్లతో క్లాసులోకి వెళ్లి, "మాస్టరుగారూ! ఈ స్కూలులో ఇంక క్షణమైనా చదవలేను. దయచేసి నాకు సర్టిఫికేటు యిప్పించండి. నే నింకా వుండిదానివలె ఇక్కడే చదివితే మా కుటుంబానికి మిగిలిన ఆ ఒక్క మర్యాదకూడా పోతుంది. నాకు సెలవు ఇప్పించరూ" అన్నది.

"ఏమిటమ్మా పద్మావతీ, కళ్లనీ ళ్లెందుకు? నాతో చెప్పు" అన్నారు ఉపాధ్యాయులు.

"నేను ఏమనీ చెప్పలేను. ఇక ఒక్క క్షణము ఆలస్యమయినా నామర్యాద కాస్తా జారిపోతుంది." అని కళ్లు ఒత్తుకున్నది.

పిల్లలంతా విషయము ఎట్లా మారుతుందోనని ఆతురతతో చూస్తున్నారు.

తాను సూచించదలచిన పథ్యమునే రోగి కోరటములో వైద్యునకు కలిగే సౌలభ్యము పద్మావతి కోరటంవల్ల ఉపాధ్యాయునికి కలిగింది!

వెంటనే ఆయన కుర్చీమీదనుంచి లేచి బయటికి వచ్చారు. పిల్లలందరికి నమస్కరించి పద్మావతికూడా బయటికి వెళ్ళింది.

"అమ్మా, పద్మావతీ! ఈ లోకములో ఎంత మంచివాళ్లకయినా మంచిపేరు రావటము కష్టము. నేను ఈ స్కూలుకమిటీవారితో మాట్లాడి నీకు ఏర్పాటయిన విద్యార్థివేతనము ఇస్తూ మరొక స్కూలులో నిన్ను చేర్పించే ఏర్పాటు చేస్తాను. దుఃఖపడకమ్మా" అని ఆమెను ఓదార్చారు.

పద్మావతి ఆయనకు నమస్కరించి గేటువైపునకు నడక సాగించింది.

టిష్యూచీరను ధరించిన వనజాక్షి విరుసెక్కిన ముంగురులు ముఖముమీదికి జారగా తల పంకిస్తూ విజయగర్వముతో వికటాట్టహాసము చేయటము నాలుగు బారల దూరాన ఉన్న పద్మావతికి వినబడింది.

# ఆంధ్రశిల్పదర్పణము

శ్రీ ఆమంచర్ల గోపాలరావు

## ౧. ముందుమాట

మహదాంతర్యస్వభావానుభావము శిల్పము. అనేక ప్రాంతములందు, అనేక కాలములలో, అనేక విధములుగా మానవాంతర్యము వికసించినది. దీని పర్యవసానము వివిధమతిలేఖ్యములు, పలుకళావాహినులు.

ఆంధ్రశిల్పము ఒక మహాకళావాహిని. ఈ వాహినిఅంకురము కాలగర్భమం దొక పరమరహస్యము. కాని మనము ఎరుగగలిగినంతవరకు చారిత్రకముగా ప్రథమమున ఈ పరమవాహిని పూర్ణవికాసముతో సాంచీతోరణములమీద కానుపించి, అనతికాలములోనే అనేకదివ్యగతుల నందికొని, ఒక అపారతను వహించినది. ఆంధ్రశిల్పగతుల ప్రత్యేకవిశిష్టతను పండితులు అనాదినే గుర్తించిన మాట వాస్తవము. నాగర, వేసర, ద్రవిడ, ఆంధ్ర, కళింగ అను పంచ జాతివాస్తుశిల్పలక్షణములను మన పురాతన గ్రంథములందు చర్చించిరి.

క్రీస్తుకు మూడు శతాబ్దములకు పూర్వము రచనలై నిలిచియున్న శిల్పములు మన దేశమున నేడు చాల స్వల్పము. నిశ్చయముగా మొహెంజోదారో, హరప్పల దివ్యశిల్పములు క్రీస్తుకు పూర్వము మూడువేల సంవత్సరముల నాటివే. అప్పటికే కొన్ని శతాబ్దముల పర్యంతము, మన దేశమందు శిల్పము ఒక మహావిద్యగా పరిగణింపబడి నాగరికతాజీవితవిధానమందు ఒక ముఖ్యభాగముగా వెలయుచుండె ననుటకు తీరిన అత్యుత్తమ హస్తనైపుణ్యమును ప్రకటించు ఆ దివ్యశిల్పములే తార్కాణము. ఇంతేగాక, హరప్పనాగరికత ఆనాటికి వట్టి సింధుప్రాంతమునకే చెందినదికాదనియు, తూర్పున యావద్గంగాప్రాంతమం దంతటను వెలయుచుండెడి దనియు పండితమూర్ధన్యులుగారే వెలిబుచ్చిరి. ఆపైన మొహెంజోదారో, హరప్పలందు కానవచ్చిన సువర్ణ మణులాదివస్తువులు మైసూరు నీలగిరిప్రాంతములనుండి యటకు వచ్చుచుండెడివనికూడ పండితాభిప్రాయము. కాబట్టి, హరప్పనాటికి, అనగా క్రీస్తుకు మూడువేల సంవత్సరములకు పూర్వమే భారతదేశమం దంతటను ఉత్తమనాగరికతావిధానము వెలయుచుండెడి దని మనము ఊహింపవచ్చును. బహుశా ముమ్ముందు మహాశోధకులు ఈ అంశమును రూఢిపరుపగలరని కూడ మనము విశ్వసింపవచ్చును.

సాంచీతోరణములపైన ఆంధ్రశిల్పము వికసించక పూర్వము రెండువందల సంవత్సరములపర్యంతము, అనగా అశోకసార్వభౌముని కాలమునుండి రచనలందిన శిల్పములు మాత్రమే నేటి భారతశిల్పచరిత్రకు చెందినవై ఉన్నవి. ఇందుకు ముఖ్యకారణము మొహెంజోదారో నాటికిని, అశోకుని కాలమునకును మధ్య రచనలయిన శిల్పము లేవియు నేడు కానరాకపోవుటయే.

నిజముగా, సాంచీతోరణముల నిర్మాణకాలమునకు పూర్వము దాదాపు శతాబ్దపర్యంతము రచనలందిన ఆంధ్రశిల్పములు నేడు నిలచియున్నప్పటికిని, ప్రాచీనాంధ్రుల నిజఅంతర్వికాసము బయల్పడిన ప్రథమ విశిష్టశిల్పసమూహ మిది అగుటయే శిల్పచరిత్రకారులు ఈ సాంచీతోరణశిల్పములే ఆంధ్రశిల్పచరిత్ర కాదిగా కొనుటకు ముఖ్యకారణమని చెప్పవలయును. అంతకు మున్ను రచనలయిన ఆంధ్రశిల్పరచనలన్నియు విడిగా ఒకటొకటిగాను, ఖండములుగాను మాత్రమే నేడు కనబడుచున్నవి. ఇవన్నియుకూడ బాహ్యరూపమున చాలవరకు సాంచీశైలినే అనుకరించి, వసనాభరణము లందుసైతము సాంచీశిల్పరూపములను పోలినప్పటికిని,

పతితవముగాక, ప్రాచీనాంధ్రనిజఅంతర్వికాసమును ఏమాత్రము సూచింపగలిగినవిగా లేవు.

ఈ ప్రాచీనాంధ్రశిల్పఖండములు కొన్ని ఆంధ్ర గర్భమయిన అమరావతీప్రాంతమందే కానవచ్చినవి. అదిన అమరావతియందు, శిల్పాలంకృతమయిన చిన్న స్తూప మొకటి యుండియుండెడి దనియు, తర్వాత చాలకాలమునకు నేడు మన మెరిగిన మహాస్తూపమును ఆంధ్రశిల్పులు నిర్మించిరనియు పండిత ఫెర్గూసనుగారు నిరూపించిరి. ఈ మహాస్తూపమునకు చెందిన శిల్పము లందు, తొలిస్తూపమునకు చెందిన శిల్పఖండములను ఒకటిరెండింటిని వారు గుర్తించిరి. ఇంతేకాక అమరావతిచుట్టుపట్ల భట్టిప్రోలు మొదలయిన తావులందు కాను సర్వప్రాచీనాంధ్రశిల్పములందు విదితమవు వసనాభరణముల శైలి ననుసరించి, యవి యాంధ్రశిల్పములని తప్పక గుర్తించవచ్చును. ఈ వసనాభరణముల శైలి శాతకర్ణి రాజుల నాటిది. స్త్రీలు బరువయిన హారము, పెద్ద చెవిపోగులు, బరువయిన మురుగులు కడియములు ధరించి, కుంతలములు ముందుభాగమున అనేక ప్రత్యేక పద్ధతిని అలంకరించి కానవత్తురు. పురుషులు పెద్ద తల పాగా ధరించి, ఈ తలపాగాకు ఎదురున ఒకవిధమయిన పెద్ద ముడిని అమర్చియుందురు. సంపన్నులందు స్త్రీపురుషులుసయితము కటికి పైభాగమున వసనము లేనియు ధరింపరు. కాని ఆభరణములనుమాత్రము తప్పక ధరింతురు. ఈ శైలివసనాభరణములు నిజముగ ప్రాచీ



(శాతకర్ణి రాజులనాటి వసనాభరణముల శైలి-సాంచీశిల్పముల ననుసరించి)

పించిన కొన్ని శిల్పఖండములు అతిప్రాచీనములై సాంచీతోరణశిల్పములకు పూర్వమే రచనలైనట్లు శైలి ననుసరించి తప్పక తెలియుచున్నది.

ఇంతేకాక అజంతాయందు అదిన మలిచిన అతి ప్రాచీనమయిన తొమ్మిదవగుహ, పాపిపుగుహలందు తొలిచైత్యముసయితము ఆంధ్రశిల్పులు సాంచీతోరణములను నిర్మింపకపూర్వమే మలిచిరనుట చరిత్రాంశము.

నాంధ్రశిల్పమునకు అతిప్రత్యేకము. ఏ ఇతరప్రాచీన శిల్పములందును ఈశైలి కానరాదు. మధురయందు కొన్ని ప్రాచీనశిల్పములందుసయితము ఈశైలి కానవచ్చును.

అతివిరిసై, ఈసాంచీతోరణశిల్పములు, తరువాత దాదాపు పౌశ శేయిసంవత్సరములు మహత్తర వాహినియై, దిశదిశల ప్రసారమందిన అపారఆంధ్రశిల్ప

మునకు మూలలక్షణగతులను నిర్వచించుటయేకాక, అంతవరకు ఘనీభవించిన సంప్రదాయములందు ఒక నిశ్చితగతిన ప్రవహించుచున్న సర్వభారతశిల్పమునకే నవ్యగతులను సూచించి, నూతనరూపమును ప్రసాదించినవి. అందుచేత ఈ దివ్యశిల్పమందు విదితమయిన లక్షణగతులను ఒకింత అవగాహనము చేసికొను ఆవశ్యకత గలదు.

## ౨. సాంచీతోరణములు

సాంచీతోరణములకు పూర్వము సంప్రదాయపరమయిన భారతశిల్పము భారతస్తూపప్రాకారము మీద కానవచ్చును. ఎలాగనగా, అంతకుపూర్వమే నిర్మితమయిన బౌద్ధ గయ ప్రాకారముపైని శిల్పములు, ఓడిశారు ఉదయగిరి గుహాలందలి శిల్పములు శైలిగతులందు భారతస్తూపప్రాకారశిల్పములను చాలవరకు పోలియుండుటచే, ఆ శిల్పము లన్నియు, ఆనాటికి మన దేశమందు వర్ధిల్లుచున్న సంప్రదాయముల ననుసరించియే రచనలందినట్లు ఊహింపవచ్చును.

కాని సాంచీస్తూపతోరణములపైన వెలసిన ఆంధ్రశిల్పము ఈ సంప్రదాయములను మించి, భారతశిల్పము అప్పటివరకు ఎరుగని ఒక నూతనశోభ నందికొన్నది. ఇచట ప్రస్ఫుటించిన ఈ నూతనశిల్పగతి, తరువాత ప్రచండవాహినియైన అపారఆంధ్రకళకు ప్రధానగుణమయినది.

అందుచేత ఆంధ్రశిల్పరూపము నెరుగుటకు, తత్పూర్వసంప్రదాయపరమయిన భారతస్తూపప్రాకారశిల్పరూపావగాహనము కొంత అవసరము. వింధ్య కుత్తరమున ఈ భారతస్తూపప్రదేశము. శుంగరాజులనాటి తత్ప్రాకారనిర్మాణము.

ఈప్రాకారముపైన శిల్పమందు రూపొందినవి ముఖ్యముగా గౌతమబుద్ధుని జీవితమందలి కొన్ని ప్రధానప్రకరణములు; ఇరువది ఎనిమిది జాతకకథలు: అపైన విడిగా విపస్సి, విశ్వభూ, క్రకుచ్ఛంద, కనకముని, కశ్యప అను పూర్వపు బుద్ధుల నయిదుగురినికూడ పతకకేంద్రములందు చిత్రించిరి. కాని ఈశిల్పములలో నేటియందునుకూడ గౌతమ బుద్ధుని యొక్క గాని, తక్కిన అయిదుగురు మానుషబుద్ధులయొక్క గాని రూపములను ఆ శిల్పులు చిత్రించలేదు. వా రుండవలసిన స్థానములు చిహ్నపరముగా ఖాళీగా వారు వదలిరి. ఇంతేకాక అనేకయక్షులు, విద్యాధరులు, నాగులు మొదలయిన దేవతాస్వరూపములునయితేము ఈ చిత్రములందు కానవచ్చును. ఈ శిల్పములందు ముఖ్యముగా గమనింపవలసిన దేమన, ప్రతిచిత్రముక్రిందను చిత్రవిషయము బ్రహ్మలిపియందు లిఖించనయినది. ఇందువలన ఆ చిత్రములు స్పష్టపడుటయేకాక, తర్వాత మన దేశమందు రూపొందిన అనేకబౌద్ధశిల్పములను అర్థముచేసికొనుటకు వీలుకలిగిన దని గట్టిగా చెప్పవలెను.

నిశ్చయముగా భారతస్తూపప్రాకారశిల్పములు అనేక ఇతరప్రాచీనశిల్పముల కేమియును తీసిపోవు. అయినప్పటికి ఈ శిల్పములశైలి దోష్యము. అశోకశిల్పముల నగరపు మెరుగు వీటియందు కానరాదు. ఇంతేకాక ప్రకృతియందలి లయాగతులను ఈ శిల్పులు సరిగా గుర్తించినటుల తోపదు. నిజముగా ఈ శిల్పములందు రూపభేదస్పష్టత వీర్పడలేదనియే చెప్పవచ్చును. మానవబుద్ధుల వివిధబోధివృక్షములు, ఆ యా పేర్లు అచట లిఖింపకున్న కనుగొనుట దుర్లభము. ఇంతేకాక, ఘనశిల్పమందు వీర్పడు వెరకపల్లముల స్థాయీపరంపరల న్యాయములునయితేము ఈ శిల్పులు సరిగా గమనింపక, క్రమముతప్పి, మానవరూపభంగిమల నిర్దేశమందు అవయవముల వాలుస్థానములు కొంతవరకు తప్పిన మాట వాస్తవము. మరియు ఈ శిల్పములందు మానప్రమాణసంకలనన్యాయములందు నయితేము ఒకింత లోపము కానవచ్చును. చిత్రమందు ముందుభాగమున వీర్పరచిన ప్రధానరూపములకును, వెనకభాగమందు వీర్పడు ఇతరరూపములకును వీక మానప్రమాణములనే వినియోగించుటచే, చిత్రమందు అగుపడవలసిన ప్రదేశనిర్దేశము చాల లోపించినమాట వాస్తవము. అపయిన ఆ శిల్పులకు ప్రకృతిరూపలయావగాహన సంపూర్ణము కాకపోవుటచేత, రేఖావిన్యాసము లోపించి, చిత్రములు అఖండనునము తప్పుటయేగాక, కొంత నిట్టువారినరీతికూడ కాన్పించుచును.

ఈ కారణముగా ఈ శిల్పములందు శిల్పప్రధానఅంగమయిన లావణ్యము కొరతపడినమాట వాస్తవము.

భారతస్తూపప్రాకారశిల్పరచయితల అంతర్వికాస శోభ కొంతవరకయిన కనుగొనుటకు ఆనాటి పరిస్థితుల నెరుగుట కొంతవరకు ఆవశ్యకము. భారతస్తూపప్రాకార శిల్పములు దాదాపు క్రీస్తుకుపూర్వము రెండవ శతాబ్దారంభమున రచనలయినవి. ఆనాటికి గౌతమబుద్ధుడు పరినిర్వాణమయి దాదాపు మూడుశతాబ్దములు గడచినవి. ఈ మూడు శతాబ్దములందును, బౌద్ధమతమం దనేక నవ్యభావము లుదయించి, అనేక ఉపసిద్ధాంతము లంకురించినవి. ఈ నూతనభావగతులను అరికట్టి, బౌద్ధమతమంతయు ఏకగతిన నడపుటకు అనేక ప్రబల ప్రయత్నములుకూడ జరిగినవి. గౌతమబుద్ధుడు పరినిర్వాణమయినవెంటనే, ఆనాటి అర్హత భిక్షువులందరు రాజగృహనగరమందు ఒక మహాసంగతిని సలిపి వినయమును నిర్ణయించిరి. మరల దాదా పొక శతాబ్దము గడచినతర్వాత వైశాలినగరమందుకూడ బౌద్ధభిక్షువులు చేరి, చర్చించి, కొన్ని నియమములను నిర్వచించిరి. తర్వాత మరికొంతకాలమునకు అశోకసార్వభౌముడు బౌద్ధమతము నవలంబించి, ఈమతమును దేశదేశముల మహాప్రచారమొనర్చి, పాటలీపుత్రనగరమున మరియొక మహాసంగతిని జరిపించి, కొన్ని విధులను నిర్ణయించి, యవన్నియు అనేక రాతిస్తంభములపైన లిఖింపజేసి, దేశమంతటను ఆ స్తంభములను విరివిగా నాటించెను.

ఈ భారతస్తూపప్రాకారశిల్పములు రచనలందు నాటికి బహుశా అశోకసార్వభౌముడు గతించి, ముప్పదినలుబది సంవత్సరము లయియుండవచ్చును. బౌద్ధమతసంబంధిత ఆదిగ్రంథములయిన త్రిపిటకములు, పంచనికాయములు, కొన్ని జాతకకథలు, లిఖితపూర్వకముగ పుస్తకరూపము వహించినవి. గౌతమజీవితచరిత్ర యనదగు మహావస్తువు కూడ గ్రంథరూపము వహించుచున్నది. అయినప్పటికిని బౌద్ధమతమందు భావము లన్నియు ఏకగతిన లేక, పలురీతుల పరువిడుచున్నమాట వాస్తవము. ఈ వివిధశాఖలు కనీసము అయిదు అనియు, అందు ముఖ్యమయినవి ఉత్తరపాఠకులకు, దక్షిణపాఠకులకు చెందిన వనియు పండితాభిప్రాయము. వీటన్నిటికిని గౌతమబుద్ధుడు లోకాతీతుడయిన మహాపురుషుడనియు, అతని జీవితమందు అద్భుతకర్మములు కలవనియు, అనేకజాతకములందు దశపారమితలను సాధించి, బోధిసత్వుడయి, చివరకు గౌతమజాతకమందు బుద్ధత్వము బడసెననియు, గౌతమునికివలెనే పూర్వ మనేకబుద్ధులుండిరను భావములు సామాన్యమే అయినవి.

మరొకవైపున, బౌద్ధమతమునకు కొలదిసంవత్సరములు పూర్వమే బీజమెత్తిన జైనమతస్థులు తమ సిద్ధాంతములకు గ్రంథరూపము ఇంకను కల్పింపలేదు. కాని వైదికమతమందుమాత్రము గ్రంథములు అనంతముగ పెరిగిపోవుచున్నవి. ఉపనిషత్తుల రచనలన్నియు దాదాపు పూర్తిఅయి, పురాణకల్పనలు ప్రారంభమయినవి.

ఇవన్నియు ఇట్లుండ, బౌద్ధమతమునకు చెందిన కొందరు కళాకోవిదులు, ఆనాడు మన దేశమున సర్వమతములకు మించిన రీతి, బౌద్ధమతఇతిహాసములను, గౌతముని దివ్యకథను సర్వజనులు ఎరుగగలుగునట్లు రాతిమీద మలుచుటకు పూనుకొనిరి. ఆనాటికే నిలచియున్న భారతస్తూపము బౌద్ధుల కొక మహాక్షేత్రము. తత్ప్రాకారముపైన రచించిన యీ దివ్యశిల్పములు అచటికి వచ్చు బౌద్ధులేగాక, సర్వఇతరమతస్థులు సయితము చూచి ఆనందించి బౌద్ధమతహృదయమును ఎరుగగలరు. అందుచేత భారతస్తూపప్రాకారశిల్పములందు కానవచ్చు లోపములన్నియు నాశిల్పుల హస్తనైపుణ్యఅసంపూర్ణతను తెలుపునవిగాక, వారిఉద్దేశప్రాబల్యమును ప్రస్ఫుటింపజేయునవై ఉన్నవి.

భారతస్తూపప్రాకారనిర్మాణమయినతర్వాత దాదా పొక శతాబ్దమునకు ఆంధ్రశిల్పులు సాంచీస్తూపములదరి బౌద్ధసరస్సునందు కేళీవినోదములను సల్పిరి. ఆ మహాశిల్పుల లీలలు సాంచీతోరణములపైన రూపొంది, భారతభూమినే అలంకరించినవి. సాంచీతోరణములపైన వెలసిన ఈ ఆంధ్రశిల్పములు భారతస్తూపప్రాకారశిల్పములకు మించిన శోభ కలిగి, నిజ

లావణ్యబీజములతో ప్రకాశించుచు, వేరు శైలీగతుల నందికొన్నయట్లు, చూచినంతనే తోపచేయును. తప్పదు! పండిత మార్షలుగారు వచించినరీతి, ఈశైలిగతులభేదము భారతస్తూపప్రాకారశిల్పముల తర్వాత గడచిన అరువదిడెబ్బదివర్షముల కాలమందు అలవడిన హస్తనైపుణ్యకారణమునగాక, ఆయాశిల్పుల నిజ అంతర్య స్వభావగతులందే ఏర్పడినమాట వాస్తవము.

సాంచీశిల్పశైలి భారతస్తూపప్రాకారశిల్పముల శైలివలెనే దేశ్యము. అశోకశిల్పములందు కానవచ్చు నగరపుమెరుగు ఈ శిల్పములందు సయితము కానరాదు. భారతస్తూపప్రాకారశిల్పములందువలెనే సాంచీ తోరణశిల్పములందుకూడ పురోదృశ్యము ఎక్కువ. కాని ఆనాటివరకు ఘనీభవించిన సంప్రదాయపరంపరలనుండి బయల్పడుటకయి ప్రబలప్రయత్నములు ఈ శిల్పములందు స్పష్టముగా కానుపించును. ఈ శిల్పులు అతిశయించిన చాతుర్యమును, శిల్పలక్షణముల ఎరుకయు కలిగి, రూపకల్పనలందు అతిస్వేచ్ఛను ప్రవర్తించిరి. చాతుర్యము ఎక్కువ అయినందువల్ల, ఈ శిల్పములందు రూపభేదము భారతశిల్పములందుకంటె మరింత స్పష్టమయినది. సంకలనపద్ధతులందుకూడ వీరి నేర్పరితనము బాగుగా కానవచ్చును. చిత్రములందు వెనుకభాగమందేర్పడు మానప్రమాణములు క్రమముగా తగ్గి, ప్రదేశనిర్దేశముకూడ స్పష్టపడినది. ఘన శిల్పలక్షణావగాహన కారణమున శిల్పమందేర్పడు మెరక పల్లముల స్థాయీపరంపరల న్యాయములను ఈ సాంచీశిల్పులు చక్కగా గుర్తించి, వివిధభంగిమల నిర్దేశములందు, వాలుక్రమములు తప్పక, అవయవస్థానములను చక్కగా అమర్చిరి.

సాంచీతోరణశిల్పము లయినతర్వాత ఆంధ్రశిల్పమునకు ప్రధానగుణములయిన దివ్యలక్షణగతుల బీజములు సాంచీశిల్పములందేర్పడుటకు ఆ శిల్పుల ఆంతరంగిక స్వేచ్ఛానువర్తిత్వమే కారణము. లావణ్యము శిల్పప్రధానాంగమని ఈ శిల్పులు గుర్తించిరి. ఈ లావణ్యోద్దేశానుసారముగానే మానవాకార రచనయందు భంగిమల నేరుకొనుట, మాన ప్రమాణముల నిర్ణయమునయితము అతివిచక్షణతను వినియోగించి ఏర్పరచిరి. ఈ లావణ్యభావము ననుసరించియే రేఖావిన్యాసము కూడ ఈ శిల్పములందు అమరినమాట వాస్తవము. ఇంతేకాక, భారతస్తూపప్రాకార చిత్రములకువలె సంకలనకల్పనలందు ఇచటి చిత్రములు ఇరుకుపడక, ఒక విశాలతనుపొంది, అతిశయించిన జీవశోభలతో ప్రకాశించుచున్నవి. అటుతర్వాత ఆంధ్రశిల్పమునకు ప్రధానగుణమయిన విలాసమయరతి భావగతి బీజములు ఈసాంచీతోరణముల శిల్పములందు స్పష్టముగ కాననగును. ఈగతి ననుసరించియే స్త్రీపురుషరూపములందు సయితము కొన్ని వాలు చాళ్లకు ప్రాముఖ్యత నిచ్చి, ఒకింత అతిశయోక్తిని కల్పించి, ఆ శిల్పులు అతిమనోహరములయిన రూపకల్పనల నొనరించిరి. ఈ రూపముల లయాప్రాధాన్యమువుటంజేసి, సంపూర్ణప్రకృతి యనుకరణను విడిచి, ప్రకృతిప్రతిబింబములు కాకపోయినప్పటికిని, సజీవములయి, అతి సొంపు కలిగియున్నవి. సాంచీశిల్పములందు విలాసమయరతిభావగతి ననుసరించిన ఈ అతిశయోక్తి నిర్మలమయిన అతిస్వచ్ఛఆంతర్యమున అంకురించిన సరణమయి లావణ్యపరమయినది. అంతేకాని ఈ అతిశయొక నిశ్చితగతి ననుసరించినందువలన, పూర్ణలయానయోక్తి పరిమితితప్పి, వికారచిహ్నస్వరూపములకు గాని, వ్యంగ్యచిత్రములకు గాని దారితీయలేదు.

ఈ సాంచీస్తూపములు ప్రస్తుతము వింధ్యల కుత్తరమున, భోపాలుప్రాంతమునందున్నవి. ఈ స్తూపములు భిల్సాస్తూపవర్గమందొక ఉపవర్గము. ఈ సాంచీ స్తూపవర్గము ఒక చిన్న కొండపై నున్నది. ఈ వర్గమందు తోరణములు రెండు స్తూపములకు మాత్రమే నిర్మితములయినవి. మహాస్తూపమునకు నాలుగు తోరణములు; మూడవ స్తూపమునకు ఒక తోరణము. ఈ అయిదుతోరణములమీద వెలసిన దివ్యశిల్పనిధియే చారిత్రకముగా ప్రథమఆంధ్రశిల్పము.

సంగరాజుల అనంతరము, అనగా క్రీస్తుకు దాదాపు శతాబ్దమునకుపూర్వము, ఈప్రాంతమంతయు ఆంధ్రరాజుల ఏలుబడిలోనికి వచ్చిన మాట వాస్తవము. ఇచట నిర్మించిన అయిదుతోరణములందు చిన్న

స్తూపమునకున్న ఏకతోరణము అతిపురాతనమయినది. ఈతోరణము ఆంధ్రశాతకర్ణి రాజులవద్దనున్న స్థపతి [శిల్పకుశల] ఆనందుడు నిర్మించినట్లు ఈ తోరణముపైని శాసనమువలన తెలియుచున్నది.

నాలుగువైపుల తోరణములు కలిగిన మహాస్తూపమే ప్రసిద్ధికెక్కిన కానకేడస్తూపము. సాంచిని పూర్వము సంస్కృతమున కానకేడ యనియు, ప్రాకృతమున కాకనాడయనియు అనుచుండెడివారని అచటి శాసనములవలననే తెలియుచున్నది. ఈస్తూపతోరణ మొకటి కురరవాస్తవ్యుడగు అచ్చవాడనాగప్పయ్యగారి ధర్మమని కూడ ఆశాసనములవలననే తెలియుచున్నది. దీనిననుసరించి పేరుకు ముందింటిపేరుంచుట యానాటనే ఆంధ్రులకు అలవాటైనట్లుస్పష్టమవుచున్నది.

చతురస్రస్తంభద్వయోపరి తరంగపట్టికాత్రయము ఈతోరణములనిర్మాణక్రమమని చెప్పవచ్చును. కంబమూలమున వేదికగాని, పీఠముకాని లేదు. ఈ కంబములు నేలనుంచి శిరోభాగమయిన ఫలకమువరకు ఒకేరీతి చతురస్రము. కాని ఈ కంబములు నాలుగువైపుల పరిపూర్ణముగా దివ్యశిల్పములచే నలంకృతమయినవి. ఫలకముపయిన బోధికల కల్పనలు అతిచాతుర్యమును చాటునవిగా నున్నవి. బోధిక యనగా అడ్డదూలమును ధరించు స్తంభశిరోభాగము. గజములనో, సింహములనో, కుబ్జులనో మలిచి తోరణశిరస్సంతటిని అవి ధరించుచున్నట్లు అతినేర్పుగా ఆ శిల్పులు నిర్మించిరి. మహాస్తూపమున కున్న ఉత్తర తూర్పుతోరణములందుమాత్రము ఈ బోధికలు గజముల రూపముననే నిర్మితమయి, వెలివైపున స్త్రీలు విలాసముగా వృక్షముల నానుకొని నిలచియున్నట్లు కానిపించును. దక్షిణతోరణమునందుమాత్రము బోధికలు సింహములు. పశ్చిమతోరణమునకును, చిన్నస్తూపమునకును, ఏకతోరణమునకును బోధికలు కుబ్జులు.

బోధికలపైన తోరణశిరోభాగమయిన పట్టికాత్రయము అంతస్తులరీతి ఒకదానిపైన ఒకటిగా నిర్మితమయినవి. ఈ పట్టికలు తరంగరూపములు. పట్టిక పట్టికమధ్యన నిలువుకంబములకు సరిగా చతురస్రగ్రీవముల నేర్పరచిరి. గ్రీవముల మధ్య పట్టికలను కలుపుచు, మూడు నిలువుదండములను ఏర్పరచిరి. ఈ పట్టికలు తోరణము వెడల్పును మించి, నిలువుకంబములకు ఇరువయిపుల, కొంచెము ఎక్కువగా నుండును. చిన్నస్తూపమున కున్న ఏకతోరణనిర్మాణక్రమము ఇంతేనని చెప్పవచ్చును.




క : కంబము
ఫ : ఫలకము
బ : బోధిక
గ్రీ : గ్రీవము
ప : పట్టిక
ద : దండము
అ : అనంతవర్తులము

చిన్నస్తూపఏకతోరణ నిర్మాణక్రమము

తర్వాత నిర్మాణమయిన మహాస్తూపతోరణపట్టికలకు అనేకఇతరశిల్పభాగములు చేర్చి, మరింత దివ్యముగా అలంకరించిరి. మహాస్తూపమునకు పశ్చిమ దక్షిణ ద్వారములుసయితము దాదాపు ఈరీతినే ఉన్నవి. కాని పశ్చిమతోరణమునకు ఊర్ధ్వపట్టికకు పైన మకుటము రీతి, మధ్యగా సింహరూపములు ఒక ధర్మచక్రమును ధరించుచున్నట్లు తెలియుచున్నది. ఈచక్రము శిథిలమయినది. ఈ మహాస్తూపతోరణములందు ఉత్తరతోరణము తప్పక గమనింపదగినది. ఈతోరణమునందు పట్టికలమధ్య నున్న గ్రీవదండములమధ్య ఏర్పడిన తావును సయితము ఖాళీగా ఉంచక, హయారూఢులనో, గజములనో ఆశిల్పులు నిర్మించి, నింపిరి. ఇంతేగాక నాలుగు గ్రీవములకు ప్రక్కగా, తోరణమునకు ఇరువైపుల, వృక్షచ్ఛాయలందు నిలచియున్న యక్షిణులను ఆశిల్పులు నిర్మించిరి. ఈ యక్షిణులు బోధికల ప్రక్కన ఉన్న యక్షిణులవలె నీటవాలుగా లేక, సమముగా నిలిచి కానవచ్చెదరు. మధ్యపట్టిక, ఊర్ధ్వపట్టికల చివరలందు ఏర్పడిన అనంతవర్తులములపైన పక్షములున్న సింహములు కూర్చొనియున్నరీతి కానవచ్చును. ఊర్ధ్వపట్టికపై భాగమున వారేర్పరచిన మకుటభాగము కూడ అతిచిత్రమయినది. మధ్యన ఏనుగులపైన ధర్మచక్రము. ఈ ధర్మచక్రమునకు ఇరువైపుల చామరధారులయిన యక్షులు. ఒక యక్షరూపముమాత్రము చెడక కానము. ఈ యక్షుల తర్వాత ధర్మచక్రముపైన త్రిరత్నచిహ్నములు. ఈ త్రిరత్నచిహ్నములు సరిగా నిలువుకంబములపైన ఏర్పడియున్నవి. ఇవన్నియు పైన చెప్పిన రెక్కల సింహములమధ్య అతి ఇంపుగా కానవచ్చును. ఇంతేగాక ఈ తోరణమందు పట్టికలమధ్య నున్న నిలువుదండముల ముఖములుసయితము దివ్యశిల్పములచే నలంకృతమయినవి. ఇన్ని వేరువేరు భాగములు కలిగియున్నప్పటికిని, విడివిడిగా నిర్మాణమయిన శిల్పముల సముదాయమువలెగాక, ప్రతిఒకతోరణము ఏకాండముగా, ఒక్క మహాశిల్పమురీతినే కానుపించును.

ఈ తోరణము లన్నియు అనేకదివ్యశిల్పములచే విరివిగా అలంకృతమయినవని ఇంతకుముందే అనడమయినది. కాని భారతస్తూపప్రాకారచిత్రములవలె ఈ చిత్రములక్రింద చిత్రవిషయములులిఖించిలేవు. బహుశా ఆనాటికి ఆ చిత్రవిషయము లన్నియు సంప్రదాయపరమయి సర్వజనావగతమయి ఉండవచ్చును. ఈ చిత్రములందు ముఖ్యమయినవి గౌతమబుద్ధుని జీవితమందలి అద్భుతప్రదర్శనములయిన ప్రధానఘట్టములు. ఇవి జననము, సంబోధి, ధర్మచక్రప్రవర్తనము, మహాపరినిర్వాణము. ఇవేగాక అనేక ఇతరగౌతమజీవితాంశములను సయితము ఆ శిల్పులు ఈ తోరణములపైన చిత్రించిరి. వీటన్నిటియందును భారతస్తూపప్రాకారశిల్పములందు వలెనే గౌతమబుద్ధుని రూపము కన్పడదు. పట్టి చిహ్నములుమాత్రమే ఈ చిత్రములందు గౌతముని ఉనికిని తెలియజేయును.

గౌతమునకు జ్ఞానోదయమయి, బుద్ధత్వము కలుగుట సంబోధి యను అద్భుతప్రదర్శనము. అశ్వత్థవృక్షముక్రింద యోగసమాధిలో నుండగా ఆ మహాజ్ఞానము గౌతమునికి కలిగినది. గౌతమబుద్ధుడు పురుషోత్తము డయినందున చక్రవర్తిసమానుడు. ఆయన ఉపవిష్టుడయిన ప్రదేశమెల్ల సింహాసనమే. అందుచేత అశ్వత్థవృక్షముక్రింద సింహాసనము సంబోధిని తెలియజేయును. సాంచీశిల్పములందు సర్వసంబోధిచిత్రములందును అశ్వత్థవృక్షముక్రింద పట్టి సింహాసనమేకాక, కొన్నిటియందు ఛత్రములు, మరికొన్నిటియందు నాగులు, ఇతరభక్తులుకూడ కానవగును. ఈ ఛత్రములు చక్రవర్తిభావమును ఇనుమడింపజేయుటయేగాక గౌతముని మహత్తునుకూడ తెలుపును.

సంబోధి బడసినతర్వాత గౌతమబుద్ధుడు సారనాథువద్ద మృగవనమునకు ఏగి, అచట తన దివ్యసందేశమును ప్రథమమున బోధించెను. ఇదియే బౌద్ధధర్మచక్రము తిరుగుటకు ప్రారంభము. ఈ అద్భుతధర్మమును బౌద్ధులు ధర్మచక్రప్రవర్తన మని వచింతురు. ఈ ధర్మచక్రప్రవర్తనమును సూచించుటకు చక్రచిహ్నమును శిల్పులు వినియోగించిరి. అది సారనాథువద్ద మృగవనమున జరిగినట్లు తెలుపుటకయి అప్పుడప్పుడు రెండు లేళ్లను చక్రమున కిరుపైపుల చిత్రించుచుండిరి. సాంచీ

శిల్పములందు ధర్మచక్రప్రవర్తనము ఈద్వివిధముల కానవగును.

గౌతమబుద్ధుని దివ్యమరణము మహాపరినిర్వాణము. సాధారణఅర్హతుడు మరణించినపుడు వట్టి నిర్వాణము చెందును. కాని గౌతమబుద్ధునిది మహాపరినిర్వాణము. అందుచేతనే అతడు తథాగతుడు; అనగా అచటికి పోయినవాడు. ఇదికూడ ఒక అద్భుతధర్మము. మహాపరినిర్వాణమును చిత్రించుటకయి స్తూపచిహ్నమును ఆనాటి శిల్పులు వాడిరి. సాంచీతోరణ శిల్పములందు ఒక్కొక్కప్పుడు దేవతలు, యక్షులు, నాగులు, సామాన్యమానవభక్తులు, గంధర్వులునయితము ఆ స్తూపచిహ్నమును పరివేష్టించియున్నట్లు కానవగును.

గౌతమబోధిసత్త్వుని జాతకమందు గౌతమజననమే ఒక అద్భుతధర్మము. సాంచీనాటి శిల్పులు భద్రఘటముచే సూచించెడివారు. భద్రఘట మనగా ఘటమందు కమలములగుత్తి. కమలమే మహాపురుషజన్మ సూచనీయము. సాంచీతోరణములపైన ఈ భద్రఘటములు అనేకములు కానవచ్చును. ఈ దివ్యజననమును సాంచీతోరణములపైన మరొకరీతినికూడ కానవగును. ఈ చిత్రమందు సాధారణముగా మాయాదేవి కమలముపయిన ఉపవేష్టిత అయియుండును. ఒక్కొక్కప్పుడు రెండుఏనుగులు తొండముల నెత్తి కుంభములతో మాయాదేవికి స్నానమిచ్చుచున్నట్లు చిత్రించిరి. ఈ చిత్రము బోధిసత్త్వగౌతముని జననమును తెలుపునని ప్రథమమున మహాపండితుడయిన ఫౌచరుగారు గుర్తించిరి. అనేకమందిపండితులు ఆయనతో ఏకీభవింపక అది లక్ష్మీరూపమే అని వాదించినమాట వాస్తవము. కాని ఈ చిత్రమందు కేంద్రమున కమలముపై ఉపవేష్టిత అయిన దేవికి ఏ వైష్ణవచిహ్నము కానము. ఇంతేకాక, సాంచీతోరణశిల్పములందు ఈ శిల్పములు నిర్మితమయిన స్థానములందునయితము గౌతముని జన్మ చిత్రించుటే అతిసమంజసముగ తోచును. అందుచేత పండితఫౌచరుగారి వాదమే సరిఅయినదని మనము ఒప్పుకొనవలయును. ఈ రూపముననే భారతప్రాకార శిల్పములందునయితము గౌతముని జన్మచిత్రములు కానవగును. కాని ఆ శిల్పములందు సాంచీశిల్పముల లావణ్యము కానరాదు.

సాంచీతోరణశిల్పముల నాటివరకు గౌతమబుద్ధునికి సంబంధించిన చిత్రములందు ఎందును గౌతముని రూపు కానరాదు. ఇందుకు కారణము ఆనాటికి మానవరూపమున దేవతాస్వరూపములను కల్పనచేయు సంప్రదాయ మేర్పడలేదని అనేక పాశ్చాత్యపండితుల వాదన. గాంధారశిల్పమందు ప్రథమమున గౌతమబుద్ధుని రూపు చిత్రించు సంప్రదాయ మేర్పడి, అది దక్షిణమున ప్రసరించినతర్వాతనే కాని, యట్టి మహాపురుషులయొక్కయు, దేవతలయొక్కయు రూపములు హైందవశిల్పమునందు అమరలేదనికూడ ఆ పండితుల అభిప్రాయము. కాని ఈ అభిప్రాయము సరిఅయినది కాదు. ఎందుకనగా, మనదేశమున దేవతలను నరరూపమున కల్పనచేయుట మొహెంజోదారోనాటినుండియే ఎరుగుదురు. ఆపైన ఋగ్వేదమందే రుద్రశివరూపచిత్రమును వర్ణించిరి. మరియు, క్రీస్తుపూర్వము అయిదు శతాబ్దములకు పూర్వమే *యాస్కుడు దేవతలకు నరరూపముల నొసంగుట సరియగునా కాదా యని చర్చించి, ఆనాటికే దేవతలకు మానవస్వరూపముల నొసగుట పరిపాటి అయినదని సూచించెను. ఇంతేకాక, గుడిమెల్లమందు లింగముపైన మలిచిన పశుపతి రూపము సాంచీతోరణముల శిల్పముల నాటిదే అని గోపీనాథరావుగారు నిర్ధారణచేసిరి. అందుచేత సాంచీతోరణములనాటి గౌతమబుద్ధుని రూపమును చిత్రింపకుండుట దేవతలను, దేవసమానులయిన మహాపురుషులను నరరూపమున చిత్రించు సంప్రదాయము లేమిచేగాక, గౌతమబుద్ధు డన్న గౌరవమతిరైౖ, ఆ మహాపురుషుని నిర్దేశించుటకు లక్షణయుతమయి తగిన రూపమును ఆనాటి శిల్పులు కల్పింపలేకపోవుటయే అని చెప్పవలయును. నిజముగా గాంధారశిల్పులే ప్రథమబుద్ధప్రతిమలను రచించినప్పటికిని సాంచీతోరణములు ఏర్పడిన కొలదికాలమునకే లక్షణప్రయుక్తమయిన, రసప్రద

* యక్షుడు అని 'దర్శని' వ్యాసములందు వ్రాసితిని. అది పొరపాటు.

మయిన బుద్ధదివ్యస్వరూపకల్పనాదృష్టము మన ఆంధ్ర శిల్పులకే చెందినదనికూడ మనము సగర్వముగా చెప్పవచ్చును.

భారతప్రాకారశిల్పములందువలెనే సాంచీతోరణముల శిల్పములందు అనేకజాతకకథలు చిత్రితములైనవి. ఇంతేగాక, ఉత్తరతోరణఊర్ధ్వపట్టికపైన సప్తమానషబుద్ధులు చిహ్నరూపముననే కానవచ్చెదరు. విపస్సి, సిఖి, విశ్వభూ, క్రాకుచ్ఛంద, కనకముని, కశ్యప, గౌతమబుద్ధులు వారివారి వివిధబోధివృక్షములచే ఇచట తెలియనవుచుందురు.

ఇవన్నియుగాక, భారతశిల్పములందువలెనే అనేకయక్షయక్షిణీలు, నాగులు, విద్యాధరులు, గంధర్వులు మొదలయిన దేవతాస్వరూపములుసయితము ఈ శిల్పములందు కానవచ్చును. అపయిన అనేక పక్షులు, జంతువులు విడిగాను, జతలుగాను, సమూహములుగాను అతిలావణ్యమొప్పచు ఈచిత్రములందు కానవచ్చును. కొన్ని జంతురూపములుమాత్రము రెక్కలు కలిగి, గంధర్వవిద్యాధరనాగులవలెనే లోకాతీతమయినవి. పక్షములు కలిగిన ఈ జంతురూపములు భారతీయశిల్పమందు ఖండేషు దేశమున పిటల్‌ఖోరా గుహలందు కానవగును. తర్వాత ఉదయగిరిగుహలందును, సాంచీతోరణములపయినను, అటు తర్వాత కొలదిగా అమరావతిశిల్పములందుసయితము అనేక ఇతరచోట్లనుకూడ కానవగును. పిటల్‌ఖోరాగుహలందు మలచియున్న ఈపక్షముల జంతురూపములు చాలవరకు పరిషియాయందు అంతకుపూర్వమే శిల్పమందిన రూపములను అనుసరించినమాట వాస్తవము. ఈరూపములు ఆగుహాలయాందు స్తంభశిరస్సులపైన బోధికలుగా ఏర్పడి ఉన్నవి. ఈ బోధికలక్రింద స్తంభములందు మలిచిన అలంకారభాగముసయితము బోర్లించిన గంటవలె ఏర్పడుటయేకాక ఆగంటలమీద మలిచిన రేఖాలంకారములు సయితము సంపూర్ణప్రాచీనపరిషియాశిల్పశైలిని స్మృతికి తెచ్చును. బహుశా ప్రచారమునకయి దేశదేశములు పర్యటనమొనరించిన బౌద్ధులు ఈ శిల్పవాస్తురూపములను పరిషియాయందు చూచి, అలంకారవిశేషములుగా మన దేశమందు ప్రవేశపెట్టియుండవచ్చును. కాని ఈ రూపములు సాంచీతోరణములమీద వాలునప్పటికే, పరిషియాకళలన్నియు వాటియందు నశించి, పూర్ణభారతస్వరూపము నందికొన్నవి. ఆంధ్రశిల్పులు ఈ రూపమును అతిదివ్యముగా చేశియమొనర్చి, మన శిల్పమందు అలంకారయుత మొనరించినందులకు శ్లాఘనీయులని వేరుగా చెప్పనక్కరలేదు. కాని కొందరు పాశ్చాత్యవక్తలు అన్నరీతిన ఈ రూపములు మన శిల్పములందు కల్పించిన కారణముననే మన దేశీయులు శిల్పమును పరిషియా, బక్త్రియా మొదలయిన విదేశములనుండి నేర్చికొనిరనుట చాల పొరపాటు.

సాంచీతోరణములపైన రచనలయిన కల్పవృక్షములు, కల్పలతలుసయితము చాల అద్భుతమయినవి. సంప్రదాయము ననుసరించి, రాజప్రాసాదమున, సింహాసనమునకు వెనుకభాగమందు కుడ్యముపై శుభసూచకముగాను, అలంకారయుతముగాను ఈ కల్పవృక్షములను చిత్రింపవలసియున్నది. కాని నిజస్వేచ్ఛానువర్తిని బడసిన అంతర్యము కలిగిన ఆంధ్రశిల్పులు ఈ కల్పలతను ఇచట స్తూపాలంకృత మొనర్చి, ఆ కల్పలతలకే నూతనశోభను కల్పించిరి. వివిధపుష్ప, ఫల, జంతు, నర, దేవతాస్వరూపములు ధరించి, అభరణయుతమయిన ఈ కల్పతరువుభావన అతిసుందరమయినదని వేరుగా చెప్పనక్కరలేదు. నిశ్చయముగా పట్టి అలంకారయుతమయినను, సాంచీతోరణకల్పలతాకల్పనలందు మానవజీవిత లయగతులు కానవగును. అందుచేత పాశ్చాత్యపండితులకు ఇది జీవవృక్షముగా తోచి, వారలు దీనికి జీవవృక్షము (*Tree of life*) అని పేరిడుటకూడ జరిగినది. ఈ కల్పలతలు నిడివిగా నిలుచున్నరీతినేగాక, అడ్డముగ పాకుచున్నరీతి, సాంచీతోరణశిల్పులు అనేకవిధములుగా, అతిరమ్యముగా చిత్రించి, అలంకారయుత మొనర్చిరి. కల్పలత సర్వజీవ, వస్తు, పుష్ప, ఫలభరితము. కోరినదెల్ల ధరించగలిగినది ఈలత. ఎందుకన ఇది కల్పవృక్షము. సాంచీతోరణములమీది కల్పలత ఒకొక్కప్పుడు బుద్ధపాదచిహ్నములందును, మరొకప్పుడు భద్రఘటమందును అంకురమంది భావగర్భితమయినది. బుద్ధుడు సర్వాభీష్టసిద్ధిప్రదాత. గౌతమజననము భూలోకమున వృక్షాం

కరమువంటిది. సాంచీతోరణశిల్పములయిన తర్వాత దాదాపు రెండువందలసంవత్సరములకు ఉదయించిన నవ్యభావపరిణతిబీజములు ఈ కల్పలతారూపములు రచించిన సాంచీనాటి కళాకర్తల ఆంతర్యమందే మనము వీక్షించగలము. నిజము ! గౌతమబుద్ధుడు పూజార్హత గలిగిన దైవసమాను డను భావమే మహాయాన మతమునకు మూలభావము. నిశ్చయముగ సాంచీతోరణ శిల్పములు, నిర్ణయనుతానుసరణయే ప్రాధాన్యముగ గొన్న ద్వితీయశ్రేణికి చెందు కళాకర్తల ఆంతర్యవికాసములుకాక, నవ్యమతములను ప్రేరేపింపగలుగు ఉత్తమ కళాకర్తల మహదాంతర్యములే అని ఎరుగవలెను.

వీటన్నిటిని మించి, అతిదివ్యమయిన బహుళ సంకలనచిత్రములు ఈసాంచీతోరణములమీద కలవు. ఈ మహాకల్పనలు అనేకరూపములు కలిగియున్నప్పటికిని ప్రతిభాగము తనుకీతిన ఏర్పడి, పూర్ణముగా ఏక జీవము కలవయి, అతిసరసముగా ఉన్నవి. ఇందు ముఖ్యముగా గమనింపదగినవి బుద్ధుని అస్థికలనుగూర్చిన సమర చిత్రము చద్దంతజాతకశిల్పము.

గౌతమబుద్ధుడు మహాపరినిర్వాణమయినతర్వాత ఆయన అస్థికలకొరకు రారాజులు మహాసమరములను సల్పిరి. ఈ సమరములు గౌతమబుద్ధుని ఆధిక్యతను నిస్సందేహముగ తెలుపునవై ఉన్నవి. సాంచీతోరణ శిల్పమునయితము ఈభావమును స్పష్టముగా విదితమొనరించుచున్నది. ఈ అస్థికల సమరచిత్రమందు చతురంగ బలసమేతుడయిన రాజు కోటను ముట్టడించిన విధము అతిరమ్యముగా చిత్రితమయినది. ముట్టడిచేసిన ప్రచండవాహిని ఉరవడి ఈ చిత్రమందు అతిస్పష్టముగా నిర్దేశమందినది. ఆనాటి ఆంధ్రశిల్పి గృహాంతరమున పట్టి కుంచె వాడించు సామాన్యజీవిగాక, సమర ఆంతర్యము నెరిగిన మహాయోధుడు. ఇంతేగాక, ఆ దివ్యఅస్థికల అపారవిలువ వాహినిని నడుపు రారాజు హృదయమునే గాక, తద్వాహినిభాగములయిన ప్రతి సైనికుని గజ, తురగహృదయములను సయితము ఆవరించియున్నరీతి ఆశిల్పులు చిత్రించిరి. నిశ్చయముగా, ఈశిల్పమునందు కొంతవరకు నాటి ఆంధ్రహృదయము గోచరించును. నాడు సామ్రాజ్యమును అనంతముగ విస్తరింపజేయుచున్న ఆంధ్రులకు సమరము కేళీవినోదము. సమరాంతర్యమున అశోకుడు తిలకించిన ఘోర పరిణామముగాక, సమరమందు స్వర్గశోధను ఆ శిల్పి తిలకించెను. మహాత్కార్యములకొరకు సమరము కళ్యాణ మయమయిన అహింసాతత్వమే. ఇందు బీభత్సము ఏమాత్రము లేదు. ఉత్సాహపరమయిన వీరరసమే ధర్మ యుద్ధముల పరిణామము.

ఛద్దంతుడు షడ్వర్ణములతో ప్రకాశమానమయిన దంతములు కలిగిన గజేంద్రుడు. ఆరు వర్ణములు కలిగిన దంతములను ఆరుదంతములుగ కూడ అన్వయించెడివారు. అందుచేత ఈ గజరాజు పేరు షడ్దంతుడు, లేక ఛద్దంతుడు. ఇతని రెండురాణు లందు ఒకతె అసూయచే ప్రేరేపితఅయి, మరణించి, కాశీరాజుకూతురుగ జన్మించి, భర్తను చంపించి, పశ్చాత్తాపముచే మృతినొందెను. గౌతముడు ఒక జన్మమందు ఈ ఛద్దంతుడు. తన్ను పట్టిన వేటగానికి దంతములు రానందున, తానే యా దంతములను పెరికియిచ్చి, మృతినొందెను. ఈ జాతకచిత్రమందు ఏనుగుల రూపములే అతిరమ్యములు. ఇంతేగాక ఈ ఏనుగురూపము లందు గజాంతర్యగతులు పూర్ణముగా సూచనలయినవి. ముఖ్యముగా ఛద్దంతుని విశాలహృదయము, గజముల కాతనియం దున్న ప్రీతిప్రేమలు అతిస్పష్టము. ఆనాడు గజములను అతిగా వాడుచున్న ఆంధ్రునకు గజహృదయము చక్కగా తెలియును. సందేహము లేదు.

సాంచీతోరణశిల్పములందు ఏకరూపచిత్రములు కాని, సాముదాయికసంకలనచిత్రములుకాని ఆనాటికి హిందూదేశమున ఎరుగని, మించిన నేర్పుతో ఆంధ్ర శిల్పులు చిత్రించిరి. ఈ శిల్పములందు చక్కటి రూప భేద మేర్పడి, ప్రతిజంతువు, వస్తువు, వృక్షము, వివిధ మనుష్యులు, జాతులు స్పష్టముగా తెలియనగుటయే కాక, వాటివాటి అంతర్నైజములతోసహా నిజలావణ్య పరముగా మనము ఎరుగగలము.

ఈ అయిదుతోరణములమీది సర్వశిల్పశ్రేణిని వర్ణించి చర్చించుటకు ఒక మహాగ్రంథము చాలదు.

మహాపండితులయిన కన్నింగుహాము, ఫెర్గూసను, మార్షలు మొదలయినవారు ఈ స్తూపముల తోరణములనుగూర్చి చిత్రసమేతముగా మహోద్గ్రంథములను రచించి ప్రకటించిరి. భారతీయశిల్పమందు సాంచీతోరణశిల్పములకు ఒక ప్రబల స్థానము కలదు. శిల్పములకు శోభనిచ్చి, సజీవము చేయుటకు లావణ్యము, రేఖావిన్యాసము ప్రబలఅంగములని నిర్వచించిన ప్రథమశిల్పము లివి. ఏలనన ఈ శిల్పాంగద్వయము అంతకుపూర్వము రచనలయిన ఏశిల్పము లందును స్పష్టపడక, ఈశిల్పములతరువాత రచనలయిన సర్వభారతశిల్పములందును అంగీకరితులుగా ప్రకటితమయినది. ఇంకను ఆనాటివరకు ఎరుగని అనేక కల్పన, సంకలనపద్ధతులు శిల్పమునకు సృష్టించి రసవంతముగ నొనర్పగల గతులు ఈశిల్పములందు విదితమయినవి.

ఈ సాంచీతోరణ శిల్పములు ఆంధ్రశిల్పబీజ సంపద. అంతకుపూర్వమునుంచి ఆంధ్రులు శిల్పములను రచించుచున్నప్పటికి, నిజఆంధ్ర ఆంతరంగికగతిఅయిన విలాసమయరతిభావగతి ప్రథమమున ఈశిల్పములందే విదితమయినది. ఈ దివ్యగతి తరువాత ఆంధ్రశిల్పమునకు ప్రధానగుణమయినది. రతి లేనిది ప్రకృతివికాసమే లేదని ఆంధ్రుడు అనాదినే గుర్తించెను. ఆనందమయమయినది ఆంధ్రహృదయము. అందుచేత విలాసమయ రతిభావము ఆంధ్రకళ నంటియేయుండును. తప్పదు! శిల్పమందు ఆనాడు ఆంధ్రశిల్పి విదితమొనర్చిన ఈ గతి అనుగమనము ఎరుగుటకు సాంచీతోరణములపైన వెలసిన ఏకయక్షిణిరూపము చూచినను చాలును.

సాంచీతోరణములపైన వెలసిన ఆంధ్రకళ ప్రసారము అతివిశాలమయినది. ఆనాటినుండి ఆంధ్రశిల్పము దేశదేశముల వ్యాపకమగుటయేగాక, స్వరూపాంతర్గతులందు నయితము అతిశయింపసాగినది. చివరకు క్రీస్తుశకతరువాత రెండుమూడు శతాబ్దములందు అమరావతిస్తూపముపైన ఆంధ్రకళాస్వరూపము మహోత్కృష్టమయి, అద్వితీయమయిన అత్యద్భుతశిల్పములకు ఆలవాలమయినది. నాటినుంచి నేటివరకు రూపగతులందు నయితము అమరావతిశిల్పములను మించిన శిల్పములు ఎందును రూపొందలేదు అనుట ఏమాత్రము అతిశయోక్తి కాదు. అటుతర్వాత నిజముగా ఆంధ్రకళావ్యాప్తి అపరిమితము. కాని క్రమముగా ఈ కళాస్వరూపము రూపగతులందు క్షీణించి, చివరకు తానే అంకురింపజేసిన ఇతరకళావాహినులందు మిళితమయి అంతరించినవి. ప్రథమమున ఉండవల్లి గుహాలందు ఒక గతిన నిర్ణయమయిన ఆంధ్రవాస్తురూపము క్రీస్తుతర్వాత ఆరు ఏడుశతాబ్దములందు మహాబలిపురమున పల్లవకళగా రూపొంది, చివరకు దక్షిణమున ప్రచండకళావాహిని అయిన ద్రవిడకళాస్వరూపమందు అంతర్ధానమయినది. పశ్చిమమున ఆరుఏడుశతాబ్దములందు పల్లవవాస్తురూపములందే, ఎల్లోరాకైలాసగుహాయందు రాష్ట్రకూటకళగా రూపొంది, చివరకు పశ్చిమచాళుక్యకళాస్వరూపమున మహావాహిని అయి, అపారమయినది. తూర్పున జావాద్వీపములందు ఆంధ్రకళ ఆరు ఏడు శతాబ్దములందే బోరొబుదూరుస్తూపమందు, అజంతాయందు వికసించిన ఆంధ్రశిల్పశైలిని, ఘంటశాలస్తూపనిర్మాణక్రమమును, పల్లవవాస్తురూపములను ధరించి, చివరకు జావాకళావాహినియందు అంతర్ధానమయినది. అందుచేత అమరావతికద్ద ఉత్తమగతి అందుకొన్న ఆంధ్రకళావాహినిప్రసారము దాదాపు నాలుగయిదువందల సంవత్సరములే యని చెప్పవలెను.

సాంచీతోరణములమీద పుష్పించి, తర్వాత అమరావతీస్తూపముపైన ఫలించి మహోత్కృష్టరూపమును వహించినంతవరకు ఆంధ్రశిల్పవాహినిప్రసారగతి ఎరుగుటకు ఈ దివ్యకళాస్వరూపములు వెలసిన కొన్ని బౌద్ధగుహాలు గమనించిన చాలును. అందున ముఖ్యమయినవి కార్లీచైత్యగుహా, నాసిక, అజంతా, కన్హారీ గుహాలందు కొన్నిమాత్రమే అని చెప్పవచ్చును. అజంతా, కన్హారీ, నాసికగుహాలు సర్వము నిర్మాణమగుటకు దాదాపు ఒక వేయిసంవత్సరములు పట్టినది. అయిన అమరావతిశిల్పములతర్వాత కొంతకాలమునకు, ఈ గుహాలందు వెలసిన శిల్పసంతతియు వికసించిన ఆంధ్రశిల్పరూపమేకాని వేరు కాదు. (సశేషము)

కథానిక :

# కాగితం ముక్క

•

శ్రీ సోమర్ సెట్ మాఘం

ఎండ చాలా తీక్ష్ణంగా ఉంది. మెయిన్ రోడ్డు మీద జనసమ్మర్దం యింకా తగ్గలేదు. కారు హారన్ల మ్రోత, బళ్ల చప్పుడు, కూలీలు బరువులెత్తుకొని బాటసారుల్ని తప్పుకోమని అరిచే హెచ్చరికలతో రోడ్డు చాలా హడావిడిగా ఉంది. సింగపూరులో ఆంధ్ర, తమిళ, మలయాళీ, యూరోపియన్—ఒకరేమిటి అన్ని జాతులవాళ్లూ ఉంటారు. వీళ్ల కేకలతో రోడ్డు మరీ గంద్రగోళంగా ఉంది. బయట యింత గొడవగా ఉన్నా, 'రిప్లీ జాయిస్ అండ్ నేలర్ కంపెనీ' మట్టుకు అతిప్రశాంతంగా ఉంది.

జాయిస్ తన గదిలో కూర్చున్నాడు. ఎలెక్ట్రిక్ ఫాను బల్ల మీద తిరుగుతోంది. రెండు చేతుల వేళ్లూ కలిపి గడ్డాని కాన్చి జాయిస్ ఏమిటో ఆలోచిస్తున్నాడు. ఎదురుగుండా చెల్లాచెదురుగా ఉన్న లా రిపోర్టులమీదికి దృష్టి పోనిచ్చాడు. బీరువామీద తన పార్టీల పేర్లున్న చిన్న చైనాపెట్టెలున్నాయి.

తలుపు తట్టిన శబ్ద మయింది.

'లోపలికి రా' అన్నాడు జాయిస్.

ఒక చైనాగుమాస్తా వచ్చాడు. వచ్చి, 'క్రాస్బీగారు వచ్చారండి' అన్నాడు.

జాయిస్ గుమాస్తా చైనీయుడైనా కూడా స్వచ్ఛంగానూ, స్ఫుటంగానూ మాట్లాడుతాడు. ఇతని పేరు ఓంగ్-ఛి-సెంగ్. స్వంత ప్రాక్టీసు పెట్టాలనే ఉద్దేశ్యంతో యిక్కడ తర్ఫీదవుతున్నాడు.

జాయిస్ 'లోపలికి తీసికొనిరా' అన్నాడు.

క్రాస్బీ రాక గమనించి జాయిస్ లేచి ఎదురేగి చేయి పుచ్చుకుని తీసికొనివచ్చాడు. కూర్చోమని కుర్చీ చూపించాడు. జాయిస్ స్వతహాగా కొంచెం ముభావంమనిషి. రాబర్టు క్రాస్బీవంక మాట్లాడకుండా కాసేపు తేరిపారజూశాడు. క్రాస్బీ మంచి భారీమనిషి. సుమారు ఆరడుగుల ఎత్తు. బలిష్ఠంగా ఉంటాడు. రబ్బరుతోటలో రోజస్తమానం పని చేయడంవల్ల ఎండకి మొహంమాడింది. ఒక్క దెబ్బతో తనను చంపెయ్యగల దనుకునిఉంటాడు జాయిస్. అతని విశాలమైన నేత్రాల్ని చూడగానే అతను చాలా మర్యాదస్థుడని చెప్పెయ్యగలం. కాని యిప్పుడవి చింతాక్రాంతము లయి ఉన్నాయి.

'రెండుమూడురోజుల్నించీ నిద్రలేనట్టున్నా' రన్నాడు జాయిస్.

'అవును.'

జాయిస్ క్రాస్బీదుస్తులు చూడగానే టెన్నిస్ కోర్టునించి యిలా వచ్చాడని గ్రహించాడు.

'నే నడిగే ప్రశ్నలకి జవాబివ్వడానికి సిద్ధంగా ఉండాలన్నాడు' చిరుకోపం ప్రకటిస్తూ.

'సిద్ధంగానే ఉన్నాను.'

'మీఆవిడ నివాళ చూశారా?'

'లేదు. యిప్పుడు పోవాలి. ఆవిడ నరెస్టు చెయ్యడం శుద్ధ తెలివితక్కువపని!'

'అలా. వాళ్లప్పుడు చేసితీరాలి.'

'జామీనుమీద విడుదలచేస్తా రనుకున్నాను.'

'చాలా పెద్ద నేరం మరి.'

'నా ఖర్మ! ఏడ్చినట్టుంది వాళ్ల పని. ఏ స్త్రీ అయినా ఆమెలాగే ప్రవర్తిస్తుంది. కాని నూటికి తొంభైమందికి ధైర్యం చాల దంతే. ఆమె చాలా అసాధారణమైనది.

ఆమె అనవసరంగా ఈగనైనా హింసించదు. ఇరవై ఏళ్లనించీ ఆమెతో కాపరంచేస్తున్నా నా కామాత్రం తెలియదూ? నే నేకనక అక్కడ ఉంటేనా నిమిషమైనా తటపటాయించకుండా యిట్టే పీకనులిమి అవతల పారేసేవాణ్ణి. నువ్వయినా అంతే చేద్దువు.'

'అంతేలేవోయ్. అందరూ నీపక్షమే. హేమండు నెవరూ వెనకేసుకురావడం లేదు. ఆమెను తేలిగ్గా విడుదలచేస్తారు. జడ్జీ ఆమె నిర్దోషనే నిర్ణయిస్తాడని నా గట్టినమ్మకం.'

'జరిగినదంతా ఒక తమాషా అనుకో. ఆవిడ నరెస్టుచెయ్యడం అనవసర మసలు. జామీనున్నా విడుదలచేయననడం అన్యాయం. సింగపూరులో ఆమెని మెచ్చుకోని మనిషిని చూడలేదు నేను! అందరూ ఆమె మంచిపని చేసిం దంటున్నారు. అలాటప్పుడు జామీనుమీద కూడా విడుదలచేయకుండా యిన్నాళ్లు ఖైదుచేయడం వట్టి అన్యాయం' అని రాబర్టు గట్టిగా అరిచాడు.

'రూల్సు మరి. ఆవిడ చంపానని చెప్తోంది. మరి కోర్టువా రప్పుడు ఖైదు చెయ్యకతప్పదు. రూల్సు ప్రకారం పోవాల్సిందే. నాకూ చాలా విచారంగా ఉంది యీ సంగతి తలచుకుంటే. కాని ఖూనీ జరిగిం దంటే కేసుతప్పదు.'

'అలాటి దుర్మార్గుణ్ణి అంతమొందించడంకూడా నేరమేనా? కుక్కని కాల్చినట్టు కాల్చి చంపింది.'

జాయిస్ కుర్చీ కానుకుని మాట్లాడకుండా ఆలోచిస్తున్నాడు.

'నేను నీతరఫు ప్లీడర్ని. నీకోసం కోర్టులో నేను వాదిస్తాను. నీ కాదుర్దా కలిగించే విషయం ఒకటి ఉంది. అది చెప్పకపోతే నీ కన్యాయం చేసినవాడి నవుతాను. నాధర్మం నెరవేర్చినవాణ్ణి కాను. ఆవిడ హేమండు నొక్కసారి కాలిస్తే చెల్లికుంటేది కాదు. ఆరుసార్లు కాల్చి చంపింది. దాంతో ఎక్కడలేని గొడవా వచ్చింది.'

'ఆవిడ చెప్తోందిగా కారణం. ఆవిడే కాదు, ఆ పరిస్థితిలో ఉన్న ఎవరైనా అలాగే చేద్దురు!'

'ఔను లెండి. ఆమె చెప్పిన కారణం సహేతుకంగానే ఉందనుకోండి. కాని అవతలపార్టీవారు అలా ఆలోచించరు. వాళ్లస్థానంలో మనం ఉన్నట్టు ఆలోచించుకొని మంచీ చెడ్డా రెండువైపులా చూసుకుంటే మంచిదికదూ. నేనే గవర్నమెంటు ప్లీడర్నయితే ఈ పాయింటు నే పీకతూలాడుకూ వాదించేవాణ్ణి. కీడెంచి మేలెంచమన్నారు.'

'అది వట్టి తెలివితక్కువతనంతపని.' జాయిస్ కళ్లు చిన్నవి చేసి రాబర్టుకేసి చూశాడు. రాబర్టు మంచివాడేకాని ఏమాత్రం బుర్ర లేదని అభిప్రాయపడ్డాడు. అతని పెదవులలో నవ్వు తొణికిసలాడింది.

'నువ్వన్నట్టు ఇదేమంత ముఖ్యమైన విషయం కా దనుకో. కాని ఎందుకైనా మంచిదని చెప్పానంతే. కొద్దికాలంలోనే విడుదలచేస్తారు. హాయిగా ఎక్కడికైనా పోయి కులాసాగా కాలక్షేపం చెయ్యండని సలహా యిస్తానప్పుడు. విడుదలచేస్తారని నమ్మకం ఉన్నా, 'కేసు-విచారణ' అంటే ఖంగారు వస్తుం దనుకో. పాపం! తర్వాత మీరు చాలాకాలం విశ్రాంతి తీసుకోవాలి.'

క్రాస్బీ మొదటిసారిగా నవ్వాడు. అలా నవ్వుతోంటే అతని సరళస్వభావం సుస్పష్టమౌతుంది.

'దానికన్నా నాకు కావాలి విశ్రాంతి. నా కాశ్చర్యం వేస్తోంది. భలే తమాషాగా, చాలా గంభీరంగా ఉంది.'

'నాకూ ఆశ్చర్యంగానే ఉంది ఆమె ఎలా భరిస్తోందా అని. అంత ధైర్యస్థురాలని నే నెన్నడూ అనుకోలేదు సుమా!'

ఆమె అరెస్టయినప్పటినించీ జాయిస్ ఆమెను చాలాసార్లు కలుసుకున్నాడు. ఆవిడకి కావలసిన వసతులన్నీ చేసినా ఖూనీనేరానికి తీర్పుచెప్పేదాకా జైల్లో ఉండడమంటే అధైర్యపడాల్సిన విషయమే. కాని ఆమె చాలా ధైర్యంగా, మనసుదిటవుతో ఉంది. సాధ్యమైనంతవరకు ఏదో పని కల్పించుకుని కూర్చునేది. జైలుఅధికార్ల అనుమతితో పుస్తకాలు చదువు

కుంటాడో, లేక కట్టుకుంటాడో ఆమె కాలం గడుపు తూంది.

జాయిస్ వచ్చేటప్పటికి ఆమె చక్కగా ముస్తాబై ఉంది. మామూలుధోరణిలో జరిగిన సంగతంతా చెప్పింది. ఆ విషాదగాథంతా ఆమె అలా చెప్తూంటే అతని కాశ్చర్యమేసింది. కథలా ఆవిషయమంతా చెప్తూంటే ఆమెలో ఏదో శక్తి ఉందను కున్నాడు జాయిస్. ఏమాత్రం ఆవేశం లేకుండా ఆమె జరిగిన ఘట్టాన్ని వివరిస్తుంది. తల్లితండ్రుల సుశిక్షణాప్రభావ మనుకున్నా డామెను చూసి జాయిస్.

ఆమెను జాయిస్ కొన్ని ఏళ్లతరబడి ఎరుగును. సింగపూరువచ్చినపుడు వీళ్ళింట్లోనే భోంచేసేది. ఒకటి రెండుసార్లు వీళ్ళింట్లోనే మకాం చేసిందికూడా. జాయిస్ భార్య కామె స్నేహితురాలు. ఇద్దరూ పది హేనురోజులు చాలా సరదాగా సింగపూరులో గడి పారు. అప్పుడు హామండుని చాలాసార్లే కలుసు కున్నారు. హామండుకీ రాబర్టుభార్యకీ చాలాకాలం నించే పరిచయం ఉంది. జాయిస్ని రాబర్టు బాగా ఎరుగును. అందుకనే హత్యజరిగినవెంటనే సింగపూరు పరుగెత్తుకు వచ్చాడు. లబోదిబోమంటూ వచ్చి జరిగిన యావద్వృత్తాంతమూ పూసగ్రుచ్చినట్టు చెప్పి, యీ కేసుని ప్రత్యేకశ్రద్ధతో తన విషయంగా భావించు కొని చూడమని కోరాడు క్రాస్బీ.

లేలీ—రాబర్టుభార్య అప్పుడు ఏమని చెప్పిందో అదేవిధంగా, ఒక్క పిసరైనా మార్చకుండా చెప్తోంది యిప్పటివరకూ. ఈ ఘోరకృత్యం జరిగినవెంటనే చెప్పి నప్పుడుకూడా ఆమెస్వరం అతిశాంతంగా ఉంది. యిప్పుడూ అలాగే ఏమాత్రం ఆవేశంలేకుండా, కథ లాగా శాంతంగా చెప్పుకుపోతుంది. ఖూనీకి ముందు జరిగిన విషయం, అంటే హామండుఅసభ్యప్రవర్తన చెప్పేటప్పుడుమాత్రం ఆమె సిగ్గుపడుతుంది. చెక్కిళ్లు, మొహం ఎర్రబడిపోతాయి. ఆమె కిలాటి పని జరుగు తుందని ఎవరూ అనుకోరు. ఆమెకి దాదాపు ముప్ఫై ఏళ్లుంటై. పొట్టీ కాదు, పొడుగూ కాదు. అందంగా ఉంటుందనడంకన్న ఠీవిగా ఉంటుందని చెప్పడం సమంజసం.

చాలా సన్నగా ఉంటుంది. బొమికలు లెక్క పెట్టవచ్చు. వంకీలు తిరిగిన పెద్దజుట్టు. శ్రద్ధతీసికొంటే ఆమె చాలా అందంగా ఉండేదే. కాని ఆమె అందా నికి ప్రాముఖ్యత యివ్వదు. మంచిసరదా అయిన మనిషేకాని సిగ్గెక్కువ. మాట్లాడ్డానికి చాలా సిగ్గు పడేది. ఆమెకు పిల్లలతోటే సరిపోతుందిట. జాయిస్ భార్య 'లేలీ మంచిగృహిణి' అని భర్తతో యిదివరకు చెప్పింది. ఆమెను చూసి అందరూ అనుకునేదానికన్న ఆమెలో ప్రత్యేకత చాలా ఉందని జాయిస్ భార్య అంటుంది. ఆమె హత్య చేసిందంటే ఆమెని తెలి సినవా రెవరూ నమ్మరు—నమ్మలేరు.

రాబర్టుకి ధైర్యం చెప్పి పంపేశాక జాయిస్ యివన్నీ ఆలోచిస్తూ కాగితాలు తిరగేస్తున్నాడు. అప్రయత్నంగా, ఆలోచించకుండా అనవసరంగా పేజీలు త్రిప్పుతున్నాడు. జరిగిన సంగతులన్నీ తనకు కంఠస్థమేగా! ఈ సంఘటనవలన ఊళ్లో పెద్ద అలజడి బయల్దేరింది. సింగపూరులో ఎక్కడ చూసినా దీన్ని గురించిన సంభాషణే వింటాం.

క్రాస్బీభార్య చెప్పిన ఉదంతం చాలా చిన్నదే. ఆనాడు వ్యాపారంవిషయమై క్రాస్బీ సింగ పూరు వెళ్లాడట. యింట్లో భోజనా లయేటప్పటికి తొమ్మిదయింది. పిల్లలంతా నిద్రపోతున్నారు. ఆమెకు నిద్రరాకపోవడంచేత లేసల్లుకుంటూ కూర్చుంది. బంట్రోతులుకూడా పడుకోవడానికి పోయారు. యింట్లో తను తప్ప రెండోవారెవరూ లేరు. కాసేప టికి బూటుచప్పుడైంది. ఎవరయివుంటారా అని ఆలోచిస్తూవుంటూంటేనే ఆ మనిషి మెట్లదాకా వచ్చే శాడు. చీకట్లో గుర్తించడం కష్టమైందామెకు. బుడ్డి దీపందగ్గర కూర్చుంది. ఆవ్యక్తి 'నే రావచ్చునా!' అని ప్రశ్నించాడు. లేలీ గొంతుకకూడా గుర్తుపట్టలేక పోయింది.

'ఎవ' రండి.

'హామండు'నని ఆవ్యక్తి మారుపలికాడు.

'నిరర్థకంతరంగా రావచ్చు'నందామె. కూర్చో మని ఆహ్వానించింది. ఆమెకీ, రాబర్టుకీ కూడా హేమంతుతో పరిచయం తక్కువ. అందుకని యింత ప్రొద్దుపోయాక రావాల్సినంత పని ఏముందని ఆమె ఆశ్చర్యపోయింది. హేమంతు రబ్బరుఎస్టేటు మేనేజరు. రబ్బరు ఎస్టేటు ఎనిమిదిమైళ్లదూరంలో ఉంది! యింత దూరం నించి యిప్పు డెందుకు వచ్చాడా అని విస్తుపోయి, ఆమె 'రాబర్టు లేడు. సింగపూరు వెళ్లా'డని చెప్పింది.

హేమంతు తను ఎందుకు వచ్చాడో అడుగుతోం దనుకుని—'ఒంటరిగా ఉంటే ఏం తోచలేదు. మీ రేం చేస్తున్నారో చూసిపోదామని వచ్చా' నన్నాడు.

'ఎలా వచ్చారు? కారుచప్పుడైనా వినపడ లేదే?' అం దామె ఆశ్చర్యపడి.

'నిద్రపోతున్నా రేమో, లేపినవాడి నవుతానని రోడ్డుమీద ఆపివచ్చా' నన్నాడు.

అది నిజమే కావచ్చు. తెల్లవారుఝామునే రబ్బరుతోటలోకి వెళ్లి పనిచేయటంవల్ల సాయంత్రం రాగానే అలసిపోయి రబ్బరుతోటపనివారందరూ నిద్రపోతారు. ప్రొద్దున్నకి హేమంతుకారు రోడ్డుమీదే ఉంది. హేమంతుకి ముప్పైఏళ్లుంటాయి. కాని పసిపిల్లాడిలాగ వచ్చాడుట. అతనికి కాలనీలో చాలామంది స్నేహితు లున్నారు. యుద్ధానికి వెళ్లి మంచి పేరు తెచ్చుకున్నాడు. మోకాలికి దెబ్బ తగలటంచేత రెండేళ్లవరకూ సైన్యంలోకి వెళ్లలేడు. అందుకని రబ్బరు తోటలో ప్రవేశించాడు. బిలియర్డ్సు బాగా ఆడతాడు. టెన్నిస్ బాగా ఆడేవాడు. కాని కాలుమూలాన యిదివరకులా ఆడలేడు. హేమంతంటే అందరికీ అభిమానమే. పచ్చటి ఛాయ. నల్లటిజుట్టు. తీరైన ముక్కు. పొడుక్కి తగిన లావుగా ఉంటాడు. హేమంతు అన్ని విధాలా మంచివాడేగాని బుద్ధి మంచిది కాదు. ఈ గుణమే అతని కొంప తీస్తుందని అందరూ అనుకునే వారు. చివర కలాగే అయింది. కాసేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు. లేఖ తల్లికి పంపించవలచింది. అందుకని కుట్టుకుంటూనే మాట్లాడింది.

'ఆ జోడు పెట్టుకుంటే బాగులేదు. అందమైన వాళ్లు మామూలుగా ఉండడానికి ప్రయత్నిస్తారు. ఎందుకో నా కర్థమవ'దన్నాడు.

ఆమె చకితురాలైంది. హేమంతు ఎప్పుడూ యిలాగ తనతో మాట్లాడలేదు. ఏమీ అనకుండా ఉండడమే ఉత్తమ మనుకొని ఆమె మాట్లాడకుండా ఊరుకుంది.

'నేనేం పెద్ద అందగత్తె ననుకోవడం లేదు. నిజం చెప్పాల్సివస్తే నువ్వు నన్నందంగా ఉన్నానన్నా వకటే, అసహ్యంగా ఉన్నానన్నా వకటే' అంది.

'అసహ్యంగా లేవు. అందాలరాణీలా వున్నా' వన్నాడు.

'అలాగయితే నీకు కొంచెం వెర్రి ఉందనుకుంటాను' అని వెటకారంగా నవ్వింది. హేమంతు లేచి ఆమెప్రక్కన ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

'ను వ్వీప్రపంచంలో అందరికన్నా అందమైన దానివని అందరూ ఒప్పుకుంటారు. ఎవరూ కాదనలే' రన్నాడు.

'పిచ్చివాడిలా వాగకు. యిందాకా ఎక్కడ కూర్చున్నావో అక్కడికి వెళ్లి కూర్చో. లేకపోతే యింటికి దయచెయ్యవాల్సొస్తుం' దంది.

అతను కదల్లేదు. 'నువ్వంటే నా కెంత ప్రేమో తెలుసా' అన్నాడు.

'ఊహు. నేను నమ్మను. నిజంగా ఉన్నా నా కక్కర్లేదు. నీ ప్రేమ నా కనవసరం. నువ్వు చెప్పక్కర్లే'దని ప్రశాంతంగా అంది.

ఏళ్లనుంచీ ఒకరికొకరు తెలిసినా హేమం తెన్నడూ యిలా ప్రవర్తించలేదు. అతని ధోరణి కామె ఆశ్చర్యపోయింది. హేమంతు యుద్ధంనుండి వచ్చినప్పట్నుంచీ వారికి పరిచయం ఉంది. అతనికి జబ్బుచేసినప్పుడు తల్లికన్నా ఎక్కువగా సాకి చాకిరీ చేసింది. యింటికి తీసికొనివచ్చింది. అప్పుడు పతి హీనురోజా లున్నాడు. తర్వాత పరిచయం తగ్గిపోయింది. క్రితం రెండేళ్లనించీ అసలు రాకపోకలు లేవు. ఏ రబ్బరుప్లాంటరు యింటికి వస్తేనో యిద్దరూ

కలుసుకునేవారు. అతన్ని చూసి కొన్నాళ్లయింది. వాలకెందుకో మనిషి అదోలాగ ఉన్నాడు. ఎందుకో చూస్తే ఆమెకు భయం వేసింది.

బల్లమీద సోడాబుడ్డీ యిట్టే ఖాళీచేశాడు.

'నేనయితే యింత తాగేదాన్ని కానంది.

'నేను తప్పతాగి మాటాడుతున్నా ననుకున్నావా?'

'ఇంకా అనుమానమేనా?'

'నిన్ను మొదట చూసినప్పుడే నాలో ప్రేమ అవతరించింది. ఇన్నాళ్లూ నా హృదయఫలకంమీద చిత్రించుకుని ఆరాధిస్తున్నాను. నాలిక కట్టుకుని కూర్చున్నాను. ఇంక ఉండబట్టలేను. నువ్వే నా ప్రాణం. నా సర్వస్వం. నా ప్రాణం అర్పిస్తాను నీ కోసం!'

ఆమెకు చికాకు వేసింది.

'శలవండి' అంది యింక వెళ్తానని.

'నే నిప్పుడే కదలను' అన్నాడు.

ఆవిడకి ఒళ్లుమండింది.

'నేను రాబర్టునితప్ప ఎవరినీ ప్రేమించడం లేదు. తెలిసిందా? రాబర్టుని ప్రేమించినా ప్రేమించక పోయినా నిన్ను మట్టుకు ప్రేమించడం లేదు. అంత మట్టుకు ఖచ్చితంగా చెప్పగలను. తెలిసిందా? నువ్వంటే నాకు గడ్డిపరకతో సమానం'

'అయినా పర్వాలేదు. రాబర్టుకూడా లేడుగా.'

'మర్యాదగా నువ్వు వెళ్లకపోతే బంట్రోతులచేత గెంటిస్తాను.'

'కుపాకి వేసినా రానంత దూరంలో ఉన్నారు వాళ్లు.'

ఆవిడకి కోపం వచ్చింది. బంట్రోతుని పిలవడానికి వరండాలోకి వెళ్లింది. హోమండు ఆమెభుజం పట్టుకున్నాడు.

'వదులు' అందామె కోపంగా.

'ఉండు కాసేపు' అన్నాడు.

ఆమె బంట్రోతుని పిలిచింది. హోమండు నోరు మూశాడు. చేతుల్తో ఆమె నెత్తివేసి పడకగదిలోకి తీసుకొనిపోయాడు. తర్వాత ముద్దులవర్షం ఏకధారగా కురిపించేశాడు. ఆమె ఆధాటి కాగలేకపోయింది. పెనుగులాడింది.

'నన్ను వదులు, తుచ్ఛుడా!' కోపావేశంలో ఆమెకేం తెలియడం లేదు. అతను దీనంగా అర్థిస్తున్నాడు. ఆమె పెదవులు మండిన ట్లనిపించింది. పశువుతో పిట్ట పోరాడగలదా! అతని మొహం కామపిపాసతో జేవురించింది. చేతుల్తో ఎత్తి మంచంమీదికి తీసికొనిపోతూన్నప్పుడు బల్ల అడ్డంవచ్చింది. కాలికి దెబ్బతగిలింది. ఇదివరకు గాయంపడిన కాలేమో— అందులో చేతుల్లో బరువుకి తాళలేక వెనక్కి పడ్డాడు. వెంటనే ఆమె సోఫాదగ్గరకి పరుగెత్తింది. అతను వెంబడించాడు. బల్లమీద రివాల్వరు ఉంది. అంత బలహీనంగా, సన్నంగా ఉన్నా ఆమెకి దాన్ని చూడగానే ఎక్కడ లేని శక్తి వచ్చింది. రాబర్టు లేడు కదా, ఎందుకైనా మంచిదని పడకగదిలో రివాల్వరు వుంచుకుంది. ఆమెకి కోపంతో పిచ్చెత్తింది. ఏం చేస్తోందో ఆమెకి తెలియడం లేదు. హోమండు వణకడం చూసింది. ఏదో అన్నాడు కాని ఆమెకి వినిపించలేదు. గదినుండి వరండాలోకి అలాగే—ఆ కుంటి కాలితోనే పరుగెత్తాడు. అతనివెంట ఆమె వెంబడించింది. అలా వెంబడిస్తూ పిస్తోలు పేల్చింది. పిస్తోలులో గుళ్లయేదాకా కాలుస్తూనే ఉంది. హోమండు రక్తపుమడుగులో పడి ప్రాణం వదిలాడు.

ఆ హడావిడి విని బంట్రోతులు పరుగెత్తుకు వచ్చారు. అప్పటి కామె చేతితో పిస్తోలు పట్టుకుని హోమండుప్రక్కన నిలుచుని ఉంది. ఆమె మాట్లాడకుండా వాళ్లకేసి నిశ్చలంగా చూసి తర్వాత గదిలోకి వెళ్లిపోయింది. వాళ్లు శవంకేసి తలెత్తి చూడలేకపోయారు. ఆవేశంలో గుసగుసలాడుకుంటున్నారు. కాసేపటికి వాళ్లలో పెద్దనౌకరు లేచి నిల్చున్నాడు. వీళ్లవద్ద కొన్ని ఏళ్లనుండి పనిచేస్తున్నాడు. రాబర్టు మోటారుసైకిలు సిద్ధంచేయమన్నాడు. రివాల్వరు జేబులో పెట్టుకున్నాడు. అసిస్టెంటు డిస్ట్రిక్ట్ ఆఫీసరు ముప్ఫయిమైళ్లదూరంలో ఉన్నాడు. ఆయనదగ్గరికి వెళ్లేటప్పటికి గంటన్నరయింది. అందరూ నిద్రపో

తున్నారు. రివాల్వరు చూపించి జరిగినదంతా చెప్పాడు బంట్రోతు. ఆయన బట్టలు మార్చి వెంటనే వాళ్లతో బాటే కారు వేసికొని వచ్చాడు. అప్పటికి తెలతెల వారుతోంది.

వాళ్లు రాబర్టుయింటిలో ప్రవేశించారు. బంట్రోతు ముందర వెళ్తున్నాడు. వెనక ఆఫీసరు నడుస్తున్నాడు. వరండాలో పడిఉన్న హోమండు శవాన్ని చూశాడు. చేత్తో ముట్టుకు చూశాడు. చల్లగా ఉంది.

'అమ్మగారేరీ' అన్నాడు దగ్గరఉన్న బంట్రోతుని చూసి. వాడు పడకగది చూపించాడు. ఆయన వెళ్లి తలుపు తట్టాడు. జవాబు రాలేదు. మళ్లా తట్టాడు.

'ఎవరం' దామె.

'నేను, విధర్స్నని' అన్నా డాఫీసరు.

కాసేపటి కామె తలుపు తెరచింది. ఆమె యింకా నిద్రపోలేదు. అతనికేసి నిశ్చలంగా చూసింది.

'మీబంట్రోతు నన్ను పిల్చుకుని వచ్చాడు. హోమండుని ఏంచేశారు?'

'నన్ను బలాత్కరిస్తే కాల్చి చంపాను.'

'ఆ! ఎంతపని జరిగింది! కూర్చోండి. జరిగిన సంగతంతా విపులంగా చెప్పండి.'

'క్షమించండి. యిప్పుడు కాదు. నేను చెప్పలేను. రాబర్టుకి కబురుచేయండి. వచ్చాక యిద్దరికీ చెప్తాను.'

విధర్స్న కుర్రవాడు. అనుభవం తక్కువ. క్రొత్తగా వచ్చాడు. ఇటువంటి పరిస్థితులలో ఏం చెయ్యాలో తెలియలే దతనికి. రాబర్టు వచ్చాక జరిగిన దంతా చెప్పింది. అప్పుడు చెప్పినట్టే యిప్పుడూ చెప్తోంది.

కాని లాయరుగారి దృష్టిలో చిక్కు తెచ్చే విషయం ఆమె హోమండుని ఒక్కసారి కాకుండా అరుసార్లు పేల్చడం! నాలుగుగుళ్లు దేహానికి దగ్గరగా తగిలాయి. హోమండు పడిపోయినప్పుడు దగ్గర నిల్చుని పేల్చిందని జవాబు చెప్పవచ్చుననుకోండి! కాని ఆమెకే తానేం చేసిందో జ్ఞాపకంలేదుట. అన్ని విషయాలూ అతిసూక్ష్మంగా జ్ఞాపకంఉన్న మనిషికి యిది జ్ఞాపకం లేకపోవడం చాలా ఆశ్చర్యమైన విషయం. అలాటి పొరపాటు ఈతీరుమనిషికి ఎన్నటికీ జరిగిఉండదు. జరిగిందన్నా ఎవరూ నమ్మరుకూడా! ఒళ్లు తెలియని కోపంలో అది తేం చేసిందో ఎరగదట. అంతకోపం ఆవిడకి వచ్చి ఉండదని జాయిస్ గట్టి నమ్మకం. ఆమె ఆవేశచిత్త కాదు. ఇన్నాళ్లనుండీ తెలిసిఉన్నా ఆమెసంగతి జాయిస్ ఎరగడా ఏమిటి! ఈ సంఘటన జరిగినతర్వాత యింతవరకూ ఆమె ఏమాత్రం అధైర్యపడకుండా ధైర్యంగా ఉంది. నిజం చెప్పాలంటే గౌరవకుటుంబీకులయిన స్త్రీలలోని కాఠిన్యం గ్రహించడం కష్టమనుకున్నాడు జాయిస్.

తలుపుతట్టిన చప్పుడైంది.

'లోపలికి రా' అన్నాడు జాయిస్. గుమాస్తా లోపలికి వచ్చి తలుపు దగ్గరగా వేశాడు. ఆయనదగ్గరకు వచ్చి 'మీతో కొన్ని రహస్యమైన ముఖ్యమైన సంగతులు మాట్లాడాలి, శ్రమ అనుకోకపోతే—'అని అర్థోక్తిలో ఆపాడు. జాయిస్కి నవ్వొచ్చింది.

'ఫరవాలేదులే. ఏమి టాసంగతి?'

'చాలా ముఖ్యమైనది, అతిక్లిష్టమైనది.'

'చెప్పేద్దూ.'

'క్రాస్బీకేసుకి సంబంధించినదండి.'

జాయిస్ ప్రశ్నార్థకంగా చూశాడు.

'దీనివలన వ్యవహారమంతా తలక్రిందవుతుంది.'

'ఏమి టాసంగతి'అన్నాడు విసుగ్గా.

'అతనికి ఆమె రాసిన ఉత్తరం.'

'ఇంతే కదా! ఏళ్లనుంచీ పరిచయం ఉన్నప్పుడామాత్రం రాతలు తటస్థిస్తయి'అన్నాడు. గుమాస్తాఅభిప్రాయముమీద జాయిస్కు కొంచెం నమ్మకం, గౌరవంకూడా ఉంది. అతని ఉద్దేశం వెల్లడించకుండా గుమాస్తాఅభిప్రాయం తెలిసికోడాని కలా అన్నాడు.

'మీ రన్నది నిజమే. భోజనాలకి ఆహ్వానించవచ్చును. సినిమాలకి పిలవవచ్చును. పండుగలకి రమ్మన

వచ్చును. అలాటి వ్యవహారసంబంధమైన ఉత్తరం కాదది. నేనూ మొదట మీలాగే అభిప్రాయపడ్డాను.' జాయిస్ మాట్లాడకుండా ఇదివరకులాగే రెప్పవాల్చకుండా చిరునవ్వుతో చూస్తూ—

'ఎవరు చెప్పారు' అన్నాడు.

'నా స్నేహితుడు.'

చెప్పమని బలవంతం చేయడంకన్నా విషయం తెలిసికోవడంలో జాయిస్ మంచి నేర్పరి.

'కొన్ని వారాలనించీ హోమండుని కలుసుకోలేదని చెప్పింది కదండీ. జ్ఞాపక ముందా!'

'ఉత్తర ముందా?'

'ఊహు'

'ఏమని ఉంది అందులో?'

'నకలు కాపీ ఉంది నాదగ్గర చూస్తారా?'

'యిలా తే' జాయిస్ చేయి చాచాడు. జేబులోంచి నలిగిన కాగితాల్లోంచి ఒక చీటీ తీసి యిచ్చాడు. అందులో ఈవిధంగా ఉంది:

'రాత్రి వెళ్లిపోతాడు. నిన్ను వెంటనే చూసి తీరాలి. పదకొండుగంటలకి వస్తా వనుకుంటాను. చాలా నిరాశతో ఉన్నా. రాకపోతే తర్వాతపరిస్థితులకి బాధ్యురాలను కాలేను. కారు వద్దు.'

పొడిఅక్షరాలతో సంతకం ఉంది. జాయిస్ 'ఆవిడే రాసిందని ఏమిటి నమ్మకం' అన్నాడు.

'నాకు నా స్నేహితుడిమీద నమ్మకం ఉంది. కావలిస్తే ఋజువుచేయవచ్చును. ఆమె నడిగితే నిజం తప్పకుండా తేలుతుంది.'

గుమాస్తామాటల్లోని వ్యంగ్యం జాయిస్ గ్రహించక పోలేదు.

'ఆవిడ అలాగ ఎన్నటికీ రాసిఉండ' దన్నాడు జాయిస్.

'అయితే చిక్కే లేదు. కాని ఇది గమనించవలసిన విషయం. నేను మీ ఆఫీసులో ఉన్నాను కనుక నేను చెప్తే మీరు గమనిస్తారని వాడు నాతో చెప్పాడు. లేక పోతే అదీపాటికి ప్రాసిక్యూటరు చేతుల్లో ఉండేదే.'

'అసలు కాపీ ఎవరిదగ్గర ఉంది?'

జాయిస్ ప్రశ్నలోని ప్రత్యేకత గమనించనట్టు గుమాస్తా ఊరుకున్నాడు.

'హోమండు మరణించినతర్వాత ఆయనకి ఒక చైనాస్త్రీ ఉండేదని తెలిసిందికదూ. ఆమెదగ్గరే ఉందది.'

ఇందువల్లనే హోమండు అంటే అందరికీ విముఖత కలిగింది. చాలా నెలలనుండీ ఆమె అతని యింట్లోనే ఉంటోంది.

కాసేపు ఇద్దరూ కూడా మౌనంగా ఊరుకున్నారు. ఒకరి నొకరు పూర్తిగా అర్థంచేసికొన్నారు.

'చెప్పడం మంచిదే అయింది. దీన్నిగురించి ఆలోచిస్తాను.'

'నాస్నేహితునితో చెప్పనా?'

'తరచు కలుసుకుంటో ఉండు.'

'అలాగేనండి.'

గుమాస్తా తలుపు దగ్గరగా వేసి వెళ్లిపోయాడు.

జాయిస్ ఆచీటీకేసి నిశ్చలంగా చూస్తున్నాడు. చూసినకొద్దీ అనేకఆలోచనలతో బుర్ర తిరిగిపోతోంది. అర్థంలేని అనుమానాలు చాలా వచ్చేస్తున్నాయి. ఆఖరికి ఆలోచించడం ఆపేద్దామని ప్రయత్నించాడు. అడిగితే ఆమె చెప్తుందేమోకాని అడగడ మెలాగ?

ఉత్తరాన్ని జేబులో పెట్టి టోపీ తీసికొని బయటికి వచ్చాడు.

'నే నిప్పుడే అలా వెళ్లి రెండునిముషాల్లో వచ్చేస్తాను' అన్నాడు గుమాస్తాతో.

'జార్జి రీడ్ వస్తే ఏం చెప్పమంటారు?'

'నాకు తెలియదను' అని నవ్వాడు.

గుమాస్తాకు తనెక్కడికి వెళ్తున్నాడో తెలుసునన్న సంగతి జాయిస్ ఎరుగును. ఈ హత్య వెలాండా ఫారూలో జరిగినా అక్కడ తెల్లవాళ్లకి జైలు లేనందున ఈమె సింగపూరు వచ్చింది.

జాయిస్‌ని చూసి ఆమె గదిలోకి వచ్చింది. పువ్వులాగ అతిశుభ్రంగా ఉంది.

'ప్రొద్దున్నే వస్తా రనుకోలేదండి.'

'ఎలా ఉన్నారు'

'కులాసాగానే ఉన్నా'నని నవ్వింది. ఆమె కళ్లు కాంతితో జిగేలుమన్నాయి.

'ఇంట్లో అయితే వీలుచిక్కేది కాదు. విశ్రాంతి తీసికోడానికి బాగుంటుంది యిక్కడ.'

బంట్రోతు వెళ్లిపోయాడు.

'కూర్చోండి' అంది.

అతను కూర్చున్నాడు. అసలువిషయం ఎలా ప్రారంభించాలో తెలియలే దతనికి. చాలా కష్టంగా ఉం దతనికి. ముళ్లమీదున్నట్టుం దతనికి. ఆమెఉదాసీనత చూసి అడగడానికి సంకోచించాడు. పెద్ద అందగత్తె కాకపోయినా ఆమెలో ఆకర్షణ లేకపోలేదు. పెద్దకుటుంబాల్లోని స్త్రీలకి ఉండే హుందా ఆమెలో ఉంది. ఆమెని చూడగానే ఆమె ఎట్టి వాతావరణంలో పెరిగిందో యిట్టే చెప్పగలం. అటువంటామె కీ తీవ్రమైన నింద మోపడం అన్యాయ మనుకున్నాడు.

'రాబర్టు వస్తా డనుకుంటా'నంది ఆమె తన సహజధోరణిలో. ఆమె చాలా తియ్యగా మాట్లాడు తుంది. ఆమె మాట్లాడుతుంటే వినాలనిపిస్తుంది.

'పాపం, చాలా శ్రమపడుతున్నాడు. కొద్ది రోజులలో అయిపోతుందంటే అమ్మయ్య అని పిస్తోంది.'

'ఇంక కొంచెం రోజులే లెండి.'

'రోజూ లేవగానే ఒకరోజు తగ్గిం దనుకుం టాను. స్కూల్లో చదివేటప్పుడు శెలవులు వస్తున్నా యంటే ఇలాగే లెక్క పెట్టుకునేదాన్ని.'

'అన్నట్టు అడగడం మరిచిపోయాను. హేమండూ, మీరూ కలుసుకొని కొన్ని వారా లైందికదూ!'

'అవును, టెన్నిస్ గ్రౌండులో కలుసుకోవడమే. తర్వాత ఆరాత్రి చూశా నతనిని. అప్పుడైనా మాట్లాడ లేదు. రెండుకోర్టు లవడంమూలాన మాట్లాం లేదు.

'ఆయన కేం ఉత్తరం రాయలేదుకదూ?'

'అబ్బే! లేదు'

'మీకు గుర్తుందా?'

'ఖచ్చితంగా ఉంది.' అంది నవ్వుతూ.

'ఏదేనా విందుల్లో, టెన్నిస్‌లో కమ్మనడానికి తప్ప వ్రాయడాని కేముంటుంది? అదైనా నేను రాసి అయిదు నెల్లయింది.'

'మీరిద్దరూ అంత చనువుగా ఉండేవారుకదా. అంతలో మూకీభావం వహించడానికి కారణం?'

'మన కూ మాకూ అభిప్రాయాల్లో చాలా భేదం ఉంది. జబ్బుగా ఉన్నప్పుడు చేసే సేవచేశాను; అప్పుడు చాలా దోస్తీగా ఉండేవాళ్లం. కాని రెండేళ్ల నించీ అతనికి చాలా పేరు వచ్చింది. అందరూ పిలిచే వారు. అందుకని మేం ఊరుకున్నాం.'

'అంతేనా?'

ఆమె కాస్త తటపటాయించింది.

'అతనికి చైనాస్త్రీతో సంబంధం ఉన్నట్టు తెలిసింది. రాబర్టుకి అతను యింటికి రావడం యిష్టం లేదు. నేనూ చూశాను ఆ చైనాస్త్రీని.'

జాయిస్ కుర్చీ కానుకుని గడ్డంక్రింద చేయి పెట్టుకుని ఆమెకేసి నిశ్చలంగా చూశాడు. ఆమెకళ్లు హఠాత్తుగా ప్రజ్వలించడం చూశాడు. కాని క్షణంలో అవి యథాస్థితికి వచ్చేశాయి. తాను చూసింది నిజమేనా అని ఆశ్చర్యపడ్డాడు.

మాటలు కూర్చుకుంటూ నెమ్మదిగా ఇలా గన్నాడు: 'మీ వ్రాలుతో హేమండుకు రాసిన ఉత్తరం ఒకటి దొరికింది.' ఆమెకేసి నిశ్చలంగా చూశాడు. ఆమె భయపడలేదు. చలించలేదు. జవాబు చెప్పడానికి కాసేపు ఊరుకుంది.

'ఇదివరకు తను సింగపూరు వెళ్లేటప్పుడు నాకు కావలసిన వస్తువులు తెమ్మని చీటీలు రాశాను.'

'రాబర్టు సింగపూరు వెళ్తున్నాడు కనుక రమ్మని రాసిన ఉత్తర మది.'

'వట్టి అబద్ధం. నే నలాటి దెప్పుడూ రాయ లేదు.'

'మీరే చూడండి' అని చేతిలో కాగితం తీసి యిచ్చాడు. ఆమె దానిని క్రీగంట చూసి తిరస్కార భావంతో తిరిగి యిచ్చేసింది.

'అది నా రాత కాదు.'

'అవును, ఇది నకలు కాపీ.'

మళ్లా తిరిగి చదివింది. మొహం పూర్తిగా పాలి పోయింది. నిలువునా వణికిపోతోంది. కళ్లల్లో నీరు తిరిగింది. జాయిన్ కేసి కళ్లు నప్పచెప్పి చూస్తోంది. శవం కేసి చూస్తున్నా ననుకున్నా డతను.

'ఇదేమిటి? దీని కర్థం లేదు' అని గాద్గదికంగా, తడిఆరిపోయిన బొంగురుగొంతుతో అంది. ఆమె సహజస్వరం కా దది.

'అదే మీరు చెప్పాల్సింది' అన్నాడు.

'నేను రాయలేదు. ఒట్టేట్టుకు చెప్తున్నాను.'

'సరిగా చెప్పండి. మీ దస్తూరితో అసలు కాపీ దొరికాక అనక విచారిస్తే ప్రయోజనం లేదు.'

'అది దొంగ ఉత్తరం. ఫోర్జరీ అయిఉండచ్చు'

'అలా బుజావుచేయడం కష్టం. ఈవిధంగా నిర్ధారణచేయడం సులభం.'

ఆమెదేహమంతా చెమటపోసింది. అరచేతులు బట్టతో తుడుచుకుంది. ఆమె మళ్లా దానికేసి చూసి—

'లేదే లేదు. ఏళ్లక్రితం రాసేనేమో. వ్యవధి యిస్తే ఆలోచించి చెప్తాను. ఆ పరిస్థితులు జ్ఞాపకం చేసుకుని చెప్తాను.'

'లేదే లే దనుకోండి. ప్రాసిక్యూటరుచేతిలో పడిందంటే నాఖర్లని నిలవదీసి హోమండుపోయినవాడు పంపారో లేదో రట్టించి విషయం లాగుతారు.'

ఆమె కూర్చున్న కుర్చీ ఫెడేలుమని చప్పుడైంది. మూర్ఛపోతోం దనుకున్నాడు. చేతులు గట్టిగా చప్పట్లు కొట్టి కుర్చీ వెనక్కి అన్చి—

'నేను రాయలేదని ఒట్టేసుకుని చెప్తాను. ప్రమాణం చేస్తున్నాను. నమ్మండి.'

జాయిన్ దృష్టి నేలమీదికి పోనిచ్చాడు.

'ఈవిషయంలో మనం చెయ్యాల్సిందేం లేదను కోండి. వాళ్లు దాన్ని ప్రాసిక్యూటరుచేతిలో పెడ్తే జరిగేదానికి సిద్ధంగా ఉండండి.'

ఇంక చెప్పాల్సిందేం లేదనుకొని లేవబోయాడు. కాని కాస్త ఆగాడు. ఆమెకేసి చూడకుండానే ఆమె నిశ్చలంగా ఉందని గ్రహించాడు. అవిడేమీ అనలేదు. జాయిన్ 'మీరు చెప్పాల్సిందేమీ లేకపోతే నేను వెళ్లి పోతా' నన్నాడు.

'ఆ ఉత్తరం చూసినవా ళ్లేమనుకుంటారు?'

'మీ రబద్ధమాడుతున్నా రనుకుంటారు.'

'ఎప్పుడు?'

'హామండుతో కొన్ని నెలలనించీ ఉత్తరప్రత్యుత్తరాలు జరగలేదంటే.'

'ఆనాటి సంఘటనలు తలచుకుంటే భయం వేస్తుంది. అటువంటప్పు డింత చిన్న విషయం మరచి పోవడం సహజం.'

'ఇన్ని జ్ఞాపకం ఉన్నప్పుడు మీరు రమ్మంటే వచ్చాడో లేదో మరిచిపోవడం ఆశ్చర్యంగా ఉంది.'

'నేను మరిచిపోలేదు. అది జరిగాక చెప్పడానికి జంకాను. నేను రమ్మంటే వచ్చాడని చెప్తే నమ్ముతా రనుకోలేదు. అది నా తెలివితక్కువే ననుకోండి. మొదట పరిచయం లేదని చెప్పి తర్వాత ఉందంటే బాగుండదని ఊరుకున్నాను.'

ఆమె క్రమక్రమంగా యథాస్థితికి వచ్చింది. ఆమెముఖం ఇదివరకటిలా ప్రశాంతముగా ఉంది.

'ఎందుకు రమ్మన్నారో చెప్పాలి.'

ఆమె అతనికేసి చూసింది. ఆమెకళ్లు అశ్రువులతో ఎఱ్ఱబడ్డాయి.

'రాబర్టు తుపాకీ కొనుక్కుందా మనుకున్నాడు నాకు అలాటివస్తువులంటే భలే పిచ్చ. హామండుతో యీవిషయం చెపుదామని కబురంపాను. అతనిచేత తెప్పించి రాబర్టుకి పుట్టినరోజు నా డిద్దామనుకున్నాను.'

'ఏంరాశారో జ్ఞాపకం లే దనుకుంటా. మళ్లీ చూడండి.'

'అక్కర్లే'దంది ఖంగారుగా.

'తుపాకీ కొనడంవిషయమై మాట్లాడడాని కొచ్చినట్టుందా ఆ ఉత్తరం?'

'కొద్దిగా అసభ్యంగానే ఉండనకోండి. నేనం దరికీ ఆవేశంతోనూ, ఉద్వేగంతోనూ రాస్తూఉం టాను. అందుకని ఇదికూడా ఆవేశపూరితమై ఉంది. నేను హోమండుని తల్లిలా సాకాను. రాబర్ట్ కిష్టంలేదు కనక అతను వెళ్ళిపోయాడు. రమ్మని రాశా నంతే.'

జాయిస్‌కి కూర్చుని కూర్చుని విసుగెత్తింది. లేచి పచార్లుచేస్తూ ఏంమాట్లాడాలో ఆలోచించాడు. కుర్చీమీదికి వంగి, నెమ్మదిగా అన్నాడు:

'నేను మీతో చాలాముఖ్యమైన విషయం మాట్లాడుకున్నాను. కేసు అట్టే అంత కష్టమైనది కాదు. కాని ఒకటే చిక్కు వచ్చింది. నాఅభిప్రాయం చెప్పాలంటే మీరు ఆరుసార్లు కాల్చారు. భయ పడిన స్త్రీ అలా ఎన్నటికీ చెయ్యలేదు. మీరు అతను నేలమీద పడిపోయినప్పుడలా కాల్చారు. అటువంటప్పు డంత భయపడిన స్త్రీ ఎన్నటికీ అలా చెయ్యలేదు. హోమండుప్రవర్తన నమ్మవచ్చును. పైవా స్త్రీమూలాన అతనంటే జాలిపడే కొద్దిమందికూడా అతనంటే అసహ్యం వేసింది. అది ఉపయోగించి అతని నడత మంచిది కాదని వాదించి మిమ్మల్ని విడుదలచేయగల ననుకున్నాను. నేను మీఅయనతో అలానే చెప్పాను. కాని ఈసంగతి యింకా చెప్పలేదు. హోమండుతరఫు వాళ్లు కోర్టు వదలివెళ్తా రనుకోను.'

వాళ్ళిద్దరూ ఒకరివంక ఒకరు చూసుకున్నారు. ఆమె గంభీరంగా ఉంది. గద్దెనోటిలో పాములాగ ఉంది. అతను తన ధోరణిలో పోతున్నాడు.

'కాని ఈ ఉత్తరంవల్ల పరిస్థితులన్నీ పూర్తిగా మారిపోయినై. నేను మీతరఫువాడిని. నాఅభిప్రాయం ఎలా ఉన్నా, ఫలితంమాట అటుంచి మీ విడుదలకై వాదిస్తాను.'

ఆమెముఖం చూసి జాయిస్ నిర్విణ్ణుడయి పోయాడు. ఆమెమొహంలో కళ ఏమాత్రం లేదు. ప్రేతకళ ఉంది. నిశ్చేష్టుడయి తన ధోరణిలో మళ్లా అన్నాడు:

'అదే లెండి. మీరు మీ అలవాటుప్రకారం అర్జంటుగా రమ్మంటే వచ్చాడుకదూ.'

ఆమె తటపటాయిస్తూ ఆలోచిస్తున్నట్టుంది. 'నౌకర్ల చేత సైకిలు మీద పంపావని వాళ్లు నిర్ధారణ చేయగలరు.

'వాళ్లు మనకంటె తెలివితక్కువవా రనుకో కూడదు. ఆఉత్తరంమూలాన అనుకోని అనుమానాలకి తావు వస్తుంది. ఆ ఉత్తరం చూడగానే నే నేమను కున్నానో అనవసరమనుకోండి. మిమ్మల్ని సంగతులన్నీ చెప్పమనడం లేదు. మిమ్మల్ని రక్షించుకోవడాని కవ సరమైనవి చెప్పండి.'

ఆమె పాలిపోయింది. భయంతో 'నన్నురి తియ్యరుకదా' అని అరిచింది.

'మీరు ఆత్మసంరక్షణకోసం చంపా రని ఋజువుకాకపోతే దోషిగా నిర్ధారణచేస్తారు. నర హంతానికి మరణమేకదా శిక్ష' అని మందహాసం చేశాడు.

'వాళ్లేం నిర్ధారణ చేస్తారు?'

'ఏం నిర్ధారణచేస్తారో నాకేం తెలుసు? కాని వాళ్లకి అపనమ్మకం తోచి, వాకబుచేసి ఆచోకీ చేసినా తెలుసుకుందికి ఏముందిగనక?' అని ఆమెకేసి చూశాడు.

ఆమె స్పృహతప్పి పడిపోయింది. పట్టుకో బోయాడు. నీళ్ళకోసం చూశాడు. అక్కడ లేవు. ఎవరినీ పిలవదలచుకోలేదు. నేలమీద పడుకోపెట్టి తేరుకోడం చూస్తున్నాడు. ఆమె కళ్లు తెరిచేటప్పటికి ప్రత్యక్షమైన భయాన్ని చూసి వణికిపోయాడు.

'కాసేపు అలాగే ఉండండి.'

'నన్నురితీయనీకండి.' ఆమె ఏడుస్తోంది.

'దయచేసి ఊరుకోండి.'

'ఒక్కనిమిషం ఉండండి.' అన్నట్టుగానే ఆమె నిమిషంలో యథాస్థితికి వచ్చింది. చిత్రమైన మనిషి!

'నన్ను లేవనీయండి.'

అతను చేయూత నిచ్చాడు. ఆమె లేచి నిల్చుంది. కుర్చీదగ్గరకు తీసికొని వెళ్తే ఆమె విసుగ్గా అందులో చతికిలపడింది.

'కాసేపు మాట్లాడకండి' అంది.

'అలాగే' అన్నాడు జాయిస్.

'పెద్ద గొడవే చేశావన్నమాట.'

అత నేమీ అనలేదు. మళ్లా కాసేపు ఇద్దరూ నిశ్శబ్దంగా ఉన్నారు.

'ఆ ఉత్తరం రాబట్టగలమా' అంది.

'అమ్మదలచుకోకపోతే దాని ప్రసక్తి వచ్చేది కాదనుకుంటా' నన్నా డతను.

'ఎవరిదగ్గర ఉంది?'

'షైనాస్త్రీ.'

ఆమె రంగు వివర్ణమైంది.

'పెద్దమొత్తానికి కాని యివ్వదా?'

'ఆమె దానిమీద పెద్ద విలువే ఉంచిందనుకుంటాను. పెద్దమొత్తానికి తప్ప యివ్వదేమో.'

'నన్ను ఉరిదియ్యనిస్తారా?'

'యిదేమంత సులభ మనుకుంటున్నారా? అదీ కాక నే నలాంటి సలహా లివ్వకూడదు.'

'అలాగయితే నామా టేమిటి?'

'న్యాయం చూస్తుంది.'

ఆమె పాలిపోయింది.

'అంతా మీచేతుల్లో ఉంది. అన్యాయానికి దిగమని మిమ్మల్ని అనలే ననుకోండి.'

ఆమె చాలా దీనంగా చూసింది. ఆచూపు అతని హృదయాన్ని కలచివైచింది. ఆమెని రక్షించక పోతే ఆజన్మాంతమూ ఆచూపు మరవలేక బాధపడ్తా ననుకున్నా డతను. ఇంతకీ చచ్చిన హోమండు నెలాగా బ్రతికించలేము. ఈ ఉత్తరం ఉద్దేశ్య మేమై ఉంటుందని ఆశ్చర్యపోయాడు. అన్యాయమైనాసరే ఆమెని రక్షించితీరాలని నిశ్చయించాడు.

'మీ ఆయనస్థితిగతు లేం తెలియవు నాకు.' ఆమెకి సిగ్గేసింది.

'రబ్బరుఎస్టేటులో షేర్లు ఉన్నాయి. టిన్ షేర్లు చాలా ఉన్నాయి. డబ్బు తేగల దనుకుంటాను.'

'ఆయన కెందుకో చెప్పాలి కదా?'

ఆమె ఆలోచిస్తూ ఊరుకుంది.

'రాబర్టు నాకోసం ఎంతైనా చేస్తాడు. నేనంటే చాలా అభిమానం అతనికి. కాని అత నా ఉత్తరం చూడాలా?'

జాయిస్ కోపంగా చూశాడు. ఆమె గ్రహించింది దాసంగతి.

'రాబర్టు మీకు చిరపరిచితుడు. చిన్నప్పట్నుంచీ స్నేహితుడు. నాకోసం కాకపోయినా అతని కోసమేనా రక్షించాలి. పాపం, అతను పట్టి అమాయకుడు.'

జాయిస్ మాటాడకుండా వెళ్లడానికి లేచాడు. ఆమె దర్జాగా కీవిగా అతన్ని సాగనంపటానికి గేటు దాకా వచ్చింది.

'మీరు నాకోసం చాలా శ్రమపడుతున్నారు. మీ మేలు ఎన్నటికీ మరవలే' నంది.

జాయిస్ ఆఫీసుకి వచ్చేశాడు. పనిచేయకుండా ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఏవో ఏవో ఆలోచనలు తట్టుతున్నాయి. అతను నిరీక్షిస్తూ కూర్చున్నందుకు వెంటనే తలుపు చప్పుడైంది. ఒగ్-ఛి-సెన్ వచ్చాడు.

'నేను కాఫీ త్రాగి వస్తానండి.'

'ఊ'

'ఏదేనా కావాలా?'

'కిడ్ వచ్చాడా? ఎప్పుడొస్తా నన్నాడు?'

'మూడుగంటలకి వస్తానన్నారండి.'

'సరే వెళ్లు.'

గుమ్మందాకా వెళ్లి ఏదో అప్పుడే జ్ఞాపకం వచ్చినట్లు వెనక్కి తిరిగి 'నాస్నేహితుడి కేదేనా చెప్పమంటారా' అన్నాడు.

'ఏం స్నేహితుడు?'

'క్రాస్‌బీకేసుకు సంబంధించిన ఉత్తరవిషయం.'

'అదా! మర్చిపోయాను. నే నామె నడిగాను. ఆమె రాయలేదుట. అది ఫోర్జరీ అయి ఉంటుంది.'

'అయితే వాళ్లు ప్రాసిక్యూటరు కిచ్చినా ఫర్వా లేదు.'

'లేదనుకో. దానివల్ల నీస్నేహితుడికి ఒరిగే దేమిటో నా కర్థం కాదు.'

'అది న్యాయ' మంటాడు నాస్నేహితుడు.

'న్యాయంకోసం జరిగేదాన్ని నే నడ్డగించను ఒకరినొకరు చూసుకున్నారు. నవ్వుకోలేదు. కాని ఒకరి నొకరు పూర్తిగా అర్థంచేసికొన్నారు.'

'నాకు తెలుసునండి. కాని ప్రాసిక్యూటరు చేతిలో పడితే మన పార్టీకి చాలా నష్టమనుకుంటాను.'

'నీ అభిప్రాయమంటే నాకు సరే.'

'అది చైనాస్త్రీనండి నాస్నేహితుడితో చెప్పి మన చేతులలో పడేటట్టు చేస్తే యీగొడవ వదుల్తుం దనుకుంటాను.'

'నీస్నేహితుడు వ్యాపారస్థు డనుకుంటాను. ఎంతయిస్తే ఇస్తా డంటావు?'

'ఆయనదగ్గర లేదు. చైనాస్త్రీదగ్గర ఉంది. ఆమె అతని చుట్టం. వీడు చెప్పేదాకా దాని కంత విలువుం దని ఆమెకి తెలియదు.'

'ఆయ నెంత కివ్వాలనుకుంటున్నాడు.'

'౧౦౦౦౦ డాలర్లు.'

'అమ్మబాబోయ్! అంత డబ్బెక్కడినుంచి తేగలను? ఇంతకీ అది పట్టి ఫోర్జరీ.' అని గుమాస్తాకేసి చూశాడు.

అతను నిశ్చలంగా ఊరుకున్నాడు.

'క్రాసబీకి బీటాంగురబ్బరుఎస్టేటులో ఎనిమిదోవంతు షేర్లున్నాయి. సెలాక్‌టాక్ రబ్బరు ఎస్టేటులో ఆరోవంతు షేర్లున్నాయి. ఆస్తిమీద అప్పిచ్చే స్నేహితుడొక డున్నాడు. కావలిస్తే నేనిప్పిస్తాను.'

'నీకు చాలామంది స్నేహితు లున్నారే' అన్నాడు.

గుమాస్తా దానిలోని గూఢార్థం గ్రహించక పోలేదు.

'ఔనండి' అన్నాడు.

'వాళ్లని ఉరేసుకు చావమను. నేనేమయినా అతన్ని తీసుకురమ్మని చెప్పదలచుకోలేదు. అయిదు వేలకన్నా దమ్మిడీ తీసుకొని రమ్మని చెప్పను.'

'ఆవిడ అమ్మదలచుకోలే దసలు. నాస్నేహితుడామె నతిబలవంతం చేసి ఒప్పించాడు. అంతకు తక్కువయితే ఆమె ఒప్పుకోదు.'

జాయిస్ అతనికేసి చూశాడు. గుమాస్తా తల అతివినయంగా వంచుకొని నేలమీదికి దృష్టిసారించాడు. గుమాస్తా తరహా బాగా తెలుసు జాయిస్‌కి. ఈడబ్బులో అతని కెంత వస్తుందో నని జాయిస్ నవ్వుకున్నాడు.

'పదివేలు చాలా ఎక్కువ.'

'పెళ్లాన్ని ఉరిశిక్షనించి తప్పించడాని కిస్తా డండి.'

జాయిస్ ఆగిపోయాడు ఎంత ఆచోకీ చేశా డీగుమాస్తా? స్థితిగతులన్నీ విచారించి క్రాసబీ తేగలిగినంత పెద్దమొత్తానికీ లేఖ అమ్మడానికి నిశ్చయించాడు!'

'ఆ చైనాస్త్రీ ఎక్కడుంది?' అని జాయిస్ అడిగాడు.

'నాస్నేహితుడింట్లో ఉంది.'

'ఆవిడ వస్తుందా?'

'మనం వెళ్తే మంచిదేమో. రాత్రి తీసికొని వెళ్తాను. ఆమె ఉత్తరం యిస్తుంది. ఆమె కి చెక్కులు తెలియవు. అమాయకురాలు.'

'చెక్కు తీసుకొనిరాను. నోట్లే తెస్తాను.'

'పదివేలకి తక్కువ తేవడం పట్టిదండగ.'

'నాకు తెలుసు.'

'కాఫీత్రాగాక అతనితో చెప్తానండి'

'సరేలే. రాత్రి పదిగంటలకి వచ్చి కలుసుకో.'

'అలాగేనండి.' అని వెళ్లిపోయాడు. జాయిస్ క్లబ్బుకి బయల్దేరాడు. అనుకోకుండా క్రాసబీని చూశాడు. గుంపుమధ్యలో కూర్చున్నా డతను. నిమ్మళంగా అతనివద్దకు వెళ్లి వీపు తట్టాడు. వెనుతిరిగి చూశాడు క్రాసబీ.

'నీతో కొంచెం మాట్లాడాలి.'

'అలాగే. ఎప్పుడు వీలవుతుంది నీకు?'

'క్లబ్బు ఖాళీఅయేదాకా.'

'క్లబ్బు ఖాళీ అయింది. వీళ్లిద్దరూ తప్ప అందరూ వెళ్లిపోయారు.'

'చాలా గొప్ప చిక్కు తటస్థించింది. అతన్ని చంపినరోజున మీఆవిడ అతన్ని ఆహ్వానించింది. ఆ ఉత్తరం ఉం దిప్పుడు.'

'అలా ఎన్నటికీ జరగదు. ఆవిడ హామండుని చూసి కొన్ని నెల్లయిందని చెప్తోంది. నాకూ తెలుసు. ఆమె రెండునెల్లనించైనా కలుసుకొనిఉండదని ఖచ్చితంగా చెప్పగలను.'

'ఇప్పుడా ఉత్తరం హామండు ఉంచిన దైనా స్త్రీదగ్గర ఉంది. నీకు తుపాకీ బహుమతి చెయ్యాలనే ఉద్దేశ్యంతో దాన్ని హామండుచేత తెప్పించడానికి కబురు పంపానంటుం దావిడ. ఈగొడవ జరిగాక ఖంగారులో మర్చిపోయి తను హామండుని కొన్ని నెలల నుండి కలుసుకోలేదనీ, ఏమాత్రం సంబంధం లేదనీ చెప్పిందిట. మళ్లా తర్వాత చెప్తే బాగుండదని చెప్పకుండా ఊరుకుందిట. చెప్తే ప్రమాదమని కూడా అనుకుని భయపడి చెప్పలేదంది. చాలాపొరబాటే జరిగిన దనుకో. కాని హడావిడిలో అలా జరగడం సహజమే.'

క్రాస్‌బీ మాట్లాడలేదు. ఆశ్చర్యంతో అతని మొహం చింకిచాటంతయింది. తెలివితక్కువ మనిషి. కాని అతని తెలివితక్కువని జాయిస్ ఓరిమితో సహించలేదు. అతన్నిచూస్తే ప్లీడరుకి జాలేసింది. ఆమెకోసం కాకపోయినా అతనికోసమేనా ఆమెని రక్షించా లనుకున్నాడు. ఆమె నిజమే చెప్పిం దనుకున్నాడు.

'ఇది ప్రాసిక్యూటరుచేతిలో పడితే చాలా రభస అవుతుంది. మొదట చెప్పకుండా యిప్పుడెందుకు చెప్పావని నిలవదీస్తారు. హామండు తనంతట తాను వస్తే ఫర్వాలేదు. పిలిస్తే వచ్చాడాయె. అందువలన చాలా గొడవ అవుతుంది.'

జాయిస్ తటపటాయించాడు. గత్యంతరం చెప్పడానికి భయపడ్డాడు. సరదాగా ఉన్నప్పుడైతే అసలుపరిస్థితి తెలియని అమాయకుడికోసం తా నింత శ్రమపడుతున్నానని అనుకుని నవ్వుకునేవాడే. కాని యిప్పు డలాగ కాదు.

'నువ్వు నాపార్టీవేకాక స్నేహితుడివి. అందుకనే చెప్తున్నా. ఆ ఉత్తరం మన చేతుల్లోకి వచ్చేటట్టు చూడాలి. దానికి బోలెడు డబ్బు కావాలి. అదే నేను చెప్పవలసినది. మరేం లేదు.'

'ఎంత కావాలి?'

'పదివేల డాలర్లు.'

'అమ్మనాయనో! నా కున్న దంతా అంతే.'

'యిప్పుడు తేగలవా?'

'ఆ. తాకట్టు పెడ్తే మెడోక్స్ యిస్తా డనుకుంటాను.'

'అయితే తెస్తావా?'

'ఇంకోమార్గం లేదా? తప్పదంటావా?'

'మీ ఆవిడకి ఉరి తప్పాలంటే వేరే మార్గం లేదు. ఇది తప్పనిసరి.'

క్రాస్‌బీ మొహం యింకా ఎర్రబడింది. అసలే ఎరుపు. ఇప్పుడు గీచిన కందలా ఉంది మొహం. ఏదో అనబోయి ఊరుకున్నాడు. మొహం రక్తహీన మైపోయింది.

'నా కర్థం కావడం లేదు. ఆవిడ కోర్టులో చెప్పగలదుకదా! ఆవిడ నేరంచేసిం దంటారా? ఒక వెధవని చంపినందుకు ఉరిదియ్యరుకదా!'

'ఆవిడని ఉరితియ్యరనుకో. నరహత్యకి నేర మారోపించి రెండుమూడేళ్లు కఠినశిక్ష విధిస్తారు.'

క్రాస్‌బీఒళ్లు భయంతో కంపించింది.

'మూడేళ్లే!' అన్నాడు చేతులు గుండెమీద పెట్టుకుని.

ఆ తెలివితక్కువ బుర్రలో ఏవో ఆలోచనలు పరుగెత్తుతున్నాయి. కాసేపాలోచిస్తూ కూర్చున్నాడు.

'నా కేం బహూకరిద్దా మనుకుంది?'

'క్రొత్తతుపాకీ యిద్దా మనుకుంది.'

మళ్లీ అతని మొహం కందగడ్డయింది.

'ఎప్పుడివ్వాలి డబ్బు?' అతని స్వరం అదోలా ధ్వనించింది.

'రాత్రి పదిగంటలకి. ఆఫీసుకి ఆరుగంటలకి రా.'

'అది దక్కడికి వస్తుందా ?'

'ఊహూ, నేనే వెళ్తాను.'

'నేను డబ్బు పట్టుకుని వస్తాను.'

జాయిస్ రాబర్టుకేసి కొంచెం తీక్షణంగా చూశాడు.

'నువ్వు రావాల్సిన అవసరం ఉందనుకుంటు న్నావా? అక్కర్లేదు. ఆ వ్యవహారమంతా నాచేతుల్లో వదిలిపెడ్తే బాగుంటుంది.'

'నాడబ్బుకదా! నేనూ వస్తాను.'

జాయిస్ భుజాలెగరేశాడు. అతనివంక ఆశ్చ ర్యంగా చూశాడు. శెలవు తీసికొని వెళ్లిపోయాడు.

క్లబ్బుదగ్గర సరిగా ౧౦ గం.కి కలుసుకున్నారు.

'అంతా సిద్ధమేనా' అని జాయిస్ అడిగాడు.

'ఆ. జేబులోనే ఉంది. వెళ్దాం పద' అన్నాడు రాబర్టు.

ఇద్దరూ కారెక్కారు. దారిలో ఒక యింటి ప్రక్కనించి గుమాస్తా వచ్చాడు. ఓగ్-చి-సెంగ్ డ్రైవరుప్రక్కన కూర్చుని దోవచెప్పాడు. విక్టోరియా వీధికి వచ్చారు. చైనాషాపులు యింకా మూయలేదు. పదిగంటలయినా బజారింకా గంద్రగోళంగానే ఉంది.

ఇంతలో కారాగింది. గుమాస్తా దిగి వాళ్లకేసి తిరిగి—

'మనం యిక్కడినించి నడిచివెళ్తే బాగుంటుందండి' అన్నాడు.

'పద' అన్నాడు జాయిస్.

కారక్కడ ఆపి ముగ్గురూ నడిచివెళ్లారు. రెండడుగులు వెయ్యగానే గుమాస్తా 'మీ రిక్కడ ఉండండి. నాస్నేహితుడితో మాట్లాడివస్తాను' అని నలుగురైదుగురు చైనీయులు గళ్లాపెట్టెదగ్గర కూర్చున్న చైనాషాపులోకి వెళ్లాడు. అక్కడ సరకేం లేదు. ఏం వర్తకం చేస్తున్నారా అని జాయిస్ ఆశ్చర్యపోయాడు. గుమాస్తా లావుగా ఉన్న చైనీయునితో ఏదో మాట్లాడాడు. అతను ఒకసారి బయటికి వచ్చి ఆకాశంవంక చూసి ఒక తాళంచెవి గుమాస్తా కిచ్చాడు. షాపుప్రక్క సన్న తలుపుద్వారా రమ్మని గుమాస్తా జాయిస్‌తో చెప్పాడు. వాళ్లిద్దరూ అతన్ననుసరించారు.

'ఒక్కనిమిషం ఉండండి. అగ్గిపెట్టె తెస్తాను' అని వెళ్లి అగ్గిపెట్టె తెచ్చాడు. మేడమెట్లు ఎక్కుతోంటే అతను పుల్ల వెలిగించాడుకాని అంతా చీకటిగానే ఉంది. ఎలాగో తడుముకుంటూ అతని వెనకే మేడ ఎక్కారు. గుమాస్తా మొదటిఅంతస్తుగదిలోకి వెళ్లి దీపం వెలిగించాడు.

అది ఒక చదరపుగది. రెండు చిన్న మంచాలున్నాయి. వాటిమీద చైనాచాపలున్నాయి. ఒక మూల పెద్ద ఇనపపెట్టె ఉంది. దానిమీద నల్లమందు వగైరా ఉన్న సజ్జ ఉంది. వాళ్లు ముగ్గురూ కూర్చున్నారు. ఇందాకా షాపుదగ్గర చూసిన లావు చైనీయుడు వచ్చాడు. తన స్నేహితుడైన ఓగ్-చి-సెంగ్ ప్రక్కన కూర్చున్నాడు.

ఒక కుర్రాడు ట్రేలో టీకప్పులు పెట్టుకుని వచ్చాడు. రాబర్టు టీ త్రాగలేదు. జాయిస్ తీసికొన్నాడు. ఆ చైనీయులిద్దరూ ఏదో గుసగుసలాడుతున్నారు. తలుపు నిమ్మళంగా తట్టుతూ పిలిచినట్టయింది. లావుమనిషి తలుపు తియ్యడానికి లేచాడు. ఏదో మాట్లాడి ఆమెని లోనికి తీసికొనివచ్చాడు. జాయిస్ ఆమెకేసి చూశాడు. హోమండు పోయిన తర్వాత ఈమెనుగురించి చాలా విన్నాడుగాని యింతవరకూ చూడలేదు. ఆమె లావుగా ఉంటుంది. నడివయస్సులో ఉంది. మంచి మనిషిలాగ ఉంది. లేత నీలిజాకెట్టు, తెల్లధోవతి ధరించింది. మెడనిండా బంగారుగొలుసులు వేసికొంది. నిమ్మళంగా అడుగులు వేస్తూ మంచంమీద కూర్చుంది.

'ఉత్తరం తెచ్చిందా' అన్నాడు జాయిస్.

'ఆ' అన్నాడు గుమాస్తా.

రాబర్టు మాటాడకుండా నోట్లు లెక్కపెట్టి ఛింగ్ సెంగ్ కిచ్చాడు.

'లెక్క చూసుకో' అన్నాడు.

గుమాస్తా లెక్క పెట్టి లావుపైనామనిషికిచ్చాడు. తర్వాత 'సరిగానే ఉందండి' అన్నాడు రాబర్టుకేసి చూసి. ఆ లావుమనిషి సరిచూసికొని జేబులో పెట్టుకున్నాడు. ఆమెతో ఏదో చెప్పగానే ఆమె ఉత్తరం తీసి గుమాస్తా కిచ్చింది.

'ఇది అసలుకాపీ' అని జాయిస్ కివ్వబోతోంటే రాబర్టు పుచ్చుకున్నాడు.

'చూడనివ్వం'డని రాబర్టు చదువుతోంటే జాయిస్ అతనికేసి చూస్తున్నాడు. తర్వాత చెయ్యి చాచాడు.

'నాదగ్గర ఉండడం మంచిది.'

క్రాన్‌బీ మాటాడకుండా దాన్ని మడచి జేబులో పెట్టుకున్నాడు. జాయిస్ ఏమీ అనలేదు.

ఇద్దరూ లేచారు. ముగ్గురు చైనీయులూ వారిని సాగనంపటానికి వచ్చారు.

'నా కీరాత్రి ఏదేనా పని ఉందాండి' అన్నాడు గుమాస్తా.

'అక్కర్లేదు.' తన వాటాకోసం ఉంటున్నాడని జాయిన్‌కి తెలుసు.

గుమాస్తా కొవ్వొత్తి వెలిగించి వాళ్లకి దారి చూపించాడు. రోడ్డుదాకా వచ్చి చైనావాళ్లు వెళ్లిపోయారు.

జాయిస్ కారెక్కుతూ క్రాన్‌బీని రమ్మన్నాడు. క్రాన్‌బీ కాసేపు ఊరుకుని చివరకి 'ఎవరో అమ్ముతున్నారంటే తుపాకీ కొనడానికి నేను సింగపూరు వెళ్లాను.' అని క్షీణస్వరంతో అని చీకట్లో అంతర్ధానమైపోయాడు.

జాయిన్‌విచారణగురించి నిశ్చితాభిప్రాయం ఉంది. హామండుతరఫువారు లేలీవిడుదల కంగీకరించారు. ఆమె కోర్టులో మామూలుగా జరిగిన గాథ చెప్పుకుపోయింది. అసలు డి. పి. పి. (***District Public Prosecutor***) మంచివాడు. కేసుని పెద్ద రాద్ధాంతం చేసి రభసచెయ్యదలచుకోలేదు. లాంఛనప్రాయంగా అడగవలసిన ప్రశ్నలు అడిగాడు,

ఆమెవిడుదలకి ముందు విచారణ అయిదునిమిషాల్లో ముగిసింది. జడ్జి ఆమె నభినందించాడు. ప్రజల పొగడ్తకి అంతులేదు. అందరికన్నా ఎక్కువగా జాయిస్ పెళ్లాం లేలీని పొగడింది. తన స్నేహితురాలి మీద ప్రేమ హామండుని యింకా అసహ్యించుకునేటట్టు చేసింది. ఆమె క్రాన్‌బీ దంపతుల్ని భోజనానికి పిలిచింది. అసలే సరదామనిషేమో ఇవాళ ఆమెవాళ్ళ హాహం ఆగడం లేదు. క్రాన్‌బీ అట్టే మాట్లాడలేదు. అలసిపోయా డనుకుంది.

భోజనాల్లో కబుర్లు మొదలెట్టారు.

భోజన మయాక, 'కాసేపు విశ్రమించండి. తర్వాత బీచికి పోదాం' అంది జాయిస్ పెళ్లాం.

భోజనం అవగానే జాయిన్‌కి ఆఫీసు పోకతప్పదు గనక విధిగా బయల్దేరాడు.

'నేను ఉండడానికి వీల్లేదండి. రబ్బరుఎస్టేటుకి వెళ్ళిపోవాలి' అన్నాడు రాబర్టు.

'ఇవాల్టికి వెళ్లక్కర్లేదులెస్తురూ' అంది జాయిస్ భార్య.

'ఏమీ అనుకోవద్దు. అలాగ వీల్లేదు. చాలారోజుల్నించీ వెళ్లడం లేదు. ఏంచెయ్యాలో ఆలోచించేదాకా ఆమెని మీఇంట్లో ఉంచనిస్తారా?' అన్నాడు.

జాయిస్ తనభార్య ఏదో అనబోతోంటే కనుసన్న చేసి—

'అంత అర్జంటుపని ఉంటే వెళ్లనీయి. మనం ఆపడం సమంజసం కాదన్నాడు.

ఆమె భర్తమొహం చూసి ఏదో గ్రహించి మారుపలకలేదు.

రాబర్టు వెళ్లిపోతూ 'ఒకసారిలా వస్తావా' అన్నాడు. లేలీ వెళ్లింది.

'అతని పద్ధతి నాకేం నచ్చలేదు. పాపం, ఆమె అత నంటూ డనుకుంది' అంది జాయిన్‌భార్య జాయిన్‌తో.

'అర్జంటుపని ఉంటే కాని వెళ్లేవాడు కాదసలు' అన్నా డతను.

'ఆమెకి ప్రక్క వేసి వస్తాను. అలసిపోయింది. కాసేపు పడుకుంటుంది పాపం' అని వెళ్ళిపోయింది. కాసేపటికి మోటారుసైకిలు మోత వినిపించింది. క్రాసబీ వెళ్ళిపోతున్నాడని జాయిస్ వాళ్ల గదిలోకి వెళ్ళాడు. ఆమెచేతిలో ఆ చీటీ ఉంది. శూన్యంలోకి చూస్తూ విహ్వలచిత్తయై ఉంది. ఆమె పాలిపోయిన మొహంతో జాయిస్‌కేసి చూసింది.

హీనస్వరంతో 'అతనికి తెలిసింది' అంది.

జాయిస్ మాట్లాడకుండా చేతిలో ఉత్తరం తీసికొన్నాడు. చేత్తో కాగితం కొస పుచ్చుకుని అగ్గిపుల్లతో కాల్చాడు. కొసదాకా కాలాక చెయ్యి వదిలిపెట్టాడు. అలా కాగితం కాలిపోతోంటే ఇద్దరూ దానికేసి చూస్తూ ఉండిపోయారు. అతను ఆ బూడిదని కాలితో రాసేశాడు.

'ఏం తెలిసిం దతనికి' అన్నాడు జాయిస్.

ఆమె జాయిస్‌కేసి కళ్లు పెద్దవిచేసి చూసింది.

'హోమండుని నేను ప్రేమించానని తెలిసిపోయింది.'

జాయిస్ ఏమీ అనకుండా అలాగే ఉండిపోయాడు.

'నే నతన్ని కొన్నియేళ్లనుండీ ఎరుగుదును. యుద్ధంనించి వచ్చినప్పటినించీ నా కతనితో పరిచయం ఉంది. ఎంతో జాగ్రత్తగా మసలేవాళ్లం. మాలో ప్రేమ మొదలెట్టినప్పటినించీ నే నతనంటే అసహ్యించుకునేటట్టుండేదాన్ని. రాబర్టుదగ్గర హోమండు పేరు చెప్పితే కోపంతో, అసహ్యంతో మండిపోయేదాన్ని. రాబర్టు ఉండగా సాధారణంగా వచ్చేవాడు కాడు. మే మిద్దరం ఒకచోటు నిర్ణయించుకుని అక్కడ తరచు కలుసుకొనేవాళ్లం. వారానికి రెండుమూడుసార్లైనా వచ్చేవాడు. కాని యీసంగతి పిట్టకైనా తెలియదు. కాని ఏడాదినించీ అతను మారిపోయాడు. ఇంత హఠాత్తుగా వచ్చిన మార్పుకి కారణం నే నూహించుకోలేకపోయాను—భరించలేకపోయాను. నన్న తను లక్ష్యపెట్టకపోయినా నే నాభావాన్ని సహించలేదు. అలా అనుకోలేకపోయాను. అతను నేనంటే లక్ష్యంలేదని నేనంటే నిరాకరించేవాడు. నాకు పిచ్చెత్తిపోయింది. అతను నన్ను సహ్యించుకుంటున్నాడని తలచుకొనేసరికి బాధతో కుమిలిపోయేదాన్ని. ఎన్ని బాధలు పడ్డానో నిజంగా ఆ భగవంతుడికే తెలియాలి. నిజంగా నరకయాతన అనుభవించా ననుకోండి. అతనికి నే నక్కర్లేదని తెలిసిపోయింది. అంతా తెలిసికూడా నేను అతన్ని విడిచిఉండలేకపోతున్నాను.

'నే నతన్ని ప్రేమించాను. అతనికోసం ప్రాణాలైనా ఇచ్చేయదలచుకున్నాను. అతడే నాప్రాణం; నా సర్వస్వం. ఇలాటి స్థితిలో నే నుండగా అతనికి చైనాస్త్రీతో సంబంధం ఉన్నట్టు తెలిసింది. నేను నమ్మలేకపోయాను. సరే, నాకళ్లతో నేనే చూశాను ఆమెని! మెడ తిరగనన్ని నగలతో ఆమె అలా వెళ్తోంటే చూశాను! ఎలా ఉందనుకున్నారు! ఏమీ అందకత్తె కాదు. పైగా నాకంటే పెద్దది! ఊళ్లోవాళ్లందరికీ వీళ్లద్దరి సంగతీ తెలుసుట. నన్నామె చూసింది. నాసంగతి ఆమె గ్రహించింది. నేను ఆమె సంగతి తెలుసుకున్నాను. నే నతన్ని చూడాలనుకున్నా. ఉత్తరం చూశారుగా. వెర్రెత్తినదానిలాగ రాశాను. పదిరోజులైం దతన్ని చూసి. యుగాలు గడిచినట్టనిపించింది. ఇంక చూడకుండా ఉండలేను. క్రితంసారి వచ్చినప్పుడు నాతో ఎంతో సరదాగా ఉన్నాడు. ఊరికే ఖంగారుపడి బేలవవకని ఊరడించాడు. అలా చెప్పివెళ్లిన మనిషి దానిదగ్గరకి వెళ్లాడు వెంటనే! ఇంక హోమండుని ఏమనను! ఏం చెయ్యను!'

ఆమె చిన్నగొంతుతో స్ఫుటంగా మాట్లాడుతోంది. గుప్పిడులు బిగించి ఇలా అంది:

'వెధవఉత్తరం. ఎప్పుడూ ఎంతో జాగ్రత్తగా ఉండేవాళ్లం. ఉత్తరం చదవగానే ముక్కలు ముక్కలు చేసేవాళ్లం. అలాటప్పుడు ఇది చించనని ఎలా అనుకుంటాను? ఈ కాగితంముక్కతో ఇంత రభస అయింది!

'అతను యింటికి వచ్చాడు. చైనాస్త్రీవిషయం తెలిసిం దన్నాను. అంతా వట్టి అబద్ధమని బుకాయించాడు. నాకు ఒళ్లుమండింది. ఏం చేస్తున్నానో

తెలియలేదు. నా కసహ్యం వేసిం దతనంటే. ఆవేశంలో అతన్ని మాటలతో చాలా గాయపరిచాను. చాలా చులకనచేశాను. మొహంమీద ఉమ్మేద్దా మనుకున్నా నసలు!

'ఆఖరికి అతనికి కోపం వచ్చింది. తనకి నేనంటే అసహ్యంట! ఇంక నా మొహం చూడదలచుకోలేదుట. నామూలాన జీవితం అంటే రోత పుట్టిందిట. చస్తే బాగుండు ననిపిస్తోందిట. వైనా స్త్రీ ఉందన్నాడు. ఆమెని యుద్ధానికిపూర్వంనించే తెలుసునట! ఆవిడొక్కతే తనంటే ప్రాణం చూపిందిట. ఆమె ఒక్కతే ఈ ప్రపంచంలో తనంటే లక్ష్యపెట్టేదిట! ఆమేనట తన సర్వస్వం. నాదంతా వట్టిబూటకపు నాటకమట! ఇప్పుడేనా నిజం తెలిసికొని వదిలిపెట్టోన్నందుకు సంతోషిస్తున్నా నన్నాడు!

'తర్వాత ఏం జరిగిందో నాకు తెలియదు. ఒళ్లు తెలియని ఆ వేశంలో బల్లదగ్గరకి వచ్చి తుపాకీ తీశాను. అతను భయంలో అరిచాడు. దెబ్బ తగిలిందతనికి. తడబడుతూ వసారాలోకి అలాగే వెళ్లాడ. నే నతన్ని వెంబడించి తుపాకీ పేల్చాను. ఛామందు పడిపోయాడు. అతనిదగ్గర నిల్చుని గుళ్లు ఆఖరయేదాకా కాల్చాను.'

ఆమె మాట్లాడడం ఆపేసింది. ఆవేశంతో వగరుస్తోంది. మొహంలో క్రూరత్వం, పిశాచత్వం తాండవమాడుతోంది. అంత నాగరికురాలు ఆ ఘోర కృత్యానికి పాల్పడగలదని అతను కోలేకపోయాడు. ఆమెను చూసి కంపించిపోయాడు. ఆమెదయ్యపు మొహం చూడలేక వెనక్కి తగ్గాడు. పళ్లికిలిస్తూ ఉండే దయ్యపుబొమ్మ జ్ఞాపకంవచ్చిం దామెని చూసేటప్పటికి.

లోపలినించి స్నేహపూరితమైన కంఠస్వరం పిలుపు వినవస్తోంది.

'ఇంక రావమ్మా. కాసేపు పడుకొందువుగాని' ఆమెమొహం యథాస్థితికి వచ్చింది. ఆ విషాదచ్ఛాయలు, భయంకరరేఖలు ఎక్కడికి పోయాయో మరి! నలిగిన కాగితాన్ని చేత్తో సరిచేస్తే ఉన్నట్లు ఆమెమొహం మళ్లీ ప్రశాంతంగా చిరునవ్వు తొణికిసలాడుతో ఉంది. ఇప్పుడామె ప్రపంచదృష్టిలో నిర్దోషి. అమాయకురాలు! గౌరవనీయురాలు! మర్యాదస్థురాలు.

'వస్తున్నా. నువ్వెంత శ్రమ పడ్తున్నా'వంటూ ఆమె లోపలికి వెళ్ళింది.

(అనువాదము : పుతలీబాయి.)



## శరీరపరిశోధకశిరోమణి

# ఐవాన్ పెట్రోవిచ్ పాలోవ్ పండితుడు

●

శ్రీ డా. దండా వెంకటసుబ్బారెడ్డి

పాలోవ్ ౧౮౪౯ వ సంవత్సరమున సెప్టెంబరు ౧౪ వ తారీఖున రష్యాదేశమున జన్మించెను. ఆతని తండ్రి "రయాజం" అను చిన్న గ్రామమునకు మత గురువుగా నుండెను. బీదగ్రస్తుడు. తన కుటుంబపు



ఖర్చులకు జీతము చాలనందున వ్యవసాయమువలన కొంత ఆర్జించుకొనుచుండెను. పాలోవ్ చిన్నతనములో మతగురువులు నడుపుచుండిన పాఠశాలలలో కొంతకాలము చదివెను. ఆతడు పదునైదేండ్లప్పుడు శరీరశాస్త్రగ్రంథము నొకదానిని చదువ తటస్థించెను. అప్పటినుంచియు పాలోవ్‌కు జీవశాస్త్రమున మిక్కిలి యభిరుచి కలిగెను. తర్వాత విజ్ఞానశాస్త్రము నభ్యసించుటకు "సెయింటు పీటర్సుబర్గు" విశ్వవిద్యాలయమున ప్రవేశించెను. అపుడా విశ్వవిద్యాలయమున "సైను" అను శరీరశాస్త్రవేత్తయు, "మెండలీఫ్" అను రసాయనిక శాస్త్రజ్ఞుడును పరిశోధకులుగా నుండిరి. సామాన్యవిజ్ఞానశాస్త్రమును పఠించినతర్వాత "మిలిటరీ మెడికల్ అకాడమీ"లో పాలోవ్ వైద్యశాస్త్రమును చదువ నారంభించెను. ౧౮౭౯ లో వైద్యవృత్తి పట్టము పొంది బోట్కిన్ (*Bodkin*) అను వైద్యపుంగవునియొద్ద సహాయపరిశోధకుడుగా చేరెను. జంతువులమీద చేయు పరిశోధనలు నడుపుట యితని వంతు. ౧౮౮౩ లో యం. డి. పట్టమును పొందినపిదప ఇతడు మరుసటిసంవత్సరమున శరీరశాస్త్రోపాధ్యాయుడుగా నియమింపబడెను. అటుపిమ్మట జర్మనీదేశమునకు వెళ్లి లీప్జిగ్ నగరమున "ఫిజియలాజికల్ ఇన్స్టిట్యూట్"లో "కారల్ లీడ్విగ్" వద్దను, బ్రెస్లానగరమున "రుడోల్ఫ్ హీడన్ హీమ్" వద్దను రెండుసంవత్సరముల కాలము శిక్షణపొందెను.

పాలోవ్ చిన్నతనముననే శస్త్రప్రయోగమునకు రెండుచేతు లుపయోగించుట నేర్చుకొనిన సవ్యసాచి అయ్యెను. ఈ నేర్పు పరిశోధనాలయమున జంతువులమీద చేయవలసిన శస్త్రప్రయోగమునకు చాల నుపకరించెను. ౧౮౯౧ వ సంవత్సరమున సెయింటు

పీటర్సుబర్గులో స్థాపింపబడియుండిన "ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఎక్స్పెరిమెంటల్ మెడిసిన్" అను వైద్యకపరిశోధనాలయమున శరీరశాస్త్రశాఖకు అధ్యక్షుడయ్యెను; ౧౮౯౪ వ సంవత్సరమునుండి, యీపనితో పాటు "మిలిటరీమెడికల్ అకాడెమీ"లో (వైద్యకళాశాల) "ఫిజియాలజీ ప్రొఫెసర్" ఉద్యోగమును కూడ చేయసాగెను. ౧౦ సంవత్సరముల తర్వాత అతడు సెయింటుపీటర్సుబర్గ అకాడెమీలో నలుగురు శాస్త్రవేత్తలలో నొకడుగ నియమింపబడెను. ఈపదవి వలన పావ్లోవ్ మరొక పరిశోధశాలయమునకుకూడ అధికారి యయ్యెను. ఆయన సొంత పరిశోధనలన్నియు అసంస్థలోనే జరుగుచుండెను. ఇతర పరిశోధనాలయములలో ఆయనసలహాలు పొంది సహాయపరిశోధకుల కార్యక్రమములు జరుపుచుండిరి. ఇట్లు బహువిధపరిశోధనలను నిర్వహించిన పావ్లోవ్ పండితుడు ౧౯౩౬ సంవత్సరమున ఫిబ్రవరి ౨౪ తారీఖున, లెనిన్‌గ్రాడునగరమున ఇన్ ఫ్లూయంజాజ్వరము వలన పరమపదము చెందెను. రష్యన్ శాస్త్రజ్ఞులలో పావ్లోవ్ ప్రథమగణ్యుడని శాశ్వతకీర్తిపొందెను.

ఆయన మరణవార్తను ప్రకటించుచు, బ్రిటిష్ మెడికల్ జర్నల్ (౧౯౩౬ సం. మార్చి ౭ తేదీ సంచికలో) వ్రాసిన శరీరపరిశోధనల వివరములు కొన్ని గమనింపదగినవి.

"పావ్లోవ్ పేరుతో ప్రస్తావనకువచ్చు పరిశోధనలు అసంఖ్యాకములు మాత్రమే కావు; బహుముఖములయినవి. మొట్టమొదట పావ్లోవ్‌కు కీర్తిప్రతిష్ఠలు తెచ్చిన పరిశోధన రక్తచక్రచంక్రమణమునకు సంబంధించినది. జంతువునకు ఎట్టిబాధ లేకుండ శస్త్రముచేసి రక్తపుఒత్తిడిని కొలిచి క్రొత్తఅంశములను కనిపెట్టెను. అంతకుమునుపు శస్త్రప్రయోగమువలన కలుగు బాధచేతను, లేక ఇతరకారణములచేతను జంతువుయొక్క ప్రతిక్రియలు వికృతమునొందుచుండెడివి."

### జీర్ణమండలమందలి రసములకు సంబంధించిన పరిశోధనలు

పావ్లోవ్ ఆహారజీర్ణ విషయమై చేసిన పరిశోధనలు అతనికి ఎక్కువ కీర్తిప్రతిష్ఠలు తెచ్చినవి. అతడు జీర్ణమండలమందలి గ్రంథులను పాలించు నరములను, దినదినము ఈ గ్రంథులు పనిచేయు విధమును తరచి తెల్పెను. ఈపరిశోధనలలోకూడ అతని విజయమునకు కారణము జంతువులకు ఏమాత్రము బాధకలుగకుండ నడపిన అతని ప్రయోగపద్ధతియే.

౧౮౮౮ మొదలు ౧౯౦౦ వరకు పావ్లోవ్ చేసిన పరిశోధనలన్నియు జీర్ణమండలమునకు సంబంధించినవే. ఆ పరిశోధనలలో మొదట "పాంక్రియస్" అనే గ్రంథిలో ద్రవము పుట్టించు నరము "వేగస్" అని తెల్పెను. అతని శిష్యులలో నొకడు "ఈసోపగస్" (ఆహారనాళము)నుండియు, "స్టమక్" (అన్నకోశము)నుండియు సొరంగము చేసి అందలి రసమును పొందుటకు పావ్లోవ్ పద్ధతిని ప్రకటించెను. ఈపద్ధతివలన అన్నరసముయొక్క ఉత్పత్తిక్రమమును, అందుకు అనుకూలించు శారీరమానసికపరిణామములను కనుగొనగలిగెను. ౧౮౯౨ నుండి ౧౮౯౪ వరకు ఇతరదేశములలోని శరీరశాస్త్రజ్ఞులు రష్యానుండి ప్రచురింపబడుచుండిన శాస్త్రపత్రికల మూలమున పావ్లోవ్ చేసిన పై పరిశోధనల నెరుగగలిగిరి. జీర్ణమండలమునకు సంబంధించిన అతని ప్రయోగములు, పరిశోధనలు, ప్రచురణములు అన్నియు సంకలితముచేయబడి ఒక గ్రంథరూపమున జర్మనుభాషలోను, ఫ్రెంచిభాషలోను ప్రకటితమయ్యెను. ఆ గ్రంథమునకు ఇంగ్లీషుభాషాంతరీకరణముకూడ వెంటనే వెలువడెను. జీర్ణక్రమమందలి ముఖ్యవిషయముల విజ్ఞానమును సాధించి ప్రకటించినందులకు ఫలితముగా పావ్లోవ్ ౧౯౦౪ వ సంవత్సరమున, నోబెల్ బహుమానమును పొందెను. కష్టసాధ్యమగు శస్త్రపరిశోధనలను నిర్వహించుటకు వలయు నైపుణ్యమును కొందరు శిష్యులు పావ్లోవ్ యొద్ద నేర్చుకొనిరి. ఆ శిష్యబృందముమూలమున పావ్లోవ్ పరిశోధనపద్ధతులు దేశదేశముల విస్తరించినవి.

### అనుభవజాత అనుక్రియలు
### (*Conditioned Reflexes*)

౧౯౦౨ మొదలు పావ్లోవ్ తన శిష్యవర్గముతో పాటు "మెదడు-నాడీమండలము"నందు కలుగు పరిణామములకు సంబంధించి పరిశోధనలు నడపెను.

పావ్లోవ్‌కు నూతనమును, విచిత్రమును అగు ఒక తలంపు తట్టెను. ఆయన ఇరువదిసంవత్సరములుగ గమనించుచుండిన తృష్ణయొక్క ప్రతికర్మలను మెదడు ఉపరితలమున నుండు పొరలలో (Cartex) జరుగుచుండు అనుభూతులను బాహ్యసంకేతములుగా గణించి ఆ శీకపరిశోధనలు చేయవచ్చునను ఊహ, భావనాశక్తి అతనికి కలిగెను.

పావ్లోవ్ ౧౯౦౬ న లండనునగరమున ఇచ్చిన ఉపన్యాసములలో ఈ విషయమై మొదట జరిగిన పరిశోధనలను తెలిపెను. తర్వాత కొంతకాలమువరకు ఆయనయు, ఆయనశిష్యులును ఈ శ్రాస్త్రశాఖలో చేయుచుండిన పరిశోధనలు రష్యాదేశమునలుపల కొద్దిగామాత్రమే తెలియుచుండెను. పావ్లోవ్ పరిశోధనలు మానవసంఘమునకు చాల ముఖ్యమైనవి. ప్రాణి నడవడి, జీవకణములయొక్క శరీరభాగములయొక్క ప్రతికర్మల సంయోగము, సంక్రమణములవలన ఏర్పడునని ఆయన నిరూపించెను. దానివలన సాంఘికప్రవర్తనకు పరిసరములు ఎంత అవసరమో తెలియవచ్చెను. ఆయనసిద్ధాంతములు "బోల్షివిస్టు"సూత్రములతో సరిపడినందువలన, విప్లవానంతరము, సోవియట్ శాస్త్రజ్ఞులలో పావ్లోవునకు అగ్రస్థానము లభించెను.

౧౯౨౩ లో ఎడింబరోనగరమున జరిగిన అంతర్జాతీయశరీరశాస్త్రజ్ఞుల మహాసభలో పావ్లోవ్ ఉపన్యాసమును ఆయనకుమారుడు చదివెను. ఈ యిరువది సంవత్సరములుగా "కండిషన్డు రిఫ్లెక్సెస్"గురించి జరుగుచుండిన పరిశోధనలు అప్పటివరకు విదేశీయశాస్త్రజ్ఞుల దృష్టిని ఆకర్షించలేదు. ఇందులకు కారణము, నిస్సందేహముగా, నిరూపణ పూర్తియగునంతవరకు, జరుగుచుండిన పరిశోధనలను ప్రకటించుటకు ఆయన ఇష్టపడకుండుటయే. ౧౯౨౪ లో బ్రిటిష్ మెడికల్ జర్నలులో డాక్టర్ గాంటు మొట్టమొదటిమారు పావ్లోవ్, ఆయనసహచరులు కలిసి చేయుచుండిన పరిశోధనలను గురించి వ్రాసెను. తర్వాత ౧౯౨౭ లో మరొకవ్యాసమున డాక్టర్ గాంటు "కండిషన్డు రిఫ్లెక్సెస్" పరిశోధనలు నడపుటకు ఏర్పాటుచేయబడిన ఒక యంత్రపరికరమును వర్ణించెను. ఈ పరిశోధనలు పావ్లోవ్ మరణమువరకు జరుగుచునేయుండెను.

౧౯౨౭ లో పావ్లోవ్ "కండిషన్డురిఫ్లెక్సెసు"ను గురించి వ్రాసిన గ్రంథమును ఆసంవత్సరమునే "అన్రెప్" ఇంగ్లీషులోనికి తర్జుమాచేసెను. అన్రెప్ రష్యాలో జన్మించి, బ్రిటనులో పౌరసత్వమును సంపాదించినవాడు; పావ్లోవ్ శిష్యుడు; అతని పరిశోధనలలో పాల్గొన్నవారిలో నొకడు. ఇంగ్లాండులోని రాయల్ సొసైటీసహాయమున ఈభాషాంతరీకరణమును ఆక్స్ఫర్డు యూనివర్సిటీముద్రణాలయము వారు ప్రచురించిరి. శరీరశాస్త్రవిజ్ఞానచరిత్రలో మరువరానట్టి ఒకానొక సందిగ్ధసమయమున ఈమహాగ్రంథము వెలువడి, అంతకుముందు ప్రబలుచుండిన పిచ్చియూహలను తొలగించి, ప్రత్యక్షప్రయోగపరిశోధనలకు దారిచూపెను.

ప్రొఫెసర్ ఏ. వి. హిల్ (prof. A. V Hill, F. R. S) పావ్లోవ్ నిర్యాణకాలమున బ్రిటిషుమెడికల్ జర్నలులో సంకీర్తనము చేయుచు తెలిపిన కొన్ని విషయముల నిచ్చుట తెలుపుట మంచిది.

పావ్లోవ్ దేహపాటవము:—"వయస్సు లెక్కించినచో వృద్ధుడైనప్పటికిని దేహబలమునకాని, మనశ్శక్తిలో కాని వృద్ధుడుగా తోచలేదు. ౧౯౩౫ లో రష్యాలో కాంగ్రెసు జరిగినపుడు తనకంటె పదేండ్లు వృద్ధుడైన ఒక పండితునికి పావ్లోవ్ చేయూతనిచ్చి, ఉపన్యసించుటకై అతనిని సభావేదిక నెక్కించిన దృశ్యము 'మరువరానిది.' మరియు ౮౦ సంవత్సరములు గడచువరకు పావ్లోవ్ ప్రతిదినము పనిచేయుచు మూడుపరిశోధనాలయములలో కృషిచేయు ఏబదిమంది పరిశోధకులకు సలహా నిచ్చెడివాడు. వారమున ఆరుదినములు, ప్రొద్దున పదిగంటలనుండి సాయంకాలము ఆరుగంటలవరకు, ఒక్కనిమిషము ముందువెనుకలుగాక వచ్చుచు పోవుచు నుండెను. అవసరమైనపుడు అతడు హిమవర్షములోను, మంచుగడ్డలమీదను నడచెడివాడు.

జనరంజకుడు :—"పావ్లోవ్ సభావేదికలమీద, లండనులోకాని, బోస్టనులోకాని, లెనిన్గ్రాడులో కాని, మరే చోటనైన కాని కనబడినపుడు

ప్రేక్షకులలో నుత్సాహము పొంగిపొర్లెడిది. పురాతన కథలలో వర్ణింపబడునట్టి రూపవేషములు, అతని మనోరంజకమగు ముఖవైఖరియు, అతని పరిహాసోక్తులు సభలో నుత్సాహమును, దీర్ఘకరతాళధ్వనులను కలిగించెడివి."

సరసుడు:— పావ్లోవునుగురించి మరొక కథ గలదు. ౧౯౧౨లో పావ్లోవ్ గౌరవపట్టమును పొందుటకు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమునకు వచ్చెను. అచ్చట శరీరశాస్త్ర మభ్యసించుచుండిన విద్యార్థులందరు ఆయన పేరుప్రతిష్ఠలను, జీర్ణమండలమునకు సంబంధించిన అతని పరిశోధనలను ఎరిగియుండిరి. ఆ పట్టప్రదానోత్సవసమయమున తాముకూడ కొంత తోడ్పడ దలచి, ఒక ఆటబొమ్మల అంగడికి వెళ్లి, సామాన్యమగు ఒక కుక్కయెత్తు రూపముగల కుక్కబొమ్మను కొనిరి. దానిని రబ్బరుమాతలతోను, గ్లాసుగొట్టములతోను, ఇతర రసాయనిక శారీరక పరికరములతోను అలంకరించి, సెనేట్‌హౌస్ (Senate - House) లో ఒకవైపునుండి మరొకవైపునకు పెద్ద త్రాడు గట్టి, దానికి ఆబొమ్మను వ్రేలాడగట్టిరి. పట్టమును పొంది కూర్చుండుటకు పావ్లోవ్ తిరిగిపోవునపుడు, ఆ విద్యార్థులు దారమును వదలి, ఆ కుక్కను ఆయనమీద విడిచిరి. అందులకు పావ్లోవ్ మిక్కిలి హర్షించి, కుక్కను దారమునుండి తీసి చంకలో పెట్టుకొని వెళ్లెను. ఆసాయంత్రము ఒక సభలో హిల్ పండితుడు తన్ను కలిసికొనినపుడు, విద్యార్థులుకూడ తన శాస్త్ర కృషిని ఎరిగినందులకు సంతసించి, ఆబాలురు చేసినది ఉత్తమతరమైన సత్కారమని పావ్లోవ్ పలుమారు నుడివెనట. అంతేగాక ఆకుక్కబొమ్మను లెనిన్‌గ్రాడునకు తీసుకొనిపోయి తన గ్రంథాలయమున భద్రముగా పెట్టియుంచెనట.

మతము: శాస్త్ర విజ్ఞానము:— వయస్సునను, పేరుప్రసిద్ధులవలనను, నిష్కల్మషప్రవర్తనవలనను రష్యాదేశపు శాస్త్రజ్ఞులలో పావ్లోవ్ మేటియై యుండెను. అతడు ఒక్కొక్కమారు పసిబాలునివలె అమాయకుడుగా తోచును; కొన్ని సమయములలో స్థిరచిత్తుడైన నియంతవలె గోచరించును. అతనియెడ ప్రజలకు భయముకన్న ప్రేమ ఎక్కువ. ఆయనకు విజ్ఞానశాస్త్రమందు గల భక్తిశ్రద్ధలు మతావేశమునకు పరిసమానమయినవి. ఒకమారు హిల్ పండితుడు ఇంగ్లీషుదేశస్థులలో అనేకులు మతగురువుల బిడ్డలని పలికెనట. అందుకు జవాబుగా పావ్లోవ్ తానుకూడ ఒక మతగురువుకుమారుడననియు, తన తండ్రితండ్రియు మతగురువే యనియు, తన భార్యకూడ మతగురువు బిడ్డ యనియు సగర్వముగా పలికెనట. అపుడు హిల్ పండితుడు "నీవు శాస్త్రజ్ఞుల మతగురువు" అని పలుకగా, పావ్లోవ్ బాలునివలె సంతోషపడి నవ్వెనట.

కుటుంబములో పరస్పరప్రేమ:— పావ్లోవ్ ప్రజారంజకత్వమునకుగల కారణములలో నొకటి అతని కుటుంబప్రీతి. వృద్ధాప్యములో విదేశములకు వెళ్లినపు డెల్ల అతని కుమారులలో నొకడు వెంట పోయెడివాడు. ఒక కుమారుడు న్యాయవాదివృత్తిని విడిచి, తండ్రికి కార్యదర్శిగా పనిచేయుచుండెను. పావ్లోవ్ జర్మనుభాషలో కొంత కష్టముతో మాట్లాడగలిగియుండినను, స్వభాషలోతప్ప మరేయితరభాషలోను ధారాళముగా మాట్లాడలేకుండెను. ఆ యువకుమారుడు బహుభాషాపండితుడు. తండ్రితోపాటు కొన్ని సమావేశములందు పాల్గొని, ఆ సంభాషణములను, ఉపన్యాసములను భాషాంతరీకరించి తండ్రికి తెలిపెడువాడు. వాటి సారాంశమును అతిత్వరితముగా రష్యను భాషలో తండ్రికి తెలిపెడివాడు. ఆ వృద్ధపండితుడు తల యూపుచు, మందహాసము చేయుచు, హస్తవిన్యాసములతో తన యభిప్రాయమును దెలిపెడివాడు.

స్వదేశాభిమానము:— పావ్లోవ్ తన దేశమును అధికముగా ప్రేమించి, దేశాభ్యుదయమునకు పాటుపడెను. రష్యాదేశమున జరుగుచుండిన మార్పుల నతడు ఒప్పుకొనలేదు. రాజ్యాంగవేత్తల వర్గములోనివాడు కాకపోయినప్పటికిని, తన యిష్టప్రకారము భాషించి ప్రవర్తించెడివాడుగా పావ్లోవ్ ప్రసిద్ధికెక్కెను. స్వదేశమునను, విదేశములలోను తన ప్రతిష్ఠ ఎక్కువగా నుండినందున ఎవ్వరును అతనిజోలికి పోకుండిరి. కడపటిసంవత్సరములలో తనను, తన విజ్ఞానశాస్త్రమును

ఆదరించిన ప్రభుత్వమునెడ కొంత సహనము చూపుచు వచ్చెను; సోవియట్ ప్రభుత్వము స్థిరపడినదని గ్రహించెను. దేశప్రియుడు కాన, దేశమునకు, దేశవిజ్ఞానమునకు తగినంత సేవచేయ సంసిద్ధుడయ్యెను. రష్యాప్రభుత్వమువారు ౧౯౩౫ వ సం. న పౌలోవ్ ౮౫ వ జన్మదినమున ఒకమిలియన్ రూబుల్సునాణెములను ఆయన పరిశోధనాలయమును విస్తరింపజేయుటకు విరాళమిచ్చిరి. ఆయనకు ఉపకారవేతనముగా సంవత్సరమునకు ౨౦ వేల రూబుల్సులను వేరుగా ఒసగిరి.

గౌరవసన్మానములు:—౧౯౦౭ లో పౌలోవ్ ఇంగ్లాండులోని రాయల్‌సొసైటీలో విదేశీయసభ్యుడుగా ఎన్నుకొనబడెను; ౧౯౦౯ లో ఫీజియాలజికల్ సొసైటీలో గౌరవసభ్యుడుగా ఎన్నుకొనబడెను; ౧౯౧౫ లో రాయల్‌సొసైటీవారి కోప్లేమెడలు బహుమానముగా పొందెను; ౧౯౨౮ లో "హార్వే" (*Harvey*) త్రిశతవార్షికోత్సవసందర్భమున ఇంగ్లాండునకు వచ్చి రాయల్‌సొసైటీ తరఫున ఉపన్యాసమిచ్చెను. ఆ సంవత్సరముననే "లండన్ రాయల్ కాలేజి ఆఫ్ ఫిజిషియన్సు"లో ఆయన గౌరవ ఫెలోగా ఎన్నుకొనబడెను; తరువాత బ్రిటిషుమెడికల్ అసోసియేషన్ యొక్క విదేశీయవిశేషరిగా నియమింపబడెను. లండనులో ౧౯౩౫ లో జరిగిన "న్యూరలాజికల్ కాంగ్రెసు"లో నాడీమండలమందలి పరిణామములను గురించియు, నరముల జబ్బులనుగురించియు నుపన్యాసముల నిచ్చెను. అవృద్ధపండితుడపుడు సభావేదిక నెక్కి జర్మనుభాషలో తడబడుచు నుపన్యసించి తిరిగి ఆసీనుడైనప్పుడు, ఆ సమావేశమంతయు లేచినిలిచి, కరతాళధ్వనులు చేసి, తమ గౌరవభావమును ప్రకటించిరి. కొన్నివారములతర్వాత రష్యాలో జరిగిన అంతర్జాతీయశరీరశాస్త్రపండితుల మహాసభలో అగ్రాసనాధిపత్యము వహించినపుడు కూడ ఈ విధముననే బహుదేశశాస్త్రపరిశోధకుల జోహారుల నందుకొనెను.

శాస్త్రజ్ఞుల అంతర్జాతీయమహాసభ:—రష్యాదేశమున అంతర్జాతీయశరీరశాస్త్రజ్ఞుల సమావేశము జరుపుటకు రష్యాశాసనము సమ్మతించి విదేశములకు ఆహ్వానములంపెను. పౌలోవ్ యెడ ప్రపంచమందంతట శాస్త్రపండితులలో గల ప్రేమగౌరవభావములే పై ఆహ్వానముల నంగీకరింపజేసినవి. ఆ మహాసభను జయప్రదముగా జరగించినదికూడ పౌలోవ్ యొక్క గుణగణములు, లోకప్రవర్తన, ప్రతిభాశక్తులే. ఆ సమావేశము రష్యాదేశీయశాస్త్రజ్ఞులకును, విదేశశాస్త్రజ్ఞులకును స్నేహభావమును పెంపొందించి ఒక నూతనశకప్రారంభమునకు కారణమయ్యెను.

ప్రపంచములో విజ్ఞానశాస్త్రజ్ఞులలో ఏకొద్దిమందియో పౌలోవ్‌వలె ప్రఖ్యాతికాంచిరి. ఆయనను ఫోటోగ్రాఫు తీసినన్నిమార్లు ఏ కొద్దిపండితులో మాత్రమే ప్రపంచమున గౌరవింపబడియుందురు. ఆయన పేరు ప్రచారములకు పాటుబడలేదు. ప్రజలు అతనిని గౌరవింపక తప్పదాయెను. ఆయన పేరుప్రతిష్ఠలు, అతడు సాధించిన విజ్ఞానవిషయములు, అతని పరిహాసోక్తులు—వీనివలననే పౌలోవ్ ప్రజాప్రియుడయ్యెను. ప్రజల ఆదరాభిమానములవలనగాని, పండితుల గౌరవసత్కారములవలనగాని మానసికముగ, లేక నైతికముగ ఏమాత్రము వికారముచెందని నిరాడంబరజీవి, ధర్మవర్తనుడు, మహాపురుషుడు పౌలోవ్.

---



అప్పగింత :

రిపబ్లిక్ స్థాపనను ప్రకటించి శ్రీరాజగోపాలాచారిగారు శ్రీరాజేంద్రప్రసాదుగారికి సింహాసనం సమర్పించుట

# చెప్తే వింటాడూ?

(ప్రహసనము)

శ్రీ కె. రామగోపాల్

పాత్రలు:

వస్త్రప్ప: పూర్తిగా పిచ్చివాడూ కాదు! పూర్తిగా గడుసువాడూ కాదు! పరమలోభి! ఒకళ్ల సేదిపించి గమ్మత్తుగా డబ్బు లాక్కోడం బాగా తెలుసు! కాని ఒక్కొక్కప్పుడు ఇతరులు పన్నిన వలల్లోకూడా పడుతూంటాడు. కొద్దిగా ఇంగ్లీషు ముక్కలుకూడావచ్చు!

పంకాలు: భూమండలములో ఒక ఆదర్శప్రాయుడైన నౌకరు, వస్త్రప్పకు తగినవాడు!

భూతాలు: పేరు మాత్రమే కాకుండా నిజానికి కూడా ఒక భూతంలాంటివాడే!

[అన్నిరంగములకథ వస్త్రప్పగారి యింటియందు జరిగినదే]

## మొదటి రంగము

(వస్త్రప్పగారి యిల్లు. ముందువసారాలో ఒక చిన్న కుర్చీ, కుర్చీముందు టేబిలు. టేబిలు మీద ఏవో కొన్ని కాగితాలు, పుస్తకాలు, కలం, సిరాబుడ్డి చిందరవందరగా పడివుంటాయి. వస్త్రప్ప కుర్చీలో కూర్చొని టేబిల్ మీద కాళ్లుంచి అతి 'సీరియస్'గా ఏదో చదువుతూంటాడు )

వస్త్రప్ప:—ఒరేయ్ పంకాలు! ఎక్కడ అఘోరిస్తున్నావురా! నీ యింట బటారంగానూ! నీకోసం అరిచేటప్పటికి నా గొంతుక పోతోందిరా! నీ యిల్లు ఇదై పోనూ! (కొంచెంసేపు ఆగి కుర్చీలోంచి లేచి పచార్లు చేస్తూ) అబ్బబ్బ! యీ మేజరునౌకర్లని పిలవడానికి వేరే మైనరునౌకర్లని పెట్టుకోవలసి వస్తోంది ఖర్మగతి! ఇల్లాగే అవసరం వచ్చినప్పుడు కనిపించకుండా ఎగిరి చక్కాపోతారనే యీ నౌకర్లని నియమించుకొనేముందే, మనదగ్గిర వాళ్లనుసరించవలసిన కొన్ని 'రూల్సు' కాగితంమీదే వ్రాసి "తు, చ లు తప్పకుండా ఆవిధంగానే అనుసరిస్తాము" అని దాని మీద యీ నౌకర్ల చేత సంతకాలు చేయించుకోవడం నాకు పరిపాటే! ఆప్రకారమే ఒక పది నియమాలు వ్రాయించి యీ దద్దమ్మచేతకూడా దస్కతు పెట్టించాను! ఒక్క పెట్టించడమే కాదు! ప్రతిశని వారం వాణ్ణి దగ్గర కూర్చోబెట్టుకొని మొదటినుంచి చివరివరకూ వాడికి అర్థమయ్యే వ్యావహారిక భాషలో బాగా నచ్చేటట్లు చెప్పి బుఱ్ఱ కెక్కిస్తూంటాను. అంతేకాదు! వాడికి బోధించిన మరువాడు క్షుణ్ణంగా అప్పగించుకొని రెండు మూడు సార్లు పలకమీద క్రింద నుంచి పైకి, పైనుంచి క్రిందకి తెగ వ్రాయిస్తూంటాను కూడాను! వ్రాయించేవాణ్ణి వ్రాయించినట్టు ఊరుకోవచ్చా? ఎక్కడైనా తప్పొస్తే, వచ్చేటట్లు మళ్లీ చదివిస్తాను! ఇంత చేసినా వాడి పనిమాత్రం వాడు మానడు. చెప్పినమాట ఎంతచెప్పినా వినిపించుకోకుండా, ఎందుకూ పనికిరాకుండా వుండే ఒక దౌర్భాగ్యుడిమీద అమాంతంగా మొన్ననే కోపం వస్తే ఉన్నవాణ్ణి ఉన్నట్టుండక నెల్లాళ్లక్రితమే, ఇవ్వవలసిన నాలుగునెలల జీతం యివ్వకుండా 'సడెన్'గా ఉద్యోగంలోంచి లాగిపారేశాను. లాగిపారెయ్యనా

మరి ? వాడికి బదులు నాలుగు నెలల క్రితమే ఇంకొకణ్ణి వేసుకొన్నా! వచ్చిన కొత్తలో పదిరోజులవరకూ జాగ్రత్తగానే వుంటేవాడు వీడైనా. మళ్లీ పూర్వపు వాళ్లకి పట్టిన జాడ్యమే పట్టింది గావును వీడికూడాను! ఇదేమి రోగమో యీ నౌకర్లకి!

(కాసేపు ఆగి, పచార్లుచేస్తూ చదువుతూ మళ్లీ) ఇక నోటితో అరవడానికి శక్తిలేక, ప్రత్యేకంగా వీళ్లని పిలవడానికనే ఒక 'కాలింగుబెల్లు' కొనుక్కుందామని మొన్ననే హఠాత్తుగా ఒక 'ఐడియా' తట్టింది! తక్షణమే ఒక రిక్షాని మాట్లాడుకొని 'సిటీ ఎంపోరియమ్'కి వెళ్లేను! 'కాలింగుబెల్లులు' యీమధ్య గట్టిగా మ్రోగడంలేదని పత్రికల్లో పడిందని ఎవరో చెబితే కాబోలనుకొని వెనక్కు తిరిగివచ్చా! వెనక్కి రాకేంజేస్తాను? (తిరిగి రెండునిమిషాలు ఆగి పచార్లు చేస్తూ తరువాత బిగ్గరగా) ఒరేయ్ పంకాలు! ఓ ఫూల్సోయ్! ఓ పేజ్-సర్వెంటోయ్!

(పంకాలు వెనుకనుంచి అదురుపాటుగా పరుగెత్తుకూ వచ్చి ఊడిపోయిన తలపాగా చట్టుకొంటూ బయటవాడితోనో ఎవడితోనో గట్టిగ)

పంకాలు:—ఒక్కణ్ణిచేసి కొట్టగలిగేవు! అదైనా వీథిలోకి లాక్కొచ్చి మరీ కొట్టేవ్! ఇదేమా యింటిదగ్గరైతే నేనూ నా పెళ్లాం కలసి నిన్ను 'కైమా' చేసి వదిలి పెట్టేవాళ్లం.

వస్త్రప్ప:—(పంకాలుకంగారు చూసి) ఏమిట్రా యీగొడవ?

పంకాలు:—(అదురుపాటుతో వస్త్రప్పకేసి చూసి) ఏమీ లేదు బాబయ్యా! ఉన్నట్టుండొచ్చా! వీథిలోకి వెళ్లాను! వెళ్లినవాణ్ణి వెళ్లినట్టుండొచ్చా! ఎవరో పట్టుకొని తన్నుతూంటే చవటదద్దమ్మలా తెల్ల మొగంవేసుకొని ఊరుకొన్నాను.

వస్త్రప్ప:—(కంగారుతో) వాడు లోపలికి రావడంలేదు గదా కొంపతీసి!

పంకాలు:—అప్పుడే తలుపు బిడాయించానండి!

వస్త్రప్ప:—అసలు వా డెవడ్రా?

పంకాలు:—వా డెవడో తెలిసివుంటే అక్కడే పట్టుకొని చితకొట్టేవాణ్ణండి.

వస్త్రప్ప:—తెలిసినవాణ్ణి పట్టుకొని ఎప్పుడూ కొట్టకూడదు.

పంకాలు:—తెలీనివాణ్ణి పట్టుక్కొడితే చావ గొడతాడండి. (బిక్కమొగం చేసి) మిమ్మల్ని చూస్తూంటే కడుపులోంచి దుఃఖం పుట్టుకొస్తోంది బాబయ్యా! (అని బేరుమని ఏడుపు ప్రారంభిస్తాడు)

వస్త్రప్ప:—(తనూ బిక్కమొగం వేసి) అదేమిట్రా పంకాలూ?

పంకాలు:—విషయం విశదంగా చెబుదామన్నా దుఃఖం ఆపుకోలేకుండా వున్నాను బాబయ్యా! (అని మరీ వెక్కి వెక్కి ఏడుస్తాడు)

వస్త్రప్ప:—(పంకాలుని బతిమాలుకొంటూ) కష్టపడి ఎల్లాగో ఆపు చేసికోరా పంకాలూ! నేనెంత ఆపద వచ్చినా ఒక్కసారైనా గట్టిగా నీకుమల్లే ఏడిచానట్రా! విషయం ఏమిటో చెప్పరా!

పంకాలు:—వెళ్లక వెళ్లక...

వస్త్రప్ప:—ఊ... చెప్పు... ఏం చేశావ్?

పంకాలు:—వీథిల్లోకి వెళ్లేనండి.

వస్త్రప్ప:—(ఆశ్చర్యముతో) అయ్య బాబోయ్! వీథిల్లోకే! ఊ...వెడితే ఏం జరిగిందో చెప్పరా, చంపక!

పంకాలు:—(గొంతెత్తుకూ) అంతవరకూ నాదగ్గరే వుందండి బాబయ్యా!

వస్త్రప్ప:—(కంగారుతో) ఏమిట్రా వుంది?

పంకాలు:—ఎక్కడో పడిపోయిందండి బాబయ్యా! (అని బేరుమంటాడు)

వస్త్రప్ప:—ఏమిట్రా అది?

పంకాలు:—నిన్న మీరు నాచేత వ్రాయింపించిన కాగితం బాబయ్యా!

వస్త్రప్ప:—హారి నీ మండా మెయ్యా. ఇంతా చేసి ఇదిట్రా. నెధవ్వేషం నువ్వూను! పోతే

యింకొకటి ప్రాసుకొవచ్చన్లే. దాని కేమాత్రం వీనవాలట్రా.

(ఇంతలో నే ఎవరో తలుపు తట్టినట్లు శబ్దం విని పిస్తుంది).

వస్త్రిప్ప:— (ఖంగారుతో) ఎవరో తలుపు తట్టుతున్నార్రా!

పంకాలు:—ఇందాకా నన్ను చితకగొట్టిన వాడే నండి బాబూ.

వస్త్రిప్ప:—వాడే అని నీ కెల్లా తెలుసు?

పంకాలు:—(భయంతో) ఆ తలుపు కొట్టడం వాటం చూస్తే అచ్చంగా వాడేనని తెలిసిపోటల్లే దండీ?

వస్త్రిప్ప:— వాడల్లాగే తలుపు కొడుతూం టాడా?

పంకాలు:—అచ్చంగా మూమ్మూర్తులా వాడు అల్లాగే కొడుతూంటా డండి.

వస్త్రిప్ప:—ఆఁ! నువ్వాగు! నే వెళ్ళి కను క్కొంటాను వాడి సంగతేమిటో.

(అని ముందుకు వచ్చి మళ్ళీ వెనక్కు తగ్గి పంకా లుతో) వాడు పొగరుబోతు కాడుగదా!

పంకాలు:—అబ్బే! చాలా మంచివాడండి. నేనుమాత్రం ఇక్కడ లేనని చెప్పండి.

వస్త్రిప్ప:—వాడు పొగరుబోతు కాకపోతే నేను వెళ్ళటం. నువ్వే వెళ్ళు.

పంకాలు:—బాబోయ్! నేను వెళ్లను. వాడొక పెద్ద రౌడీ.

వస్త్రిప్ప:—బాబోయ్. రౌడీలంటే నాకు మా చెడ్డ భయం. పదిరోజుల క్రితం ఒక రౌడీ వీధిలో కనిపించి ఒద్దంటుంటే నిష్కారణంగా పట్టుకు చిత క్కొట్టేడు.... నేను తియ్యను. నువ్వే వెళ్ళి తియ్యి.

పంకాలు:—తలుపు తీస్తే లోపలికొచ్చి నది ద్దరి బుట్టలా ఛీకొట్టి చంపడుగదాండీ.

వస్త్రిప్ప:—నే నిప్పుడే అల్లా ఎక్కడికో పనుండి వెళ్ళేనని చెప్పు! ఇప్పుడప్పుడే రాననికూడా చెప్పు! అప్పుడు నీ ఒక్క బుట్టనే ఎల్లా ఛీకొడతాడో చూద్దాం!

పంకాలు:—నాకు భయంబాబూ. అసలు వాడు నన్ను ఇందాక నే చంపేసును! ఎందుకని ఊరు కొన్నాడోగాని.

(మళ్ళీ గట్టిగా తలుపు చప్పుడవుతుంది)

వస్త్రిప్ప:— (అతి ఖంగారుతో) ఒరేయ్! ఆలస్యంచేస్తే తలుపులు పగులగొట్టి లోపలికి వస్తా డేమోరా! ఎవర్నైనా మొగాళ్లను కేకేసుకొద్దామన్నా వీల్లేకపోయింది! వెధవ గొడవ!

పంకాలు:—లోపలి కెళ్లి అమ్మగార్ని కేకేసు కొని రానాండి!

వస్త్రప్ప:—అమ్మగారు ఊళ్లో లేరురా! ఆదే వొచ్చిన పెద్ద చిక్కు! ఆవిడ వుంటే కోకలి పుచ్చుకొని చితకబాదేసును వెధవని! (కొంచెంసేపు ఆగి) ఆ! ఆఁ! ఒక ఆలోచన తట్టింది!

పంకాలు:—తట్టిందీ! వాడు రాకుండా తొంద రగా చెప్పండి!

వస్త్రప్ప:—తలుపు తీయకుండా ఇవతలనుంచే ఆడవాళ్లో మొగవాళ్లో కనుక్కో! ఆడవాళ్లయితే బందే లేదు. తలుపు నిర్భయంగా తీసెయ్యి! మొగవా ళ్లయితే యిప్పుడు వీల్లేదు; అవతలకి వెళ్లమను! ఎంత చెప్పినా వెళ్లకపోతే నే నొచ్చి అవతలకి గెంటి పారేస్తాను!

(పంకాలు పోయి తిరిగి కొద్దిసేపట్లో ఒచ్చి)

పంకాలు:—ఆడవాళ్లే నంటున్నారు, తలుపు తియ్యనాండీ?

వస్త్రప్ప:—(ఖులాసాతో బల్లమీద వున్న సామాను సర్దుతూ) ఆడవాళ్లేనట్రా! మొదట్లో నే నల్లాగే అనుకొన్నాను సుమా! మొగాళ్లొస్తే తొంద రగా నా దర్శనం కాదని నాదగ్గరకి సాధారణంగా ఆడవాళ్లే ఒస్తూంటారు. (సర్దుబాటు అయినపిదప తాను కుర్చీలో కూర్చొని ఏదో పుస్తకం తీసి శ్రద్ధతో చదువు తున్నట్లు నటించి) ఆఁ! ఇప్పుడు తలుపుతీసి నాదగ్గరకు పంపించు.

(పంకాలు పోయి భూతాల్ని వెంటబెట్టుకొని వస్తాడు.)

వస్త్రప్ప:—(తనవెనక నిలబడివున్న భూతాల్ని చూడకుండా తనపనిలోనే నిమగ్నుడై వున్నట్టు నటించి) మీ పేరుని ఏమని అంటూవుంటారండి?

భూతాలు:—నా పేరుని 'భూతాలూ' అని ముద్దుగా పిలుస్తూంటారండి.

వస్త్రప్ప:—(ఖంగారుపడి) మీ పేరుమాత్రమే భూతాలాండి, లేక మీరు నిజంగాకూడా భూతాలాండి? (అంటూ తాను చదువుతున్న పుస్తకం టేబిలు మీద వుంచి భూతాల్ని చూస్తాడు. తిరిగి పంకాలుతో) ఏరా కుంకా! ఆడవాడే అన్నావు కాదట్రా.

పంకాలు:—ఆయన అల్లాగే చెప్పేడండి.

వస్త్రప్ప:—(భూతాలుకేసి తిరిగి) ఏమండి మీరు నిజంగా అల్లాగే చెప్పేరాండి?

భూతాలు:—అల్లాగే చెప్పేనండి.

వస్త్రప్ప:—మీరు పెద్దమనుష్యులు, పతివ్రతలూగదా! అల్లా అబద్ధా లాడచ్చా చెప్పండి మరి.

భూతాలు:—అబ్బే మొదట మొగవాణ్ణే అని చెప్పేనండి. మొగవాళ్లని లోపలికి రానివ్వడానికి 'పర్మిషన్' లేదన్నాడండి. అంటే, పోనీ ఆడదాన్నే అన్నానండి.

వస్త్రప్ప:—ఏరా పంకాలు, ఈయన చెపుతున్నదంతా నైజేనా, లేక దీనిలో మళ్లీ ఏమైనా అబద్ధాలున్నాయా?

పంకాలు:—అబ్బే, ఏమీ లేదండి. ఈ, చలు తప్పకుండా అంతా నైజే చెపుతూన్నాడండి.

వస్త్రప్ప:—సరే. అయితే, నీవు పోయి గేటు దగ్గరే కాపలా కాస్తూండు. నేను కేక వేసినప్పుడు మాత్రం వెంటనే రా.

(పంకాలు కొంతదూరం పోయి తిరిగి వెనక్కు వచ్చి)

పంకాలు:—నేను గేటుదగ్గరే వుండనాండి?

వస్త్రప్ప—(కోపంతో) నువ్వు గేటుదగ్గిర వుండకపోతే గేటు నీదగ్గిర వుంటుందట్రా కుంకా.

(పంకాలు చిత్తం చిత్తం అంటూ వెళ్లిపోతాడు)

వస్త్రప్ప:—అయితే యింతకీ మీ రెవరండీ?

భూతాలు:—మీకు జ్ఞాపకం లేదండీ?

వస్త్రప్ప:—రోజుకి లక్షా ఏభై వేలమంది ఒచ్చిపోతూంటారు. నాకొక లెక్కా. ఇంతకీ, బలవంత పెట్టక, మీ రెవరో తొందరగా అఘోరిస్తురూ.

భూతాలు:—సంవత్సరం క్రితం మీరు పెంటాల పాలెంలో మాయింట్లోనే కావండీ అద్దెకు వుంటూండేవారు?

వస్త్రప్ప:—ఆ. కొన్నిలక్షలమంది ఇళ్లల్లో అద్దెకు వుంటాం. మాకు జ్ఞాపకమా, దిబ్బా?

భూతాలు:—పెంటాలపాలెంలో వేదాంతం గారి అబ్బాయినండి!

వస్త్రప్ప:—(జ్ఞప్తికి తెచ్చుకొని, అతణ్ణి పరకాయించిచూస్తూ) ఓ! పెంటాలపాలెం వేదాంతంగారి అబ్బాయివుటోయ్ నీవు! ఏదీ? మీ నాన్నగారు ప్లీడరునుమాస్తా చేస్తూండేవారు కాదూ?

భూతాలు:—(తలూపుతూ) అవునండి.

వస్త్రప్ప:—ఎప్పుడో చిన్నతనంలో చూశాను, కొన్ని లక్షలమందిని చూస్తూంటాను. జ్ఞాపకమా ఏమైనానా? అప్పుడు బాగా పొట్టిగా, ఎఱ్ఱగా, బుఱ్ఱగా, నల్లగా వుండేవాడివి. ఇప్పుడు బాగా పొడుగెదిగావుస్మా. అప్పట్లో ఇంత గోచీ పెట్టుకొని మీ నాన్న చదువుకోమంటే పారిపోయివచ్చి గోలీకాయలు ఆడుకొనేవాడివి. నీకు జ్ఞాపక ముండదులే. నీకు బాగా చిన్నవయస్సు.

భూతాలు:—ఆ, జ్ఞాపకం లేకపోవడ మేమిటి? నాకూ బాగా గుర్తుంది. ఓ మాటు మీరు కొబ్బరికాయలకని బజారుకు వెళ్లి ఏం లేవాలో మరచిపోయి యింటికి వస్తే మీ భార్యగారు మిమ్మల్ని గట్టిగా మందలించారు కాదూ? అంతా గుర్తేనండి.

వస్త్రప్ప:—మనమొహంలా గుంది. (కేల మీదకు చూపిస్తూ) కూర్చో పాపం. నిలబడ్డా వెందుకు! (అంటూ తను కుర్చీలో కూర్చుంటాడు.)

భూతాలు:—నాకు క్రింద కూర్చోవడం బొత్తిగా అలవాటు లేదండి!

వస్త్రిప్ప:—అయ్యో పాపం. కుర్చీ వేయిస్తా నాగు. ఒరేయ్ పంకాలూ.

(పంకాలు పరిగెత్తుకొని వస్తాడు).

వస్త్రిప్ప:—ఇదిగో. (తాను కుర్చీలోనుండి లేచి) యీ కుర్చీ పట్టుకొని వెళ్ళి ఆయన నిలబడ్డచోట వెయ్యి.

(పంకాలు అట్లు చేసి పోవును. భూతాలు ఆ కుర్చీలో కూలబడును. వస్త్రిప్ప నిలబడేవుండి మాట్లాడుచూంటాడు)

వస్త్రిప్ప:—అవునుగాని, పాపం, నువ్వెక్కడ్నుంచి వస్తున్నావు?

భూతాలు:—మా వూరినించే వస్తున్నానండి.

వస్త్రిప్ప:—ఇంటిదగ్గర అందరూ క్షేమంగా వున్నారూ?

భూతాలు:—అందరూ ఎవరున్నారండి? మా అమ్మ, ఆమెకు నేను—మేమిద్దరమే కాదండీ!

వస్త్రిప్ప:—ఏం? పాపం, మీ నాన్నగారు లేరు య్యారు?

భూతాలు:—ఆయన, మీరు మా వూరినుంచి వెళ్ళిపోయిన పదిరోజులకే పోయారండి.

వస్త్రిప్ప:—పోయారూ. పోనీ. (విచారమును నటించి) పోయారా! అయ్యోపాపం. ఎంతొట్టు పడితే అంతొట్టు వేసి చెబుతున్నా భూతాలూ, నాకు కడుపులోంచి చెప్పరానంత దుఃఖం వచ్చిపడుతోందంటే నమ్మ!

భూతాలు:—ఎంతమాట? ఎంతమాట? మీ మీద నా కంత నమ్మకం లేదూ?

వస్త్రిప్ప:—అవునుగాని. ఎల్లా పోయేరోయ్ పాపం. నాపతాయిలాంటి మనిషి. ఏమొచ్చిపడ్డది? ఆకునుమీద నిలబడితే అచ్చంగా పిప్పళ్లబస్తాలా వుండేవాడు. ఏమొచ్చిందో ఏమిటో పాపం!

భూతాలు:—కొందరు దుర్మార్గు లాయన్ని లావుగా వుండేవారని దిష్టికొట్టడంచేత మరణించి వుంటారు అని కొందరు చెప్పుకొంటూవుంటారండి.

వస్త్రిప్ప:—మరికొంద రేమని చెప్పుకొంటూ వుంటారండి?

భూతాలు:—కొన్ని పిశాచాలు దయ్యాలు భూతాలు ఆయన్ని చంపేశాయని మరి కొంద రంటూం డేవారండి. ఇంతకీ ఎవళ్లది తప్పో, ఎవళ్లది రైటో మాత్రం తెలీదండి. చచ్చిపోవడం మాత్రం ఖరాగా చచ్చి పోయారండి. దాంట్లో సందేహ మేం లేదండి.

వస్త్రిప్ప:—అయితే, పాపం, మీ అమ్మగారెక్కడ వుంటున్నారూ? ... ఆ ... ఎక్కడ వుంటారూ? అక్కడే వుంటున్నారు కాబోలు... అయితే, పాపం, నీ వేం చదువుతున్నావ్?... ఏం చదువుతావులే పాపం?

భూతాలు:—బి. ఏ. ప్యాసవుదా మనుకొన్నానండి.

వస్త్రిప్ప:—అవలేకపోయావూ?

భూతాలు:—అయ్యేవుండు నండి. కాని అవబోతూంటే మా నాన్నగారు మరణించా రండి.

వస్త్రిప్ప:—అదేం పనోయ్, మీ నాన్నగారు చాలా అసందర్భంగా పోయారు. నువ్వు ప్యాసవబోతుంటేనే పోవాలా. ఆయనకి మాత్రం తెలీదూ. ఒకవేళ తెలివితక్కువగా ఆయన పోతేమాత్రం ప్యాసవడం ఎందుకు మానేశావ్ నువ్వు?

భూతాలు:—ఆయనమరణానికి కేవలం దయ్యాలూ, భూతాలూ, పిశాచాలూ కారణం అని కొందరు చెప్పబట్టి......

వస్త్రిప్ప:—ఆయన్ని పాపం పీక్కుతినేశాయ్ కాబోలు. అయితే, ఒకటి తెలీక అడుగుతాను భూతాలూ. ఇంకా యీకాలంలోకూడా దయ్యాలూ, పిశాచాలూ, భూతాలూ వున్నాయంటావా?

భూతాలు:—అందులో మీ కింకా ఏమైనా సందేహం వుందా!

వస్త్రిప్ప:—అక్కే, సందేహం ఏమీ లేదు. మొన్న నే నాకూ కనిపించాయి కొన్ని. ఏమిటో అను

కొని దగ్గిరికెళ్లి ధైర్యంగా అడిగితే నేను చంపుతా నేమోనని భలానా అని చెప్పడానికి భయపడ్డాయి. అయితే, నీకు దెయ్యాల్ని చంపడ మొచ్చునటోయ్ భూతాలూ?

భూతాలు:—ఒక్క చంపడమే కాదు. వాటిని ఎక్కడ పడితే అక్కడ, ఎన్ని కావలిస్తే అన్నింటిని సృష్టించిపారెయ్యడమూ, వాటిచేత పాటలు వగైరాలు పాడించడమూ, డ్యాన్సులు చేయించడమూ, అన్నీ వచ్చునండి.

వస్త్రప్ప:—అయితే దెయ్యాలభాష క్షుణ్ణంగా వచ్చునన్న మాట.

భూతాలు:—మంచిమాటే! అది రాకుండా యివన్నీ ఎలా వస్తాయి?

వస్త్రప్ప:—అబ్బ! నీవు అఖండుడవోయ్ భూతాలూ. అయితే, తెలీక అడుగుతాను—ఇవన్నీ నీవు ఎక్కడ నేర్చుకొన్నావోయ్?

భూతాలు:—చెప్పేది సావకాశంగా వినండి మరి.

వస్త్రప్ప:—ఊ...చెప్పు...చెప్పు.

భూతాలు:—పరీక్షిత్తుమహారాజు పాములచే చంపబడ్డాడని తెలిసి ఆయనకొడుకైన జనమేజయుడు సర్పయాగం చేసినట్టుగానే, మా తండ్రిగార్ని చంపినవి కేవలం పిశాచాలు, దెయ్యాలు అయివుంటాయని తలచి భూతాలయాగం చెయ్యదలుచుకొన్నాను.

వస్త్రప్ప:—ఊ......చెయ్యదల్చుకొని ఏం చేశావ్?

భూతాలు:—అప్పట్నుంచి లోకంలో వున్న భూతవైద్యులందరి దర్శనం చేసి వారివలన భూతాల కిటుకంతా నేర్చుకొన్నా.

వస్త్రప్ప:—అబ్బ! ఎంత అఖండుడవోయ్.

భూతాలు:—చవటదద్దమ్మలా నేర్చుకొని ఊరుకొంటే మంచిదికాదని తలచి "భూతాలు" అని ఒక బిరుదుకూడ తగిలించుకొన్నా.

వస్త్రప్ప:—ఆ. హ. హ. నీవు రావడంచేత నా యిల్లు నిజంగా పావనమైందనుకో భూతాలూ. అయితే ఒక్క సందేహం భూతాలూ.

భూతాలు:—ఏమిటో చెప్పండి. మూడు నిమిషాల్లో నివృత్తిచేస్తాను.

వస్త్రప్ప:—మా యింట్లో ఇప్పు డేమైనా భూతా లున్నాయంటావా?

భూతాలు:—ఉండొచ్చు, ఉండకపోవచ్చు; అదంతా వేరే సంగతి.

వస్త్రప్ప:—వేరే సంగతేమిటి నీ మొగం నా మొగమూనూ. ఇదంతా భూతాల సంగతి కాదూ?

భూతాలు:—పిశాచాలని, దెయ్యాలనిగురించి చెప్పవలసివస్తే చాలా గ్రంథం ఉంది. అది ఎవరికి పడితే వారికి చెప్పకూడదు. అందులోనూ తెలియని వాళ్లకి అసలు చెప్పకూడదు.

వస్త్రప్ప:—చెప్పకపోతే మానెయ్యి. మాకేం భూతాల్నిగురించి చెపితే వచ్చిందీ లేదు; చెప్పకపోతే ఇంట్లో వున్నది పోయేదీ లేదు. ఏం? మాకు మాత్రం లోటనుకున్నావా? మాకు నిత్య పంట, ఒద్దంటే ఒచ్చి పడుతుంది. తెల్లవారి లేస్తే చాలు, వర్జాలకనో, వారాలకనో, తారీకులకనో, తేదీలకనో, నెలలకనో, సంవత్సరాలకనో, పెళ్లిళ్లకనో, పేరంటాలకనో, పళ్లు తోముకోడానికనో మాయింటికి అస్తమానం వచ్చి పోతూంటారు.

భూతాలు:—ఈవేళ యింకా ఎవరూ రాలే దేమండీ?

వస్త్రప్ప:—ఎవరూ రాకపోవ డేమిటి మన మొఖం. నువ్వు రాలేదూ. అదీగాక ఈరోజు ఆదివారం. సెలవురోజు.

భూతాలు:—దేనికి సెలవు?

వస్త్రప్ప:—దేనికేమిటి మన పిండాకూడు. గవర్నమెంటు రూళ్లప్రకారం ఆదివారం అన్నింటికీ సెలవే. మాయింటికికూడా సెలవే లేకపోతేనా! ఈ పాటికి ఎంతమంది ఒద్దురు, ఎంతమంది పోదురు. మామూలురోజుల్లో ఒక్క క్షణమైనా తీరిక వుండ దంటే నమ్ము. తెల్లారిందో లేదో ఎవడో వచ్చి,

గాఢంగా నిద్రపోతున్న నన్ను లేపి, యీ వేళ ఏ వార మైందండీ అన్నాడు. వాడు వెళ్ళగానే మరొక ఆసామీ వచ్చి "మా అమ్మాయిని యింకొకరి అబ్బాయి చేతి కిచ్చి ఆ పెళ్ళి కర్తగారి యింటికి పంపిస్తున్నాను, ఎప్పుడు బయల్దేరితే మంచిదండీ?" అని పలహా అడగడాని కొచ్చాడు. వాడూ నుమ్మం దిగాడో లేదో, హఠాత్తుగా యింకొకడొచ్చి "యీ వేళ తారీకెంత అయిందండి" అని అడిగాడు. వాడి వెనకాలే అమాంతంగా యింకొకడొచ్చి "నిన్న సూర్యోదయం ఎంతకైందండి" అన్నాడు. వాడికి ముందుగానే యింకొకడు వచ్చి "ఈ రోజు వర్జాలు ఎన్నింటితో 'బిగిసి' ఎంతతో 'ఎం'డవతాయండీ" అన్నాడు. వాడూ వెళ్ళగానే యింకొకడొచ్చి ఏదో అడిగేడు మరచిపోయాను. ఇల్లాగే ప్రొద్దున్న లేచింది మొదలు మధ్యాహ్నము పడుక్కోబోయేవరకూ ఊపిరి పీల్చుకొనేందుకైనా ఖాళీ లేకుండా, జనం, డాక్టరాసుపత్రిలోకి మల్లే వచ్చి వెడుతూ నేవుంటారు. గవర్నమెంటు ప్లీడరుగారి యిల్లయినా యింత హడావిడిగా వుండదంటే నమ్మ. పోనీ, వచ్చినవాళ్లు వచ్చి, వెళ్ళిపోయేవారు వెళ్ళిపోయేటప్పుడు మామూలుగా వెళ్ళిపోయినట్టు వెళ్ళిపోవచ్చా? ఒద్దు మహాప్రభో అంటున్నా వినకుండా, తలో కుంచెడు నూకలు ఆ గంగాళంలో పోసి పోతూంటారు.

భూతాలు:—ఆహాహా! ఎంత హాయిగా వుందండీ మీపని. మా నాన్నగారు నాకూడా చిన్నతనంలో వారాలు, తేదీలు, సంవత్సరాలు, నెలలు చెప్పడం నేర్పివుంటే యీపాటికి కుబేరుడి తల తన్నేవాడిని కాదూ.

వస్త్రప్ప:—ఈ జనంబాధ పడలేక, నెలకు ఒక వంద రూపాయిలు పారేసి, గేటుకాపర్ని ఒకణ్ణి పెట్టుకొన్నాను.

భూతాలు:—మహా మంచిపని చేశారండి. కాని మన మాటల సందర్భంలో ఇద్దరంకూడా నామాట మరచిపోయామండి.

వస్త్రప్ప:—అయ్యో పాపం!! నేను మరచిపోతే కాస్త నువ్వైనా జ్ఞాపకం చేయకూడదూ? అంతా మొగమాటాలూ, ఇదులూనూ.

భూతాలు:—చాలా ప్రయాణంబడలికమీద వచ్చాను.

వస్త్రప్ప:—మేలుమీద రాలేకపోయావ్. తొందరగా వచ్చేవాడివి.

భూతాలు:—ఒళ్లు నొప్పులుగా వున్నాయి.

వస్త్రిప్ప:—అందులోనూ భూతాలూ, నీవు మరీ అసందర్భంగా బయల్దేరేవోయ్. నిన్న అమావాస్య. అమావాస్యనాడు బయల్దేరినవాళ్లని ఒళ్లు నొప్పులు పీకించి పీడించి ఆఖరికి అమాంతంగా తినేస్తాయి అని మా శాస్త్రాల్లో వుంది.

భూతాలు:— అటువంటి ఒళ్లు నొప్పులు మాలాంటి భూతవైద్యుల దరిచేరబోవని కూడా మా శాస్త్రాల్లో వుందండీ.

వస్త్రిప్ప:—ఉందీ? ఉండనీ డాన్నల్లాగ' భోంచేసి బయల్దేరేవా?

భూతాలు:—బయల్దేరబోయే ముందు భోంచేశానండి. కాని ఎప్పుడో నిన్న తెల్లవారుఝామున ఖంగారుతో తిన్న అన్నమండి. ఇంకా వుంటుందీ!

వస్త్రిప్ప:—కాని ఒచ్చిన చిక్కేమిటంటే, భూతాలూ, బొత్తిగా రేవనుకోజులోయ్. పూట గడవడానికి ఛస్తున్నామనుకో. అందులోనూ, నేను సంపాదించడం మానేశాను. ప్రస్తుతం సంపాదనబాధ్యతంతా మా ఆవిడనెత్తిమీద పడింది. ఎల్లప్పుడూ మనం సంపాదిస్తే ఆడవాళ్ళకి సంపాదించడం ఎల్లా చేతనవుతుంది? ఎల్లకాలమూ మనం వుంటామా ఏమిస్తామా అని ప్రస్తుతం నేను మా భార్యని ధనసంపాదనకి 'ట్రైనప్పు' చేస్తున్నా. ఇప్పుడు యింటినొడవలన్నీ ఆవిడవి. ఆవిడ పర్మిషన్ లేనిదే నేనైనా భోంచెయ్య కూడదు. అందులోనూ ఆవిడ మన దురదృష్టంవలన ఊళ్లో లేకుండా పుట్టింటికి వెళ్ళిపోయింది. ఉన్న సంగతి దాచకుండా చెప్పేశాను. ఏమీ అనుకోని లోపల బాధపడకు.

భూతాలు:—అనుకోడానికి లోపల ఏమీ లేదు లెండి. అసలుసంగతి చెప్పడానికి, పాపం, నాకు జాలేస్తోంది. వచ్చినవైద్యవఖర్మ ఏమిటంటే, నేను

ఉండికుండి భూతాలనై దుర్లక్షణయి ఉనుకొన్నాను. అల్లా అవడంచేత నిత్యమూ ఏక్తై అరనై భూతాలు నాలో మూర్తీభవించి ఉంటాయి. నేను తినకపోతే యిబ్బందే లేదు. కాని వాటికి బొత్తిగా ఆకలివేస్తే లోపల్నుంచి పైకి చక్కా వస్తాయి. అక్కడికీ ప్రయాణం దోవలో రెండుమూడుసార్లు తెగఆకలేసి అప్పుడప్పుడు బయటకు వచ్చేవి.

వస్త్రిప్ప:—అబ్బా! పాపం, రైల్లో ప్రయాణం చేసిన మిగతా వాళ్లు భయపడలేదుగదా.

భూతాలు:—ఇల్లా భయపడతారనే ఓమూల ఎవరికీ కన్పించకుండా కూర్చున్నాను.

వస్త్రిప్ప:—(భయపడి) పాపం. అల్లా అయితే వాట్లకి కష్టం కల్గించకు. ఎల్లప్పుడూ మనింటికి రమ్మంటే మాత్రం అవి వస్తాయా ఏమైనానా? ఏదో యాదాలాభంగా వచ్చాయి. ఉంటే యీ పూటకి వుంటాయి. మహావుంటే యీ రోజుకి వుంటాయి. రేపటికి వుండమని బ్రతిమాలితేమాత్రం వుంటాయా?

భూతాలు:—అంతగా బ్రతిమాలితే వుంటాయనుకోండి. ఉన్నా వారం పదిరోజులకన్నా ఎక్కువ వుండవు. మీరు మాత్రం లోపల ఏమీ బాధ పడకండిస్వామీ.

వస్త్రిప్ప:—ఏం. ఒకవేళ బాధపడితే అవి పైకొచ్చి మీదపడి మింగేస్తాయా?

భూతాలు:—ఉత్తినే మింగేసి పూరుకుంటే బాగానే వుండును. చంపేస్తాయికూడాను.

వస్త్రిప్ప:—(లేని నవ్వు తెచ్చిపెట్టుకొని) సరే రండి. భోజనంచేసి ఏర్పాట్లు చేసుకొందాం. యీ రోజు మా ఆవిడ లేనిమూలాన్ని వంటాగింటా నేనే చేసేను. అన్నం ఇదివరకే వండేశాను. కూరలో పోపువేసి పొయ్యిమీదనుంచి క్రిందకు దింపడమే తరవాయి.

భూతాలు:—మీరు లోపలికి వెళ్లి ఆ ఏర్పాట్లు అన్నీ చేసి సిద్ధంగా వుంచండి. నేను కొంచెము జపం చేసుకొని వస్తాను.

(వస్త్రిప్ప నిష్క్రమించును.)

భూతాలు:—పడ్డాడు! వలలో పడ్డాడు! పిచ్చివెధవ లేస్తాడేం నాదగ్గర. ఇంట్లో అద్దెకు వున్నట్టే వుండి, యింట్లో సామానంతా ఎవళ్లూ ఊళ్లో లేని సమయంచూసి, పదినెలల అద్దె ఇవ్వకుండా తస్కరించుకొని చక్కా వస్తాడూ! ఇతరులవాళ్లే వెఱ్ఱిదద్దమ్మలనుకొన్నాడు కాబోలు. అప్పుడే అయిందా ఏడి పని? ఇంకా ముప్పతిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్లు తాగించందే ఊరుకొంటానా? (కొంచెముసేపు ఆగి) అమాయికపు వెధవ. ఏంచెబితే అదే నమ్మేస్తాడు. నిజమేదో అబద్ధమేదో తెల్సుకోలేడు. ఇతరులను ఏడిపించి డబ్బులాగడం, విచిత్రంగా దొంగతనాలు చెయ్యడం ఇవన్నీ మహాబాగా తెలుసు. అప్పుడే ఏమైంది ఏడిపని. ముందుంది ముసళ్ల పండగ.

(నిష్క్రమించును.)

## రెండవ రంగము

(నౌకరైన పంకాలు టేబిలు, కుర్చీలు గుడ్డతో దులుపుతూంటాడు. యజమానియైన వస్త్రిప్ప నెత్తి, గుండెలు బాదుకొంటూ పెద్ద పెద్ద అరుపులతో తయారవుతాడు)

వస్త్రిప్ప:—కొంప ముంచేశావురా పంకాలూ. ఇల్లూ, ఒళ్లూ దిబ్బ చేసేశావురా వెధవా. ఎంత పని చేశావురా నీయుండా మొయ్యా! ఇంత చవట వనుకో లేదురా వవల దద్దమ్మా. (అని పంకాలునెత్తిమీద కూడ బాదును.)

పంకాలు:—నే నేం చేశాను బాబయ్యా?

వస్త్రిప్ప:—(ఉగ్రుడై) ఇంకా నెమ్మదిగా ఏంచేశా నంటావట్రా దొంగసీమగా! పెనుభూతాన్ని తెచ్చి యింట్లో పడేశావురా. నీ కొంప ఊడిరా. ఆడవాళ్లయితేనే రానివ్వరా, మొగాళ్లని లోపలికి అడుగు పెట్టనీయకురా అంటే విన్నావట్రా.

పంకాలు:—మీరుకూడా చూసి అతను ఆడవాడేనని ఒప్పుకొన్నారు కాదండీ.

వస్త్రిప్ప:—వాడి పేరునిబట్టయినా తెలుసుకోలేకపోయేవట్రా వాడొక పెనుభూతగాడని.

పంకాలు:—"బాబుగారికి గట్టిగా కోపంవస్తే బుజ్జి చితకబాదుకొంటారు. వెళ్లద్దు" అని ఎంత చెప్పినా వినిపించుకోలేదు బాబూ.

వస్తాదిప్ప:—నీవు నేటుకాపరివనాని కొంత మాత్రం 'మాట' వ్వరా.

పంకాలు—నేను పనిలో చేరబోయేముందే మనవి చేసుకొన్నాగాదూ బాబూ, నేను నేటుకాపర్ని గాదు ఉత్తివాకర్నని.

వస్తాదిప్ప:—నువ్విల్లా అనబట్టే నీ చేతు లరిగే టట్టు నీవు మాయింట అవలంబింపవలసిన రూల్సు వ్రాయింపించి, నీ చేత కంఠతా వేయించాను కొద్దోటా కుంతా.

పంకాలు:—ఆ రూళ్ల కాగితం ఎక్కడో పారేసు కొన్నానని ముందే తమతో చెప్పుకొన్నాను గాదండీ.

వస్తాదిప్ప:—అయితే యీ కాగితం, సిరాబుడ్డి తీసికొని (అవి వానికి అందిస్తూ) మళ్లీ చెబుతాను వ్రాసుకో. నీకు అక్షరాలు వ్రాయడం వచ్చునుకాదూ?

పంకాలు:—(కాగితం, కలం, సిరాబుడ్డి అందు కొని) చిత్తం. చిన్నప్పుడే కొంచెం నేర్చుకొన్నా నండి.

వస్తాదిప్ప:—రూల్సు నెంబరు వన్...వ్రాసు కొంటున్నావా?

పంకాలు:—చిత్తం. చిత్తం. చెప్పండి. (సీరి యస్‌గా వ్రాయడం మొదలుపెడతాడు)

వస్తాదిప్ప:—అధికారి అయిన తన యజమాని పిలవగానే, నాకరు అయిన బంట్రోతు పబ్బివాడు చిత్తం చిత్తం అని చేతులు నలిమికొంటూ... ఇదిగో...ఇల్లా చూడు...(చేతులు నలుముకొంటూ అభినయించి చూపిస్తూ) ఇల్లా చేతులు నలపాలి... వ్రాసుకో...చేతులు నలిమికొంటూ, చిత్తం చిత్తం అంటూ పరుగెత్తుకొని రావాలి.

పంకాలు:—(వస్తాదిప్ప అభినయమును జాగ్రత్తగా పరికించుచూ అర్థమయినట్లు బుఱ్ఱూపుతూ) చిత్తం. చిత్తం. వ్రాశానండి.

వస్తాదిప్ప:—ఇల్లా చెయ్యకపోతే శిక్ష ఏమిటో తెల్సా. మూడు కొరడా దెబ్బలు. శిక్షకూడా క్రింద వ్రాసుకో. బాగా తెలుస్తూంటుంది.

పంకాలు:—చిత్తం. చిత్తం. (వ్రాసుకొంటూ) శిక్ష మూడు కొరడాదెబ్బలు......వ్రాశానండి.

వస్తాదిప్ప:—రూల్సు నెంబరు టూ. యజమాని పిలిచిన కేక గనక ఏకారణంచేతనైనా బంట్రోతు పబ్బివాడికి వినిపించకపోతే తక్షణం యజమానినైన నా దగ్గఱ కొచ్చి 'నాకు బొత్తిగా వినిపించడము లేదు' అని సవ్యంగా మనవి చేసుకోవాలి.

పంకాలు:—(వ్రాసికొని) దీనికి శిక్ష ఏమి టండీ.

వస్తాదిప్ప:—చెబుతున్నా, వ్రాసుకో. నాలుగు గోడకుర్చీలు.

పంకాలు:—చిత్తం.(వ్రాసుకొని) వ్రాశానండి. కాని ఒక్క సందేహమండి...

వస్తాదిప్ప:—(వాని మాటలకు అడ్డం వచ్చి) ఆ సందేహాలన్నీ తీరుబడిగా కూర్చొన్నప్పుడు తీరుస్తాను. ముందు వ్రాసుకోవోయ్ ఫుల్లయ్యా.

పంకాలు:—చిత్తం. చిత్తం.

వస్తాదిప్ప:—రూల్సు నెంబరు మూడు. నాకరు పబ్బివాడు గుమ్మంవద్ద నిలబడి, బంధువులుగాని, చుట్ట ములుగాని, స్నేహితులుగాని, మిత్రులుగాని, శత్రు వులుగాని, విరోధులుగాని, పిన్నలుగాని, పెద్దలుగాని, దొంగలుకాని, దొరసాన్లుగాని వచ్చినయెడల వినాయ్ నికి కరువురోజులు కాబట్టి అవ మగ వివక్షత లేకుండా, భోజనముచేసితిమని ఒట్టేయించుకున్న తర్వాతగాని లోనికి రానీయరాదు.

పంకాలు—చిత్తం. చిత్తం.

వస్తాదిప్ప:— బ్రాకెట్టు పెట్టుకొని యిల్లా వ్రాసుకో.

పంకాలు:—చిత్తం.

వస్తాదిప్ప:— పూర్వము మనము అద్దెకువున్న ఇళ్లతాలూకు వాళ్లైనళ్లైనాసరే.

పంకాలు:—చిత్తం.

వస్త్రిప్పః— శిక్ష. ఏభై గుంజీలు. అరవై బస్కీలు. డెబ్భై దండీలు.

(మస్తుగా భోంచేసి లోపలినుండి పట్టుపంచి విప్పకుండా తడితువ్వాలు భుజముపై వేసుకొని భూతాలు లోపలినుండి వస్తూంటాడు)

వస్త్రిప్పః—(లోనుండి వస్తున్న భూతాల్ని చూసి కంగారుగా పంకాలుతో) అదుగో. దిమ్మచెక్కలా కడుపునిండా భోంచేసి ఇల్లా వస్తున్నాడా భూతాలు గాడు. యీ కాగితాలూ అదీ ఇక్కడ పెట్టి నువ్వు వెళ్లిపో. (అని పంకాలు చేతిలోని కాగితాన్ని, సిరా బుడ్డిని లాక్కొని టేబిల్ మీద కనిపించకుండా దాస్తాడు. పంకాలు నిష్క్రమించగా, వెంటనే భూతాలు వస్తాడు.)

వస్త్రిప్పః— మొగమాటం లేకుండా కడుపు నిండా భోంచేశారూ?

భూతాలుః—ఆఁ, ఏదో తమరి దయవలన. పాపం నేను మాత్రం మీకు చాలా బరువుగా వున్నాను.

వస్త్రిప్పః—ఎంతమాట! మీకంటె నే నే బరువెక్కువుంటాను.

భూతాలుః—(స్థిమితంగా కుర్చీలో కూర్చొని) అయితే నే నొచ్చిన పనేదో కాస్త చెబుతాను వింటారూ?

వస్త్రిప్పః—మీరు కొంపదీసి వేరే ఒక పని మీద కూడా వచ్చారేమిటి? మామూలుగా వచ్చి మామూలుగా వెళ్లిపోతా రనుకొంటున్నాను.

భూతాలుః—మా ఇంటినుండి మీరు వెళ్ళిపోయేటప్పుడు ఒక పెద్ద గంగాళం, రెండు నిండా మెంతికాయ వున్న రాచ్చిప్పలు, ఉల్లావకాయి కుండలు, పెద్దజేగిసా, నాలుగు ఇత్తడి చెంబులూ మా అటక మీదివి దొంగిలించుకొని తీసుకొనివచ్చారట. అవి మర్యాదగా మాకు ఒప్పజెప్పి మీ మర్యాద మీరు కాపాడుకోవలసిందిగా మా అమ్మగారు చెప్పి పంపించారు.

వస్త్రిప్పః—అవి నేనే తెచ్చేనని మీ కెవరు చెప్పేరు...ఆ...ఎవరు చెపుతారు...ఆ ప్రక్కనున్నవాళ్ళెవళ్లో చెప్పివుంటారు...అల్లా చెప్పేవాళ్లకి మాత్రం బుద్ధి వుండక్కర్లేకూ. ఇళ్లు గలవాళ్లు, దాంట్లో అద్దెకున్నవాళ్లు కోపాలొస్తే లక్ష తెచ్చుకుంటారు, ప్రేమలొస్తే లక్ష యిచ్చుకొంటారు. మధ్యన వాళ్ళ కెందుకు?

భూతాలుః— (ఉగ్రుడై) పాడు ప్రేలాపన కట్టిపెట్టి మావి మాకు ఒప్పజెప్పు.

వస్త్రిప్పః—ఆ మాటకొస్తే అసలు నేను తేనే లేదు. మావే రెండు పాతచింతకాయపచ్చడి రాచ్చిప్పలు మీ అటకమీద మరిచిపోయి వదిలేసి వచ్చాను. సత్యంగా అవి పట్టుకొచ్చి మీవి మీరు పట్టిగెళ్లండి.

భూతాలుః—ఎత్తుకు పైఎత్తు వేస్తున్నారేమిటి, పట్టుకు బాదెయ్యగలను.

వస్త్రిప్పః—ఆగు. ఆగు. ఒరేయ్ పంకాలూ.

(పంకాలు వెంటనే పరుగెత్తుకొని వస్తాడు. వస్త్రిప్ప టేబిల్ మీద రూల్సు వ్రాసిన కాగితం, కలం పంకాలుకు అందిస్తూ) ఇంకో నియమం కూడా వ్రాసుకోరా తొందరగాను.

పంకాలుః—చిత్తం. చిత్తం.

వస్త్రిప్పః—రూల్సు నెంబరు నాలుగు. ఎవరైనా పూర్వము మనము అద్దెకు వున్న ఇళ్లతాలూకు వాడు యజమానిని పట్టుకొని చితకబాదడానికి వచ్చినప్పుడు ముందుగా నౌకరుగున్నవాడే నాలుగు గుద్దులు గుద్ది ఏడుతాపులు తన్నవలెను. శిక్ష వ్రాసుకో. మూడు పిల్లి మొగ్గలు, నాలుగు చేజబ్బలు.

పంకాలుః—ముందుగా నేను కొట్టలేనండి. భూతాలుగారూ, ముందు మీరు బాదండి. తర్వాత నేను చితకబాదుతాను. మీరు మొదలెట్టండి.

వస్త్రిప్పః—(కంగారుతో) అల్లాకాదు. ముందు నువ్వే కలియబడాలి. వెళ్లు, కొట్టు. చూస్తూ వూరుకొంటావేం?

(పంకాలు యజమానియైన వస్త్రిప్ప నడ్డి వంచి నాలుగు పిడిగుద్దులు గుద్దుతాడు.)

వస్త్రిప్పః—వెధవా, వాణ్ణి తన్నమంటే నన్ను బాదుతావేంరా?

పంకాలు:—(ఒక పిడిగుద్దు గుద్ది) ఇది పట్టికెళ్ళి వాడి కివ్వండి.

భూతాలు:— ఆ. నా కివ్వమంటావేరా? (వస్త్రిప్ప నడ్డిమీద ఇంకో గుద్దు గుద్ది) ఇది పట్టికెళ్లి మీ పంకాలు కివ్వండి.

వస్త్రిప్ప:—బాబోయ్...బాబోయ్.

పంకాలు:—అయ్యో బాబోయ్. ఎల్లా గుద్దేస్తున్నాడో. (ఇంకో గుద్దు గుద్ది) ఇది పట్టుకువెళ్లి భూతాలు కివ్వండి.

(ఇద్దరూ వస్త్రిప్పని చితకబాదుదురు.)

వస్త్రిప్ప:—బాబోయ్...ఓ భూతాలోయ్... మీవి మీ కిచ్చేస్తా నాగరోయ్.

భూతాలు:—(గుద్దుట మాని) నాదగ్గర వెధవ వేషాలేస్తావేం. పోయి పట్టుకురా.

(వస్త్రిప్ప వారి మధ్యనుండి లోనికి పారిపోవును.)

భూతాలు:—(పంకాలువైపు తిరిగి) అంత గట్టిగా కొడతావేంరా మీ యజమానిని?

పంకాలు:—మా యజమానిగార్ని మేం కొట్టుకుంటాం, తిట్టుకుంటాం. మధ్య నువ్వెవడవయ్యా అడగటానికి? నువ్వెందుకు కొట్టేవు?

భూతాలు:—మా యింటినుంచి కొన్ని సామాన్లు మేం ఊళ్లో లేకుండా చూసి పట్టుకొచ్చేడు. అవి యిమ్మంటుంటే ఇవ్వకపోతే కొట్టేను.

పంకాలు:—నాకు నాలుగు నెలల జీతం ఇంతవరకూ ఇవ్వలేదు సరిగదా ఎప్పుడిస్తారండీ అని అడుగుతే 'నీకు నేనేమివ్వాలి. ఎందు కివ్వాలి' అంటూ వచ్చాడు. ఆ కోపం పట్టలేక సందు దొరికిందిగదా అని పట్టుకొని బాదేసి నా కసి తీర్చుకొన్నా!

భూతాలు:—అయితే అందరిదగ్గరా ఈడి పని యిల్లానే వుందన్నమాట. ముందీ ముక్క చెప్పేవు కాదేం మరికొంతసేపు నిలబెట్టి కొడుదుం.

పంకాలు:—ఇప్పుడుమాత్రం పోయిందేముందండీ. లోపలి వెళ్లి కేకేసుకొనిరానాండీ?

భూతాలు:—ఇప్పటికే బాధ భరించలేక చచ్చాడు. ఇంకా బాదితే అమాంతంగా చచ్చి ఊరుకోడు గదా!

పంకాలు:—ఆసంగతికూడా వాణ్ణే అడుగుదామండి. ఇంకా భరించగలనంటేనే కొడదాం.

భూతాలు:—ఇంతకంటే మనకి రావలసిన డబ్బు అణాపైసలతో వసూలుచేసే మంచిమార్గ ముంది.

పంకాలు:—ఉందీ? ఉంటే చెప్పండి మరి. ఇంకా చూస్తారేం?

భూతాలు:— రా. చెపుతాను. మన సొమ్ము యివ్వకుండా ఎక్కడి కెడతాడో చూద్దాం. నువ్వు మాత్రం వాడి వెనకాలే వుండి నా కేమంటే దానికి తాళం వేస్తూండు. నేను మిగతా నాటకమంతా ఆడిస్తాను.

పంకాలు:—ఓ. మీ చిత్తం వచ్చినట్టు చేస్తా. నాడబ్బు రాకుండా ఎక్కడికి పోతుందో నేనూ చూస్తాను. నడవండి.

(ఇరువురు నిష్క్రమింతురు)

## మూడవ రంగము

(వస్త్రిప్ప ఏడుస్తూ రోదనచేసుకొంటూ లోనికి ప్రవేశిస్తాడు).

వస్త్రిప్ప:—అబ్బబ్బ. ఎంత ఆపద వచ్చిందిరా దైవమా. ఇంత ప్రమాదం వాటిల్లుతుందని అప్పట్లో తెలిసివుంటే వాళ్లింటినుంచి ఊరగాయకుండలూ మిగతా సామానూ పట్టుకురాకేపోదును. ఒచ్చిన వెధవ చిక్కేమంటే ఈడు భూతవైద్యుడంటున్నాడు. అంతమాత్రంతో సరిపెడితే బాగానే ఉండును. లేనిపోట్ల దెయ్యాల్ని సృష్టించిపారెయ్యగలనంటున్నాడు. ఒచ్చిన ఖర్మఅది. (కాసేపు ఇటూ అటూ తిరిగి ఆలోచించి) ఈ సందర్భంలో ఓ మహాకవి చెప్పిన మాటలు జ్ఞాపకమొస్తున్నాయి. ఆపదలందు ధైర్యగుణం వహించాలంటున్నాడు. ఆపద మనకి రానే వచ్చింది. ధైర్యంకూడా రావాలి. రాకేం చేస్తుంది? మహాధైర్యం అవలంబించివుంటా...అన్నట్టు మరచిపోయాను: మనకి ఆంజనేయదండకం కూడా వచ్చును

కాదూ......శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం ప్రభాదివ్యకాయం...ఓ. భలే ఇంకేం కావాలి?... ఇంకో సంగతి. మనం దెయ్యాలంటే అట్టే భయపడక్ఖ్లేదు. దెయ్యాలచరిత్ర మనకేమైనా తెలీనిదా. అబ్బో! దెయ్యాలనిగురించి మనకు తెలిసిన 'హిస్టరీ' మరొకడి కెవడికి తెలుసును? మా తాత చచ్చిపోయి దెయ్యమై ఊరుమొదట్లో కూర్చొని ఒచ్చే పోయేవాళ్లని తెగ బాదేవాడని ఇప్పటికీ లోకంలో ప్రతీతి. మా మామ్మ కూడా చచ్చి దెయ్యమవుతానని నా చిన్నతనంలో అంటూండేది. మరిచిపోయింది కాబోలు. మా నాన్న రోజూ రెండూ మూడూ దెయ్యాల్ని బుజంమీ దెక్కించుకొని తిరిగేవాడు. మనకి దెయ్యాలన్నా భూతాలన్నా బాగా పరిచయమే కాదూ. ఈ సంగతి ఇందాకానే జ్ఞాపకమొస్తే వెధవని ఆక్కడే పళ్ల బొడిచే వాణ్ణి. ఇప్పుడైతేమాత్రం పోయిం దేముంది? పంకాల్ని పిలిచి వాణ్ణి దెయ్యంగా నటించమని, దెయ్యమొస్తే నే నే మనాలో ఒకసారి 'రిహార్సల్' వేసుకొంటా. అప్పుడు ఉన్న కొంత భయం పోయి భూతాలుగాడి పని పట్టొచ్చు. ఒరేయ్, పంకాలూ.

పంకాలు:—(తొందరగా ప్రవేశించి చేతులు నలిమికొంటూ) చిత్తం. పిలిచారాండీ?

వస్త్రిప్ప:— ఆ పాడుముండాకొడు కేం చేస్తున్నాడ్రా?

పంకాలు:—ఆ చాపమీద పడుక్కొని గుఱ్ఱెట్టి నిద్రపోతూ తెగదొర్లుతున్నాడండి.

వస్త్రిప్ప:—తిన్నతిండి అరగడంలేదు కాబోలు మొద్దుకి. అవునుగాని, పంకాలూ, వాణ్ణి ఒక్క సందేహం అడగడం మరిచిపోయాన్రా.

పంకాలు:—ఏమిటండీ అది?

వస్త్రిప్ప:—వాడు ఆడభూతాలకి వైద్యుడో! మొగభూతాలకి వైద్యుడో?

పంకాలు:—మొదట ఆడభూతాలకి మాత్రమే వైద్యుడటండి. తర్వాత మొగభూతాలకి వైద్యం చేయడం కూడా నేర్చుకొన్నాడటండి.

వస్త్రిప్ప:—ఎంత చిక్కు తెచ్చిపెట్టేడ్రా. ఒక్క ఆడభూతాల వైద్యుడు మాత్రమే అయివుంటే పట్టుకు చితక్కొట్టేద్దును. ఇప్పు డీ భూతాల్ని అవతలకి గెంటడం ఎల్లాగ?

పంకాలు:—అదే ఇందాకటినుంచీ అరుగుమీద కూర్చొని తెగ ఆలోచిస్తున్నానండి. ఒక్క ఉపాయం తోస్తోందండి.

వస్త్రిప్ప:—ఏమిటో చెప్పరా బాబూ. తొందరగాను.

పంకాలు:—చెప్పదును గానండి, బాబూ, మీరు నాకు ఎన్నాళ్లనుంచో యివ్వవలసిన జీతం యివ్వకుండా బాధపెడుతున్నారు, మరి మీకు ఎల్లా చెప్పను?

వస్త్రిప్ప:—ఇంతటి కష్టసమయంలో ఇల్లా అనడం నీకు న్యాయంకాదురా పంకాలూ. ఇల్లా అంటావనే ఇందాకా వీపుమీద ఎన్ని పిడిగుద్దులు గుద్దినా చచ్చినట్టు ఊరుకొన్నాను. ఈ భూతాలు అవతలకి వెళ్లిపోగానే నీ జీతం నీకు అణాపైసలతో చెల్లిస్తాను. ఒక్క జీతమే కాదు, నీ వేమైనా మంచి ఉపాయం చెబితే నీకు మంచిబహుమతీకూడా యిస్తాను.

పంకాలు:—అయితే చెప్తా వినండి. ధైర్యంగా యిద్దరం వాడిదగ్గరకెళ్లి 'మా యింట్లోంచి పో'అని చెప్పేద్దామండి. ఎంతకీ వెళ్లనని మూర్ఖంగా కూర్చుంటే కాళ్లావేళ్లా బడి ప్రతిమాలుకొందామండి.

వస్త్రిప్ప:—వెధవ ఉపాయం, ఇదిట్రా నీకు తోస్తా! అల్లా ఉత్తుత్తిమాటలతో పోయేవాడైతే ఎప్పుడో యింట్లోంచి తరిమివుండేవాణ్ణి. ఇంతవరకూ వుణ్ణిచ్చేవాణ్ణి?

పంకాలు:—అయితే ఒక పని చేద్దామాండీ? ఆ భూతవైద్యం మనంకూడా నేర్చుకొని వాడికంటె మనమే ఎక్కువ భూతాల్ని సృష్టించి వాడికీ, మన భూతాలకీ దొమ్ములాట కల్పిద్దామాండి? వాటి బాధ పడలేక చచ్చి ఊరుకొంటాడు.

వస్త్రిప్ప:—మనం భూతవైద్యం నేర్చుకొనే వరకూ వా డిక్కడుంటాడా ఏమైనానా?

పంకాలు:—అంతవరకూ యిక్కడే వుండమందామండి.

వస్త్రిప్ప:—నీ. మొఖంలా వుంది. చవటసలహాలూ, నువ్వూనూ!

పంకాలు:—లేకపోతే ఆ చాపతో సహీతంగా ఎత్తి వీధిలోకి తీసుకుపోదామాండీ?

వస్త్రిప్ప:—ఈ సలహా బాగానే ఉందికాని సగంలో లేచిపోతా డేమో! మంచమ్మీదైనా పడుకోన్నాడుకాదు వెధవ ఖర్మ. సులువుగా మోసుకెళ్ళి అవతల పెట్టేద్దును. అడ్డ మస్లిష్ఠంగా చాప మీద ఏడిచాడు.

పంకాలు:— చాపమీదనుంచి లేచి మంచమ్మీద పడుకోమని చెప్పనాండీ?

వస్త్రిప్ప:—ఛ! వెధవ! వాడు లేచాడంటే మన్నిద్దర్నీ కలిపి తింటాడు. ఒక్క ఉపాయం తోస్తోందిరా.

పంకాలు:—ఏమిటండీ అది?

వస్త్రిప్ప:—నువ్వే దెయ్యంలా నటించి నా దగ్గఅకు రా చెబుతాను.

(పంకాలు వికృతాకారంతో అరుస్తూ వస్త్రిప్పదగ్గరకు ఒస్తూంటాడు.)

వస్త్రిప్ప:— (నిర్లక్ష్యంగా) 'ఆ. పోదూ. నీలాంటిదెయ్యాలని యిదివరకు చాలామందిని చూశాను. అబ్బో! నాదగ్గర యీ వేషా లేమీ పనికిరావ్. ఫో ఫో.' ఇల్లా అంటాను వాడు దెయ్యాన్ని గనక సృష్టించి మనమీదకు పంపిస్తే. ఏం, బాగుంటుంది కాదూ?

పంకాలు:—(మామూలుగా నిలబడి సంతోషంతో) ఓ, మీ చిత్తం వచ్చినట్టుంది. తర్వాత ఏంచెయ్యనండి?

వస్త్రిప్ప:—ఏం చెయ్యాలో తెలీదూ? పిచ్చి వెంఖమా! రా 'మింగేస్తా, నమిలేస్తా' అంటూ మీద మీదకి రా. ఇంతమాత్రం తెలీదా?

(పంకాలు ఆ పూర్వమువలె వికృతాకారము పెట్టి, మింగేస్తా, నమిలేస్తా అంటూ వస్త్రిప్పని సమీపిస్తాడు.)

వస్త్రిప్ప:—'ఆ, నువ్వు నన్ను మింగేలోపుగా నేనే నిన్ను మింగుతాను. అంతగా వచ్చిందంటే మా తాతదెయ్యాన్ని, మా మామ్మదెయ్యాన్ని కూడా కేకేస్తాను. నాదగ్గఱ వెధవ్వేషాలేయకు. ఫో.......' అంటాను. అంటే అదనుకొంటుందీ—'వాడు దెయ్యాల్ని మింగేమనిషి కాబోలు. ఇంతవరకూ నేను మనుష్యుల్ని తినే దెయ్యాన్నే చూచానుగాని, దెయ్యాల్ని తినే మనిషిని చూడలేదు' అని అదే దొడ్లో, అదే దొడ్లో పెట్టేస్తుంది వెనక్కి చూడకుండాను. ఏం ఇల్లా చేస్తే బాగుంటుంది కాదూ?

పంకాలు:—చాలా బాగుంటుందండి. తర్వాత నే నేం చెయ్యనండి?

వస్త్రిప్ప:—మీద మీదకు వచ్చి నా పీక పట్టుకో దెయ్యం పట్టుకొన్నట్లు.

పంకాలు:—(వస్త్రిప్ప పైన చెప్పినట్లు చేస్తూ) పీక నలిపేస్తా.

వస్త్రిప్ప:— పోదూ. పీక నలిపినంతమాత్రాన ఛస్తే ఇదివరకు లక్షవీశై వేలసార్లు చచ్చేవాణ్ణి—అంత గట్టిగా నొక్కిపట్టుకోకురా చవటా. ఉన్న రెండు ప్రాణాలూ ఊడి చక్కాబోతాయ్.

(ఈలోపుగా పెద్దచప్పుళ్లు వినిపింపగా మహా భయముతో యిద్దరూ కౌగలించుకొందురు)

వస్త్రిప్ప:— బాబోయ్. దెయ్యమే అంటావా?

పంకాలు: — దెయ్యమేనని సాక్షాత్తూ తెలిసి పోడం లేదూ!

(చప్పుడు తిరిగి ఎక్కువ ధ్వనితో వినిపింపగా మహాభయముతో వస్త్రిప్ప పంకాల్ని కౌగలించుకొంటూ బెంబేలుపడుతూంటాడు.)

పంకాలు:—అదేమిటండి, మీరు బొత్తిగానూ! నేవెళ్లి చూసి వస్తా నాగండి.

(లోనికి పోయి వెంటనే భయపడుతూన్నట్లు నటించి వస్త్రిప్పదగ్గరకొచ్చి) బాబోయ్. చాలా పెద్ద రకందెయ్యమండోయ్. ఇంత దెయ్యాన్ని ఎప్పుడూ చూడలేదండోయ్.

వస్త్రిప్ప:—అయ్యబాబోయ్. ఇప్పు డేంచేద్దాం మరి? అసలు లోపల ఏం చేస్తోంది?

పంకాలు:—అటకెక్కి ఆవకాయ తినేస్తోందండోయ్.

వస్త్రిప్ప:—నిచ్చెనకి రెండుమెట్లు ఊడిపోతే అట గెల్లా ఎక్కిందిరా? చాలా 'హైక్లాసు' రకమై వుంటుంది. ఆవకాయ తింటే తింది, పాతచింతకాయ పచ్చడిమాత్రం తినొద్దని చెప్పరా. మా ఆవిడ పత్యానికని దాచుకొంది.

(పంకాలు చెప్పడానికని పోతూంటే దెయ్యం వేషం వేసికొన్న భూతాలు అతని కెదురువచ్చును.)

దాన్ని చూచి మహాభయమును నటించుచూ, వెనక్కి వచ్చి పారిపోతూన్న వస్త్రిప్ప కడ్డము వచ్చి అతిణ్ణి గట్టిగా కౌగిలించుకొని)

పంకాలు:—బాబోయ్. ఇల్లాగే వస్తోందం డోయ్.

వస్త్రిప్ప:—దగ్గరకు రావద్దని చెప్పరా. అక్కడే వుండి ఏంకావాలో కోరుకోమన్రా.

పంకాలు:—బాబోయ్. ఓదెయ్యమా! నీ కేం కావాలో అక్కడే వుండి కోరుకోమనవే. మా యజమానిగారికి నిన్ను చూస్తే భయం వేస్తోందిట.

భూతాలు:—మింగేస్తా.

పంకాలు:—మింగేస్తా నంటోందండోయ్.

వస్త్రిప్ప:—దెయ్యాల భాష వేరుగా వుంటుంది గదా. మామూలుగా మనిషిభాషే మాట్లాడుతోం దేంరా యీ దెయ్యం?

పంకాలు:—అబ్బ! ప్రతీదానికి ఏమిటండీ మీరు! దాని కా భాష రాదు కాబోల్ను.

భూతాలు:—మింగేస్తా.

వస్త్రిప్ప:—కొంచెం ధైర్యం తెచ్చుకొందాం రా పంకాలూ. బొత్తిగా పిరికిపందలమైతే ఎల్లాగరా? (దెయ్యంతో లేని ధైర్యం తెచ్చుకొని) ఎంతవరకూ మింగుతావో మింగు. మేం మాత్రం ఉత్తివెధవల మనుకొన్నావా? మాకుమాత్రం మింగడం చేతకా దనుకొన్నావా? ని న్నేం చేస్తామో చూడు. మేము ఇందాకా 'రిహార్సలు' వేసుకోలే దనుకొన్నావా? ఇంకా కావలిస్తే మా పంకాల్ని అడుగు. (పంకాలుతో) ఏరా పీనుగా! మాట్లాడవేంరా మొద్దు రాచిప్పలాగ.

భూతాలు:—(అంత కంతకు మీదకు వస్తూ) చంపేస్తా.

వస్త్రిప్ప:—చంపితే చంపేయ్. ప్రతీదానికీ చంపుతా చంపుతా నంటావ్. మహాచంపితే ఒక్కసారి చంపుతావ్, రెండుసార్లు చంపుతావ్. ఇంతేనా? ఎల్లకాలమూ మాదగ్గరే చంపుతూ కూర్చోవుగదా?

పంకాలు:—అది నిజంగా చంపుతూన్నట్టే కనిపిస్తోందండోయ్. అట్టే మాట్లాడకండి బాబూ. మిమ్మల్నే కాకుండా నన్నూ చంపేస్తుంది.

వస్త్రిప్ప:— మన్నిద్దర్నీ కూడా చంపద్దనరా. బ్రతికివుంటే బలుసాకు తిని బ్రతకచ్చు. దాని కేం కావాలో చెప్పమన్రా. కావలిస్తే అటగెక్కి పాత చింతకాయపచ్చడికూడా తినెయ్యమన్రా.

భూతాలు:— నేను కోరుకొన్న దిస్తావా యివ్వవా?

వస్త్రిప్ప:—ఇస్తాను. తప్పకుండా యిస్తాను. ఇంకెప్పుడూ గంగాళాలూ, బిందెలూ తస్కరించను రాను. బుద్ధొచ్చింది. కావలిస్తే ఒట్టుకూడా వేస్తున్నా. (పంకాలు చేతిలో ఒట్టువేయును)

భూతాలు:—నీదగ్గ రున్న డబ్బంతా యియ్యి.

వస్త్రిప్ప:— అయ్యో బాబోయ్. నాదగ్గర చాలా డబ్బుంది. ఎన్నో బాధలు పడి సంపాదించాను. అదంతా ఎల్లా యివ్వను నీకు?

పంకాలు:—మళ్లీ అల్లా అనకండి బాబూ. యీసారి నిజంగా మింగేయగలదు.

భూతాలు:—(ఉగ్రుడై) నీదగ్గర డబ్బంతా యిస్తావా యియ్యవా?

వస్త్రిప్ప:—ఒరే పంకాలూ. కొత్త దగ్గరకెళ్ళి నచ్చజెప్పరా దానికి. ఇది కాకుండా ఇంకొక టేమైనా కోరుకోమన్రా.

పంకాలు:— అబ్బబ్బ. దాన్ని ఏడిపించుకొని తినేస్తున్నారండి. దానికి డబ్బుకాక యింకేం కావాలి?

భూతాలు:—(దగ్గరకు పోయి వస్త్రిప్పపీక పట్టుకొని) ఏం చెప్పేవ్?

వస్త్రిప్ప:—(కళ్లు మూసుకొని) నాపీక నువ్వా, దెయ్యమా ఎవరు పట్టుకొన్నార్రా పంకాలూ.

పంకాలు:— భూతాలే పట్టుకొన్నాడం డోయ్. ఇనప్పెట్టితాళాలు తొందరగా మొల్లోంచి తీసి యిచ్చెయ్యండోయ్. అలస్యంచేస్తే ఉన్న పీక కొంతా నొక్కి పారేస్తాడు.

(వస్త్రిప్ప కళ్లుమూసుకొని మొలలోని యినప్పెట్టితాళాలు పంకాలుచేతిలో పడవేయగా, భూతాలు వానిని వదలివేయును. వస్త్రిప్ప పారిపోవును. భూతాలు తన మారువేషము తీసివేయును. భూతాలు, పంకాలు ఫక్కున నవ్వుకొందురు) నడు. మనకి కావలసిన డబ్బు తీసుకొందాం. మొదట మెల్లెంగా చెప్తే వింటాడూ?

[నిష్క్రమింతురు]

# ఉషోరాగము

శ్రీ కె. వి. ఆర్. నరసింహం

కవి

జిలుగుబంగరురంగు లీనెడు
వలిపె మాకసమందుఁ జిందఁగఁ
దొగరువన్నె పసిండిపావడ
నిగనిగలు చదలంటఁగా
ఎగిరిపోయెద వాకసమ్మున
నెవ్వతెవు నీ వమృతహాసిని ?
ఎందుఁ బోయెద వెందు నిల్చెద
వెద్ది కార్యమ్మో ?

ఉషస్సుందరి

నే నుషస్సతి నోయి కవిచంద్రమా !
నింగి నుండెద నోయి రససాంద్రమా !
నే నుషస్సతిని వేదత్రయీసంస్తుత్య
మానభాస్వన్మయూఖాళీవిరాజితను 'నే'
అంధతమసావృతాఖిలలోకకల్యాణ
సంధాయకానంతశక్తివిభ్రాజితను 'నే'
కాంచనాంబరశుభ్రకాంతిచ్ఛటాపూర
చుంబితాంబరధరాధరదరీగహ్వరను 'నే'
జవనాశ్వఘటితమామకదివ్యరథవేగ
గళదభ్రశకలవిభ్రమితనిర్ఝరకులను 'నే'

కవి

ఇన్నివన్నెలు నిన్నిచిన్నెలు
మిన్నుపైఁ బ్రకటించి పోయెదు
వన్నెలాడిరో నీ మనోహరు
వార్తఁ దెల్పఁగదే.

ఉషస్సుందరి

ఆమ్నాయవిద్యావిహారభూమి యతండు !
మూర్త్యంతరోద్భాసి మూర్తిత్రయుండతఁడు!
వెలుఁగుఁ జీకటియుఁ గల్పించు ఱేఁ డాతండు!
మాసర్తుపరిణామమహిమాన్వితుఁ డతండు !
సర్వసస్యప్రవర్ధనశాలి యాతండు !
తేజస్స్వరూపుఁ డుద్దీప్తాగ్నిసోముండు !
కుసుంభారుణదివ్యదేహుఁడు;
కుంకుమోజ్వలరక్తవసనుఁడు;
మధుమనోజ్ఞప్రథితనేత్రుఁడు
మామకీనప్రాణనాథుఁడు;
సకలఖగకులసార్వభౌముఁడు
సర్వమానవసాక్షిరూపుఁడు.

నక్షత్రములు

ఖరకరుం డతఁ డుగ్రకఠినశాసనుఁ డతఁడు
జ్వలదగ్నిపటుశిఖాచండరూపి యతండు
అన్యతేజస్సహనహీనుఁడు
మధురజీవనమథనతాపుఁడు.

కవి

నే నుషస్సీమంతినీప్రణయలబ్ధికై
యావిహాయసవీథి నేతెంచుచున్నాఁడ;
నే నుషస్సీమంతినీముగ్ధమధురావ
లోకనోద్రిక్తవిహ్వలితార్ద్రహృదయుండ;
చలువవెన్నెలడాలు
చదలు గ్రుమ్మరు రేలు
పరిఫుల్లమల్లికా
ప్రసవసౌరభ్యాలు;
మురిపెంపుముత్యాలు
మెఱుగులీనెడువాలు
కనుచూపులోఁ గ్రాలు
కపురంపు కిరణాలు;

అఱవిచ్చు గేదంగి
నెఱవిచ్చు సంపంగి
చిఱునవ్వునఁ జెనంగి
చెలగు జాజులు పొంగి;
చెక్కిళుల నొకమారు
చెందొవలు పొంగారు
లేగులాబుల తీరు
లేతచివురుల సొరు;
మన్మనఃప్రాజ్యసా
మ్రాజ్యలక్ష్మిరూప;
మన్మానసారామ
మధువాసరారంభ
కనుగొంటిరా? దివ్య
వనవాటికాఫుల్ల
మందారతరుషండ
కుందబృందములార!
కనుగొంటిరా? వియ
త్కల్లోలినీపంక
జారామమారంద
వారిపూరములార!
కనుగొంటిరా? నిత్య
గగనవీథీభ్రమ
ద్గ్రహతారకావళీ
విహగసంతతులార!
కనుగొంటిరా వీరు?
కరులార! గిరులార!
తరులార! ఝరులార!
నరులార! సురలార!

గ్రహములు

ఓ జగద్బాంధవా!
ఉపనిషద్రూప!
సకలగ్రహాధిపా!
సమయస్వరూపా!

పొడుపుకొండను లేతపొగడదండలు చేర్చి
సురపొన్నల నమర్చి విరజాజి జలగూర్చి
కరగిపోయిన దొక్క కాంత మిన్నుల పొంత
రాగరంజితగాత్ర! రమణీయమధునేత్ర!

సురలు

ఘనతమిస్రానిషూ
దనమరీచీజాల!
బుధలోకనుతశీల
పుంజీభవత్కాల!
కనినార మొక కాంతఁ గనకాద్రికందరా
రామవీథీవిహారానందతుందిలను;
సురలోకసుందరీకరపల్లవద్వయీ
కల్హారమాలికాగంధబంధురకచను.

నరులు

ఓ జగచ్చక్షూ! మ
హోజ్వలన్మూర్తీ!
సారసప్రియ! నిత్య
సన్మార్గవర్తీ!
కనినార ముదయాద్రికందరాంచలమందు;
కనినార మస్తాద్రికటకసానువులందు;
కనినార మొక దివ్యకన్యకాస్మేరమ్ము;
మధురమాంజిష్ఠకోమలకాంతిపూరమ్ము.

విహంగాదులు

మత్తమందేహాని
ర్మథనబాహుసహస్ర
వలమానఘనచాప
వల్లీలసద్రూప!
గిరితటీసానునిర్ఝరతరంగాళిపై;
కరిఘటాతరుషండఖగగరుత్పాళిపై;
కనినార ముదయదిక్కరికుంభసిందూర
రాగరంజితపాదరాజీవ నొక కన్య

తమిస్ర

కబళించినారు నీ కాంత నస్త్రాద్రి
ఘోరాంధకారదుర్వారరాక్షసులు
కబళించినారయ్య! కబళించినారు
వారుణీమదఘూర్ణితారుణాననులు

మహర్షులు

ఓ విహాయసమణీ!
ఏ జగద్బంధూ!
ఓ సుప్తలోకచైతన్యసంధాయీ!
యుష్మదాగమనసూత్రోత్సాహపల్లవిత
కుసుమితాశాలతాకుంజమంజులహృదయఁ;
ద్వదధీనచిత్తఁ బావనరూపలావణ్య
భాసితాఖిలవిష్ణుపదఁ గంటి మొక కన్య.

ఉషస్సుందరి

యుగయుగమ్ములనుండి నేను
జగములన్నియుఁ జుట్టినాను
యుగయుగమ్ములనుండి
జగములన్నియుఁ జుట్టి ['యుగ'
వగపుతో వలపుతో నొగులుచుండెద నేను

ఒకచోట నిల్వంగరాదు
సకుడ నీ రథ మెక్కఁగాదు
ఒకచోట నిల్చి నీ
ప్రకటబాహుసహస్ర
చకచకద్ద్యుతిజాలసంశ్లేషమునఁ దేల. 'ఒక'

కరుణావిహీన మీ నియతి
తెరియింపరాని దీ జగతి
కరుణావిహీనదు
స్త్రరభాగ్యసంబద్ధ
చరణబాహుద్వయీసర్వావయవ నేను 'కరు'
ఏల తెల్పవు నాకు త్రోవ
కాలరూపివి నీవు దేవ!
ఏల తెల్పవు సార్వ
కాలికాస్మద్వియో
గాలాపముఖరితాశావకాశము గాంచి. 'ఏ'
ప్రేమ నాపై నున్న సుంత
ప్రియురాలి బాయుదే యింత
ప్రేమ గల్గిన సుమ
స్సీమంతినీముహుః
కామితార్థముఁ దీర్పఁగా నింత తడవేల 'ప్రే'

రవి

మహతి మ్రోగుచున్నది యొకో
మంజుమంజుగీతిగతుల
మామకీనహృదయతంత్రి
మరల మరల మార్మ్రోగడి
అమృతఝరీపూరమ్ముల
నభిషిక్తంబైన యట్లు
నామెడంద పొంగి పొరలి
నాట్యమాడు నవ్యగతుల
మధురమధురవాక్యము లివి
మత్ప్రియాభిగదితమ్ములు
మంజుమంజుకోమలపద
మాధుర్యప్రచురమ్ములు
పోయెద నే వేవేగమ
పోలతిమిన్న కనుసన్నల
మెలఁగువాఁడఁ జెలఁగువాఁడ
వలపుల నలరించువాఁడ.

---

# తలో మాటా

[కథానిక]

●

శ్రీ రా. సీ. ఆంజనేయశాస్త్రి

౧

రెడ్డిగారిమీదనేనా ఆ నేరం? శ్రీరామరామ! ఆయన్నెవరేనా అంటే పురుగులు పడి చస్తారు. సాక్షాత్తూ సత్యహరిశ్చంద్రుడు. తల కొట్టి మొలేసినా, మాట తప్పగలడా? అందుకనేగా సుక్షేత్రంలాంటి పదిహేనెకరాలూ పోగొట్టుకొన్నాడు? ఆ లాఠీ ఛార్జీల రోజుల్లో అసలు బతుకుతా డనుకున్నామా? హూనంహూనం చేసేశారయ్యో జైల్లో పెట్టేముందు! జైల్లోవుండగా కామా పాపం ఆయనభార్య చచ్చిపోయింది? 'పెరోలు'మీద కూడా ఒదల్లేదు పాపాత్ములు! ఇంటికొచ్చి చూసుకునేసరికి, పాపం, కాపురం మంటూవుంది కొంప! అయినేమటుకు చలించాడా? కూతురి పెళ్లి చెయ్యాలనే వుందనుకోండి. ఎంత చెబితే మటుకు ఉద్యోగం ఆశించాడా? "ఇంకా తన జన్మ యావత్తూ ప్రజాసేవే చేస్తా"ననీ, "ప్రజలు అన్నం పెట్టలేకపోర"నీకదూ ఆయ నంటూవుండేవాడు.

కాలం అలా ఒచ్చింది! ఇంత బతికి చెడ్డవాడు కనక తిండీ తిప్పలూ లేని సంబంధం ఎలా చేస్తాడు మరి? ఊరికే కనిపించినప్పుడు దణ్ణాలు పెట్టేవారే గాని సమయం ఒచ్చినప్పుడు పాపం ఆయన్ని ఆదుకున్నవా ళ్లేరీ? ఏ సంబంధం చూసినా నాలుగు వేలూ అయిదువేలూ కట్నం అడుగుతుండిరి! తన యితే మాడి చస్తాడు గాని తన పిల్లవిషయం ఎలా చెప్పండి మరి! "అమ్మాయీ! నీ యిష్టం మెచ్చిన సంబంధం చేసుకో అమ్మా!" అని చెప్పగలడుమాత్రం గాని ఆ అమ్మాయి కిష్టంవచ్చినవాళ్లు ఆమెను చేసుకో వద్దూ! "అయిదువేలిస్తే చూస్తా న న్నాడుట!" మేనరికంవాడు ఆఖరికి! అప్పకొడుకే అనడం! కళ్లు నెత్తినుంచె! అసలు పెళ్లే చెయ్యకుండా ప్రజాసేవలోనే కూతుర్ని కూడా దింపుదా మనుకున్నాడుగాని, కొంతేళ్లనుంచి నూటిపోట్లు వినిపిస్తూనే ఒచ్చాయయ్యో బంధువులదగ్గిర్నుంచి. "పెళ్లాం బండలా లేదుకదక తన కింత తిండి ఒండి పడెయ్యటానికి కూతుర్ని దూడలాగా పెంచుతున్నాడు పెళ్లి పెటాకులూ చెయ్యకుండాను" అంటూను. పేదవ ఆకాశరామన్న ఉత్తరాలు కూడానుట! అన్నం లేక చస్తుంటే ఆర్చేవాళ్లూ తీర్చే వాళ్లూ లేరుగాని అక్కర్లేని ఊసు ప్రతివారికీ కావాలి!

పాపం! ఉరేసుకు చస్తాడేమిటి? ఆఖరు కేవయ్యినన్నూటపదహార్లో పోసి ఓఅయ్యచేతిలో పెడితే పిల్లని, తన కిహ ఉద్యోగమే అక్కర్లేదు. అందాకా మటుకు నాలుగురాళ్లు సంపాదించితీరాలి మరి! కూతురిపెళ్లికని బిచ్చం ఎత్తడం అతనికి సుతరామూ యిష్టంలేదు. కనక ఉద్యోగంలో చేరకతప్పలేదు. చేరాడు. ఆరునెలలయిందో లేదో నేరం ఒచ్చిపడింది. పాపపుణ్యాలు ఆ పరమాత్ముడికి తెలీవూ?... రెడ్డిలాంటి పుణ్యాత్ముడూ, సర్వస్వం ప్రజలకోసం అర్పించినవాడూ యిలాంటి లంచగొండితనానికి దాసుడయ్యా డనడం కేవలం దురాగ్రహం! దౌష్ట్యం!! అసలితని మంచితనాన్ని సహించలేనివాళ్లూ, లంచం యిస్తానంటే అతను పుచ్చుకోకపోవడంవల్ల కోపగించిన వాళ్లూ లేనిపోని నేరం యితనిమీద పెట్టివుంటారు! ఆయన లంచగొండి అనిమటుకు నేను చస్తే నమ్మను!

౨

ఆ! ఒకరు నమ్మే దేమిటి? ప్రత్యక్షంగా కనిపిస్తుంటేను! "కామినీ, కాంచనం" అన్నారు. విశ్వామిత్రుడిలాంటివాళ్లు చిత్తయ్యారు మేనకలాంటి దొచ్చి నుంచునేసరికి. సరే, యిహ డబ్బుకక్కుర్తి లేం దెవరి కంట! సాక్షాత్తూ కుబేరుడికయినాసరే మరోకోటి నవరత్నాలు పోగుచేద్దామనే వుండేతీరుతుంది! ఇహ మానవమాత్రుల మాట అనుకునే దేముంది? పదిహేనెకరాలూ పోగొట్టుకున్నాడూ అంటే చేత గాని దేబెగనక పోగొట్టుకున్నాడు. అదీగాక ఆరోజుల్లో కీర్తికాంక్షకదూ! ఊహూ! ఇంద్రుడివీ చంద్రుడివీ అనద్దూ మరి పత్రికానాయకులు! అదయింది. ఇప్పుడు వడ్డీతోకూడా కూడదియ్యా లనుకున్నాడు. సంగ్రహాణం మొదలెట్టాడు...లాఠీ దెబ్బలు తిన్నాడంటె...అదో ఆవేశం...మా గంగిగాడు తినలేదూ! తీరా పోలీసుస్టేషనులో తమార్పుగా చెప్పా డనుకోండి

అప్పుడే!...వాడి కో పదిగంటలలోనే తలతిరిగితే, యీయనగారికి పదేళ్లు పట్టింది. ఇంతేగదా భేదం! అదీగాక ఆ పలుకుబడినిబట్టిగాదూ యిప్పుడీ ఉద్యోగం వచ్చింది! అదీ ఒక మెరుగేగా! ఈమాత్రం ఆలోచించకుండా దిగాడూ ఆయన!! ఉద్యోగం అక్కర్లేదని మొదట్లో అన్నాడూ అంటే అదో తంతు! నాటకం...“ధర్మరాజులాంటివాడండీ...కనక బలవంతాన్నైనా ఒక న్యాయాసనంలో కూర్చోపెడితే ధర్మాన్ని నాలుగుపాదాలా నడుపుతా”డని నలుగురూ అనుకున్నారయ్యె!...కలికాలంలో ధర్మ మేమిటండీ! ఒక్క పాదంకాదుకదా, అరపాదంకూడా నడవదు... ఇహ యీ వాజమ్మగారా ధర్మాన్ని నడిపేది!... అఁ...నడిపాడుగా లంచాలు పుచ్చుకుని!...దేవుడు లేడుటండీ, ఎంత కానికాలమైనా! అధర్మాన్ని ఆయ నెప్పుడో ఒకప్పుడు ఛేదించితీరుతాడు......

మాటవరసకి రెడ్డిగారు ధర్మాత్ముడనే ఒప్పుకుందాం. వాతావరణం ఎలాంటిదో చూడండి. ఆరు నెలలు స్నేహం చేస్తే వీడు వాడవుతాడని...దేహంలో చీమూ నెత్తురూనా?... పాలా తేనేనా చెప్పండి! అదీగాక పద్దలాగా ఎదిగిన పిల్ల వుందయ్యె పెళ్లికి... మొగుడో! మొగుడో!! అనుకుంటూను...ఆ, ఎంత ఘనుడయితే మటుకు కట్నం కానుకా లేందే ఎవరు చేసుకుంటారండీ ఆడపిల్లని! కబుర్లు చెప్పటానికేం కానీండి, ఆ రెడ్డిగారికే ఓ మొగపిల్లా డుంటే తెలిసేది రంగు. ఆరు వేలిచ్చి మాట్లాడమనేవాడు. లేకపోతే ఆ మాటే ఇంకోరిచేత చెప్పించేవాడు...అదీ కాక పోతే “మొగపిల్లాడు వాడిష్టం బాబూ...నాకేం సంబంధం లేదు...నాకయితే మటుకు కట్నాలమీద ఏమాత్రమూ మోజులేదుగాని...” అంటూ తప్పుకునే వాడు...

ఇంతకీ! డబ్బంటే చేదా ఏమిటి చెబుదురూ?... ఏదో కూర్చున్నపాళంగా నాలుగువే లొచ్చి పడుతుంటే... అక్కర్లేదనే కుంక ఎవ రుంటారు? కాలం కర్మం మూడి బయటపడింది తప్పితే! ఎవరి కర్మ కెవరు కర్తలు లెండి!...

3

తనో పెద్ద ధర్మరాజల్లే “అబ్బబ్బె! అవేమీ పనికిరావండీ!”......అంటాడూ! జేబుమాత్రం ఊరుకునేవాడినా? మహామహావాళ్లనే అఘాతంలో పడేశా బంగారుచెప్పుతో! ఈకళ్ళన్నగాడో లెక్కా! జీతండబ్బులుతప్ప ఒక్క కానీ ముట్టుకోడుట! మడి కట్టుక్కూర్చున్న సంగనాచి కాపూలు! అఁ, ఇలాంటి కబుర్ల రాయుళ్లని లక్షమందిని చూశా...పెళ్లికెదిగిన కూతు రుండటంగా! పెళ్లిగిల్లీ లేకుండా! వాడి తల్లో జేజెమ్మ దిగివస్తుంది రేపిపాటికి...ఒకటీ రెండూనా ఏమిటి? నాలుగు వేలు! ఏమీ అల్లాటప్పాగా వచ్చే డబ్బుకాదు! నాలుగువందల పచ్చనోట్లన్నమాట! దాని కేం? “అది చాలదు బాబూ! ఇంకోవెయ్యి యిప్పించం” డంటే...తగలెయ్యనూ?...అసలు ఆ పద్ధతే పనికి రాదుట యీయనగారికి! గాంధీగారి నీతులన్నీ ఏకరువు పెట్టాడు మొన్న యింటిదగ్గరి కెళితే!...గాంధీజీ కేం? ఆయన పరమత్యాగి!...వారి నీతులు ఆదర్శాలే అందరికీని! గుళ్లు కట్టించి ఆయన్ని జేబుమాత్రం పూజించడంలేదూ? నాకు యిలవేల్పు అయిపోయాడు బాపూజీ!...ఇహ ఆయననీతులు యీ రెడ్డిమహర్షి గారు నా కుపదేశించక్కర్లేదు. గాంధీసూక్తావళి అనే పేరుతో భారతదేశంలోని ముఖ్యమైన ఎనిమిదిభాషల్లో నేనే అచ్చువేయించి ఉచితంగా పంచిపెట్టిస్తా గాంధీజయంతినాటికి!...

ఇది ప్రపంచం బాబూ! మనుష్యు లున్న ప్రపంచం! అన్ని నియమాలూ అందరికీ సాగుతాయా?... మహామహోఋషులకే సాగలేదు! కాస్త కుడీ ఎడమా ఒద్దూ వ్యవహారజ్ఞానం కలవాడికి మరి! రెడ్డిగారి మాటే తీసుకుందాం! గవర్నమెంటు యిచ్చే నాలుగురాళ్లూ తిండికీ బట్టకీ బొటాబొటీగా సరిపోతా యయ్యె! పైగా దానధర్మాలూ, యీయనగారి ధన ధాన్యాలికి! ఏదో శాస్త్రంచెప్పినట్టు! తను దూరటానికి సందులేదుగాని మెడ కో గంగడోలని, పెళ్లి కెదిగిన కూతు రొకర్తె! కాస్త మంచిసంబంధం కావా లంటే, నాలుగు వేలన్నా యివ్వాలా? ఆ పెళ్లి పుణ్యం నాకుగామా. యీ నాలుగు వేలూ ఆయన తీసుకుంటే ఏమీ ఆలోచన లేదయ్యె! పేరుకోసం ఏడిచేరకం లెండీ వీళ్లు! ఆ రోజుల్లో ఉన్న ఆస్తి తగలేస్తే నాలుగు లాఠీదెబ్బలు తినీ, జైలుకెళ్లీ పేరు సంపాదించాడు! ఇప్పుడు తనో అపరధర్మరాజని పేరుసంపాదిద్దామని అఘోరిస్తున్నాడు...చెప్పితే వీళ్లల్లో ధర్మం ఉందటండీ...కాల్చి పుటంపెట్టినా! అదే ఎదురుతిరిగింది నెత్తిమీదికి! వాడి పొగరు మండ! లంచం యివ్వ బోవడంకూడా నేరమేట! కనక నామీదే కేసుపెట్టచ్చుట! ఈప్రపంచంలో నామీద కేసుపెట్టగల

మెంగా దున్నాడూ!... గాంధీనిధికి కోటిరూపాయిలు వసూలుచేసి యిచ్చిందెవరు? కస్తూర్బాయిసంఘంలో సభ్యులెవరు? నిర్మాణకార్యక్రమానికి సంఘం పెట్టించిం దెవరు? చీటికీమాటికీ యీనాయకుడు వొచ్చాడనీ, ఆనాయకుడు వొచ్చాడనీ అంటే ఇల్లూ, తిండీ, కారూ, దండలూ, సన్మానపత్రాలూ సమర్పిస్తోం దెవరూ?... నేనుకదూ! ఈసంగతి తెలీం దెవరికీ...ఇంతకీ పేరు పొందిన ప్రజానాయకులచేత చెప్పిస్తిని! పసిమిరా అన్నాడు చాదస్తుడు. పోనీ ఊరుకుంటా మనుకుంటే నాకంఠంమీదికే ఒచ్చేట్టుందె! కనక తప్పనిసరిగా అతనిమీదే కేసు పెట్టాలి సొచ్చింది! పెట్టాను!... అనుభవిస్తాడు...భగవల్లీల తెంకి!

౪

నాశయానికి రోజులు కావండీ యివి! చాలా కాకుల్లో ఒక్క రామచిలుక వున్నా కష్టమే! చాలా రామచిలకల్లో ఒక్క కాకి వున్నా కష్టమే! ఏకో నలుగురితోపాటు కుడి ఎడమగా నంజుకుంటే పరిపోయేది. ఎవరు చూడొచ్చారు! ఇప్పు డేమైంది చెబుదురూ! నానాఅల్లరీనా, మరే మున్నానా? దేవుడంటివాడే అనుకోండి! "బ్రహ్మకైన పుట్టు రిమ్మతెగులు!" అని ఏకో కొత్త కహూక్కత్రి పడ్డాడేమో! నిప్పంటేగాని పొగ పుట్టదు. ఆ షాహుకారు ఎందుకైనా సమర్థుడేగాని, అన్యాయంగా ఒకళ్లమీద కేసుపెట్టడంమాత్రం అతనికి చేతరాదు. కాని లంచాలు తిన్నవాళ్లు బోలెడుమం దుండగానూ, వాళ్ల ని లసే మేపుతూనూ, వీరి కోరి యీరెడ్డిగారిమీద యీకేసు పెట్టటానికి కారణం ఉండితీరుతుంది...లంచం యివ్వబోయాడనే కేసు షాహుకారుగారిమీదే యీయన పెట్టబోతే దాన్ని యీయనమీదికే తిప్పికొట్టాడని వదంతి. వదంతులకేం కానీండి! అదే నిజమైతేమటుకు మహాఘోరం! తవకు మాలిన ధర్మం ఉందిటండీ! ఆత్మరక్షణ కెవ రేమన్నా చెయ్యవచ్చునని పురాణేతిహాసాల్లో స్పష్టంగా రాసి వుంది. ఆ పరమాత్ముడికే తెలియాలి నిజానిజాలు!

మన కెందుకొచ్చింది! ఏదో కృష్ణా రామా అను కుంటూ, చేతనైన పనులు చేసి రెండురాళ్లు సంపాదించి పొట్టనింపుకోటం, అనంతరం ఆ పర్మాత్మలో కలిసిపోవడం! అదే కావలసింది యీ నరజన్మప్రాప్తికి!...

౫

రెడ్డిగారిని విడుదలచెయ్యాలని ఆందోళన చేస్తే ప్రజలంతా మనవ ట్టుంటారు. కాని తీరా ఆందోళన మొదలెట్టేసరికి పరిస్థితు లెలా తిరుగుతాయో! అటు ప్రజాభిప్రాయాన్ని వెల్లడించినట్టవుతుంది, ఇటు పలుకుబడీ సంపాదించచ్చు. కాని రెడ్డిగారు మన సంఘంలో కలిస్తేగా? చివరి కేమంటాడో! నాలుగు రోజులు తిక్కేకనక అల్లరీ ఆందోళనా వెంటనే చెయ్యడం అవసరమే! తీరా పనంతా చేసినతర్వాత ఆయనగా రో పిచ్చిప్రకటన చేశాడంటే, కొంప పోతుంది. ఆయన జెయిల్లో వుంటేనేం? చస్తేనేం? కాని "మనకి ఉపయోగపడుతుందికదా యీ ఘటన!" అని చూస్తున్నాం. ముందుగా ఆయన్ని కలుసుకుని మాట్లాడివుంటే బాగుండేది. అయినా మించిపోయిం దేమిటి గాని? రేపే గోడలన్నీ పేపర్లంటించాలి "ప్రజానాయకుడు రెడ్డిగార్ని వెంటనే విడుదల చెయ్యాలి..."అంటూను. వాటితోపాటు మన సంఘ నినాదాలుకూడా కలిపితే బాగుంటుంది! లేకపోతే యీ ఘనకార్యం మనం చేసినట్లు ప్రజలికి తెలీదు.

నిజంగా లంచం తీసుకున్న ఓఆఫీసరుని విడుదలచేయించడంకోసం లోగడ ఆందోళనచేసినప్పుడు కూడా యింత విచారించలేదు మనం. ముందుగానే అతనితో మాట్లాడి, మొత్తం లంచంలోంచి సగం సంఘాని కిచ్చేట్టూనూ, అతను సంఘంలో చేరేట్టూనూ షరతు లేర్పరుచుకున్నాంకనక. కాని యీయన,పాపం, అసలు లంచమే పుచ్చుకోలేదు. అయినా కేసు! తిక్క కూడాను!! ఒకవేళ మన సంఘంలో చేరినా, కొంప దీసి "గాంధిగారూ, సత్యం అహింసా"అంటూ మొదలెడితే! కాని విడిచిపెట్టరాదు. జై రెడ్డిగారికి జై!!

# కలగూరగంప

## స్వర్గీయ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

(నిర్యాణము : 7-1-'50)

శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి మరణం ఈనాటి ఆంధ్రసాహిత్యానికి దురదృష్టమే.

నేటి విమర్శకలోకంలో ఆయన దొక విశిష్ట స్థానము. ఈ స్థానానికి వారు పోటీచేసి సాధించితీరుదామని ప్రయత్నం చెయ్యలేదు. స్వతః వారిబుద్ధి సునిశితమైనది. తద్ద్వారా ఆ స్థానం శాస్త్రిగారికి దఖలు పడ్డది. చిన్నవాడు కొంత భద్రాద్రిశాస్త్రులవారివద్ద కూలంకషంగా సంస్కృతం అభ్యసించి, ఆనాడు ఉపాధ్యాయవృత్తిలోని గౌరవమూ, పల్లెటూరి జీవనములోని ఆర్థికలాభమూ గమనించి ప్రైమరీపరీక్ష నిచ్చి మేడపాడు, వేటపాలెము ఎలిమెంటరీపాఠశాలలో శాస్త్రిగారు ఉపాధ్యాయపదవిలో ప్రవేశించారు. ౭ రూ. జీతమైనా అప్పటి రోజుల్లో అదొక పదవి లాగే ఉంటూండేది. అక్కడి వాతావరణము వారిని ముందుకు తీసుకువచ్చేది కాకపోవడము, ముందుముందు విమర్శరంగంలో వారు చేయవలసిన కృషి ఉండడమూ, క్రమంగా బందరుజాతీయకళాశాలలోకి వారిని వెళ్లేటట్లు చేశాయి. బందరుకళాశాలలో గ్రంథాలయము, శ్రీ పట్టాభి, కోపల్లె హనుమంతరావుగార్లవంటి జాతీయనాయకుల పరిచయము శాస్త్రిగారిని ఉన్నతస్థితికి తీసుకొనివచ్చాయి. కాకినాడకాలేజీలో ఉండగా బ్రహ్మర్షి వెంకటరత్నంనాయుడు, దుగ్గిరాల సూర్యప్రకాశరావుగార్లవంటి సంస్కర్తల సహవాసంతో వారి ఆశయాలకు ఒక రూపు ఏర్పడ్డది. అప్పుడే వారు భారతవిమర్శ, పరీక్షిత్తు మున్నగు విమర్శగ్రంథాలు ప్రకటించడం జరిగింది. దానితో శాస్త్రిగారి ప్రతిభ ఆంధ్రలోకానికి స్పష్టమైనది.

శాస్త్రిగారు వీరేశలింగం పంతులుగారి వంటి సంస్కర్తలు కారు. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి వంటి సనాతనులున్నూ కారు. వారి రెండుమార్గాలు మేళవించి, ప్రాచీననవీనసంప్రదాయాలు గ్రహించి మెలిగేతత్వం శాస్త్రిగారిపంథాగా ఏర్పడ్డది. "పురాణమిత్యేవ నసాధు సర్వం,నచాపికావ్యం నవమిత్యవద్యం" అనే కాళిదాసుసూక్తిని సార్థకంచేసినవారు శాస్త్రిగారనవచ్చును. కాని దానివలన శాస్త్రిగారికి కలిగిన నష్టాలు అపరిమితము. సనాతనులూ నవీనులూకూడా వీరిని తమలో చేర్చుకోలేదు. ఫలితము "మురారే స్తృతీయః పంథాః" కావడమే కాకుండా ఆమార్గంలో తమ ప్రత్యేకతను శాస్త్రిగారు నిలబెట్టుకొన్నారు.

వీరు సాధించిన భారతకృషి హద్దులేనిది. సంస్కృతభారతాన్ని నవీనదృష్టిపథంతో పఠించిన ఆంధ్రులు వీరొక్కరే అనడము అతిశయోక్తి కాదు. భారతాన్ని ఎన్నిపర్యాయాలు ఆమ్నాయం చేశారో లెక్కలేదు. అవిస్తంగా భారతామ్నాయాన్ని మథించి ఆంధ్రులకు భారతంపై విమర్శకు దారిచూపారు. వీరి భారతవిమర్శ వెలువడేనాటికి సంస్కృతభారతంపైగాని తెనుగుభారతంపైగాని వచ్చిన విమర్శగ్రంథాలు చాలా తక్కువ. అవి ఉన్నా లేనివంటివే. శాస్త్రిగారు భారతవిమర్శలో పేర్కొన్నట్లు సుయోధనవిజయం, పాండవదాయభాగంపై చర్చ మున్నగు ఏకొద్దిరచనలో కనిపిస్తాయి. వీరి గ్రంథంతరువాత ఖండనమండనాలు అనేకం ఉద్భవించాయి; ఉద్భవిస్తున్నవి.

శాస్త్రిగారి విమర్శ సమగ్రము కాకపోవచ్చు; దోషరహిత మనడానికి అభ్యంతరాలు అనేకం ఉండవచ్చు. పండితులకు ఆమోదయోగ్యం కాకపోవచ్చు; నవీనులకు అనువాదప్రాయం కావచ్చు. కాని విఘ్నేశ్వరుడు భారతలేఖకుడు కాడని, వ్యాసబాదరాయణులు భిన్నవ్యక్తులని, రాజసూయంలో శిశుపాలుడు యాగపశువు అయినాడని, జనమేజయుని సర్పయాగంలో బలియైనది నాగజాతిమనుష్యులేనని— ఇంకా ఇలాంటివి ఎన్నో భారతీయుల నమ్మకకు విరుద్ధమైనవి, చిత్రమైనవి అయిన క్రొత్త అంశాలు ఆంధ్రులకు అందించడంతో ఆంధ్రసాహిత్యంలో విప్లవబుద్ధి రేకెత్తించి శాస్త్రిగారు ధన్యజీవులయినారు



# విమర్శనము



### వజ్రాయుధం

కావ్యసంపుటి. కవి: శ్రీ సోమసుందర్. వెల ౧ రూ.

### త్వమేవాహం

అఖండకావ్యం. కవి: శ్రీ ఆరుద్ర. వెల ౧ రూ.

పై రెంటికీ ప్రకాశకులు: కళాకేళి, సామర్ల కోట.

### అగ్నివీణ

ఖండకావ్యసంపుటి. కవి: శ్రీ అనిసెట్టి సుబ్బారావు. ప్రచురణ: అభ్యుదయ. వెల రూపాయి.

నలభైల్లో కావ్యసాహిత్యం కొత్తదారుల్ని త్రొక్కిందీ; విశేషమైన సాహిత్యచరిత్రను వెనక పెట్టుకొని ఉత్తమజీవితానికి సాధనంగా కవిత్వం తన కర్తవ్యాన్ని నెరవేర్చుకొంటోంది. జీవలక్షణమైన మార్పును గుర్తిస్తోంది.

రసహృదయులైన కవులు వివేచనాశక్తిలో బాహ్యవాస్తవికతను గ్రహించేసరికి వారి భుజాలపై పెట్టని బాధ్యత ఏర్పడ్డాయి.

కవి కాలేని తత్వవేత్తను మించి, తత్వవేత్త కాలేని కవిని మించి, తత్వవేత్త ఐన కవి ప్రియురాలి వలె ఉపదేశించటం ప్రారంభించాడు. నలభైల కవిత్వానికి తాత్త్వికమూల్యాన్ని ఈవిధంగా ఆర్జించి పెట్టాయి.

శ్రీయుతులు సోమసుందర్, ఆరుద్ర, అనిసెట్టి రసమూర్తులైన కవులే కాక తత్వవేత్తలుకూడా. "కృత్రిమసమాజపు చట్టాలలో మేకుబందీ అయిపోయి గానుగెద్దులలాగ బతుకుతున్న" [ఆరుద్ర] సమకాలీన సామాజిక "లోకపు చీకటికన్ను తెరుస్తూ, నూత్న మానవుని కూకిరిపోస్తూ" [అనిసెట్టి] "తెలుగుగడ్డకు దీర్ఘ హేమంతమంతమై నవయుగోజ్వలసౌఖ్యవాసంత మరుదించు" [సోమసుందర్] నందాక "విజయమో, స్వర్గమో విక్రమించండి" [అనిసెట్టి] "పోరండి బ్రతుకుకై, పోరండి పుడమికై, పోరండి స్వేచ్ఛకై" [సోమసుందర్] అంటున్నారు. "భూమిపయి దేవతల భూమి విహరించవలె లేమిగలవారలకు కామితము పంచక" [ఆరుద్ర]అని ఆశిస్తున్నారు.

జీవితానికీ, సాహిత్యానికీ మధ్య గల అగాధాలనన్నీ పూడ్చి ఉత్తేజకరమైన, ఉత్తమసంస్కార సంపన్నమైన కావ్యసాహిత్యాన్ని ప్రసాదించిన ఈ కవులు అభినందనీయులు. రాంషా.

### నవీనభారత్

భారత రిపబ్లిక్ అవతరణము, దానికి పూర్వాంగముగా జరిగిన కార్యకలాపాలు, నవీనభారతస్వరూపము మొదలగు విషయాలను వివరించి వివరిస్తున్న చక్కని బుర్రకథ. రచయిత: ప్రయాగ నరసింహ శాస్త్రిగారు, బి. ఏ., ౮, మునియప్పిళ్లెవీధి, కోమలేశ్వరంపేట, మద్రాసు ౨. వెల ౪ అణాలు.

### రాయుల హిందీ కహానియా

మూడుభాగములు. హిందీ. బాలబాలికలకు నీతి, విజ్ఞానదాయకములైన చక్కని కథలు ఇందులో కూర్చబడినవి. హిందీని సాధనచేయదలచినవారికి ఇవి చాల ఉపయోగపడును. ప్రతిపుస్తకముచివరను కఠినశబ్దములకు తెలుగున అర్థములుకూడ ఇవ్వబడినవి.

రచయిత: విద్వాన్ ఏ. సి. కామాక్షిరావు గారు. ప్రకాశకులు: రాయలు అండు కో, కడప. వెలలు వరుసగా ౬, ౮, ౮ అణాలు.

### సాహిత్యసంపద

పూర్వసాహిత్య, నవ్యసాహిత్యములలోని కొన్ని కావ్యరచనలలోని విచిత్రవిశేషములను వెల్లడించు కొన్ని విమర్శకవ్యాసముల సంపుటి యిది. ఆంధ్ర వాఙ్మయవిశేషముల నెరుగగోరువారికి ఇది చక్కని మార్గదర్శిగా తోడ్పడుచున్నది.

రచయిత: పిల్లలమర్రి హనుమంతరావుగారు, యం. ఏ., ప్రకాశకులు: శారదాపీఠము, గుంటూరు. వెల ౨ రూ.

**_Bulletin of the Govt. Oriental Manuscripts Library, Madras._**

తమ స్వాధీనములోనున్న వివిధభాషల ప్రాచ్యలిఖితపుస్తకములలో విశిష్టమైనవానిని, వాని విశేషములను ప్రజాబాహుళ్యమున తెలియపరచు నుద్దేశ్యముతో మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమువారు పాలీనా రెండుసార్లు ప్రచురించుచున్న 'బులెటిన్ల'లో ఇది ద్వితీయసంపుటద్వితీయసంచిక. ఇందులో తెలుగుభాగమునగల రెండురచనలలోను తాళ్లపాక తిరువేంగళదీక్షితకృతమైన అమరుకము అవశ్యము గమనింపదగినదైయున్నది. ఈ బులెటిన్ల సంపాదకుడు సదరు భాండాగారాధికారి (క్యూరేటరు) యైన టి. చంద్రశేఖరన్ గారు. వెల ౨ రూ.

---

# గ్రంథస్వీకారము

## నలజారమ్మ

పద్యకావ్యము. రచయిత : కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారు. ప్రకాశకులు : కవికోకిలపబ్లికేషన్సు, నెల్లూరు. వెల ౧౦ అణాలు.

## అంధుడు

చిన్నకావ్యము. రచయిత : కనక మేడల వెంకటేశ్వర్లుగారు, సి. ఆర్. రెడ్డి కాలేజి, ఏలూరు. వెల ౮ అణాలు.

## శ్రీగోదాకల్యాణము

పద్యకావ్యము. రచయిత : లింగం లక్ష్మీజగన్నాథరావుగారు, పిఠాపురము. వెల రూ. ౧.

## రైతుగీతలు

రచయిత : మంగిపూడి పురుషోత్తమశర్మగారు. ప్రకాశకులు : స్వస్తిసదనం, పిప్పర, పశ్చిమగోదావరి జిల్లా. వెల ౧౦ అణాలు.

## జేగంటలు

రచయిత : జి. వి. కృష్ణరావుగారు. ప్రకాశకులు : ప్రజాసాహిత్యపరిషత్తు, తెనాలి. వెల ౩ రూ.

## మాయింట్లో

కథల సంపుటి. రచయిత : ధరణీకోట శ్రీనివాసులుగారు. ప్రకాశకులు : సాధనసమితి, ౧౯౫/B3, ఈసామియా బజారు, హైదరాబాదు, దక్కను. వెల ౮ అణాలు.

## రాగిణి

కథల సంపుటి. రచయిత : రావూరి భరద్వాజ. ప్రాప్తిస్థానము : కళావాణి, తెనాలి. వెల ౧ రూ.

## వాల్మీకిరామాయణవిమర్శనము

రచయిత : కొడాలి లక్ష్మీనారాయణగారు, బి. ఏ., మోపర్రు, వయా తెనాలి. వెల ౧ రూ.

---

## సవరణ

జనవరినెలభారతిలోని నావ్యాసమునందు శాసనపాఠములో రెండుచోట్ల తప్పుపాఠము వచ్చినది. శుద్ధపాఠ మీరీతిగా నుండవలెను:—

పుట ౯౦, పంక్తి ౧౬. నితరామి [| *] అప్పనసంత అగముసం

పుట ౯౨, పంక్తి ౩౨. జోద్ధకేద్ధకేశ్ [| *] జాతాజాతా

పుష్పలు (*asterisks*) పెట్టవలసినచోట శాసనపాఠమందంతటను ***Plus Mark*** (+) పడినది. వానిని పుష్పలుగా గ్రహించవలెను.

భా. వేం. కృష్ణరావు

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor— S. Sambhu Prasad.




# లిప్టన్స్
# అంటే
# మంచి టీ

LTX-181

# ఆస్థానకవి అస్తమయము



కీ. శే. శతావధాని బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు